**మీరు సంపాదించేదంతా మీ ధనం కాదు!**
**మీరు పొదుపు చేసేదే మీ ధనం!**

ఆ పొదుపు ధనాన్ని పెంచి మీ జీవితం సుఖమయం చేసేందుకు
ఆంధ్రా బ్యాంక్ అనేక పథకాలు చేపట్టింది.
భవిష్యత్తును భద్రపరిచే ఆ పథకాలు అన్ని వర్గాల వారికీ
అందుబాటులో వున్నాయి.

| | |
|---|---|
| గృహకల్ప | - మీకంటూ ఒక ఇంటి కోసం |
| మహిళా సంక్షేమ | - వనితలకు భవిష్యత్తులో భద్రతకోసం |
| కర్షక సహాయ | - రైతు సోదరుల సంక్షేమం కోసం |
| సంరక్ష | - వృద్ధాప్యంలో రక్షణ కోసం |
| సంక్షేమ | - ప్రమాదాలవల్ల రక్షణ కోసం |
| కిడ్డీ బ్యాంక్ | - మీ చిన్నారి పాపలకు బాల్యం నుండే పొదుపు నేర్పడం కోసం |
| కల్పతరువు | - మీ భవిష్యత్ అవసరాల కోసం |

ఇంకా ఎన్నెన్నో పథకాలు.........
ప్రజావసరాలకై పాటుపడేదే — ఆంధ్రా బ్యాంక్

**స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలతో-**



# ఆంధ్రా బ్యాంక్

(భారత ప్రభుత్వ సంస్థ)
కేంద్ర కార్యాలయం : సుల్తాన్ బజార్
హైదరాబాద్ - 500 001.

# ఇన్క్రిమిన బాలలు

## కేవలం పెద్దగా కాదు, ఎంతో చక్కగా పెరిగే పిల్లలు!




ఇన్క్రిమిన్ టానిక్ పెరిగే వయసులో ఎంతో పెద్ద...పెద్ద తేడాను తెస్తుంది. నిజానికి అసలు విషయం ఏమిటంటే ఇన్క్రిమిన్ టానిక్ ఇతర టానిక్‌లకన్న ఓ మెట్టు పైనుంది. ఎందుకంటే, ఆరోగ్యమైన పెరుగుదలకోసం అత్యవసరమైన విటమిన్లతోపాటు ఇన్క్రిమిన్‌లో లైసిన్ కూడా ఉంది గనక. ఆ లైసిన్ ఆకలిని పుట్టిస్తుంది.

పిల్లలు చక్కగా పెరగాలంటే బాగా తినాలన్న మాట ప్రతి తల్లికీ తెలుసు. ఈ ఇన్క్రిమిన్ అలా బాగా తినే ఆహారాన్ని మేలైన పెరుగుదలకు తోడ్పడేలా మారుస్తుంది మరి.

Lederle ఉత్పాదన

* అమెరికన్ సయానమిడ్ కంపెనీవారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్




## ఇన్క్రిమిన్* టానిక్

## తినేమంచి ఆహారాన్ని, తీరైనపెరుగుదలగా మారుస్తుంది.

Sista's-INC-973/80 Tel. F

సంస్థాపకులు
కీ॥శే॥ వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి
రాఘవయ్య

సంపుటి 19 ఆగస్టు 1981 సంచిక 7

# ఇదీ వరస...



ఈ నెల నవలానుబంధం

## హర్షభాష్పం

రచన : కొమ్మనాపల్లి గణపతిరావు

ముందు : రేఖ, వెనుక : మాధవి

జ్యోతి, పి. బి నెం. 1824, హైదరాబాదు-20

## సమస్త చందాదారులారా ఏకం కండు !

మీ ప్రేయసి, ప్రియుడు, భార్య, బ్రహ్మచర్యం - మెస్ భోజనం కనా అందమైనది జ్యోతి అని మీ అభిప్రాయం ఒకే....ఒకే....ఒకే....

కొత్త దంపతుల ప్రేమకానుకలా వెరైటీ ఆఫరొకటిస్తున్నాం మీకు....



సంవత్సర చందా దీపావళి ప్రత్యేక సంచిక, రిజిష్టర్డ్ పోష్టుతో సహా నేమో 60 రూ॥లండీ "అంతేనా" అనకండి, మీకు మొత్తం గమ్మత్తుగా 40 రూ॥లకే వచ్చేస్తుంది—ఇహ మీదే ఆలస్యం.

---

(స) కుటుంబరావుగారూ, గుర్నాథంగారూ, సుబ్బారావుగారూ, మేష్టారూ, గోపీ, సీతా, బాబీ....

## మీకు మాదో మాట



మీరు ప్రేమించ (కొన) డానికి అనేక కారణాలుండచ్చు.

"చేష్ట" సర్వత్రః అనీ—మీరు మరచిన తియ్యటి గుర్తులని మీ పెదవుల మీదకి తెప్పించే కమ్మటి సీరియల్ నవలలు వున్నాయి. అందమైన జలతారు జీవితాలదారి కోడూరి కౌసల్యాదేవి, సైంటిఫిక్ రీజన్స్‌తో మీ బుర్ర పెంచే యండమూరి వీరేంద్రనాధ్....ఇంకేం....

రెండోది—మనచుట్టూ చిన్న ప్రపంచం దాటి విజ్ఞాన పరిణితి చెప్పే శీర్షికలు....

మరోటేమో—ఎన్నెన్నో మీ ఇష్టాల మేరకి కధలు — ఎంత తింటే అంత తీపి—ఇంకా ఏవంటే - జోకులు, మినీకథలు, గేయాలూ, ఒకటేమిటి ? బోలెడు ఇన్ని కారణాలుగా మీరు చందాదారులుగా చేరబోతున్నారు....

### వివరాలు :

దీపావళి ప్రత్యేక సంచికతో సహా సంవత్సర చందా 60 రూ॥లు. ఐతే 40 రూ॥లకే లభిస్తుంది జ్యోతి ఆణిముత్యం నెలనెలా.

ఎ.
డిటో
రియల్!



# తొలిమాట

ధరలవేడి తగ్గలేదు గనక ఎండా
కాలం వొళ్ళుమండి వెళ్ళిపోయింది....
చల్లగాలి తిరిగింది ... మబ్బులుకూడ
బలుక్కుని జల్లు మనిపిస్తున్నాయి....
ఇక అధికధరల వర్షధారలో ఎందరు
ఎలా కొట్టుకుపోతారో గానీ!....

వెల పెరిగినా వెలలేని హాయి
చినుకులని చిలకించాలని జ్యోతి
ప్రయత్నం—కొత్త శీర్షికలొస్తున్నాయి.
హా! రుద్రగారు (మళ్ళీ) మీకోసం
కనిపిస్తుంటారిక .. సుఖస్య శ్రమం—
హాస్యకథల వివరం తొందర్లోనే తెలిసి
పోతుంది లెండి....

పునరపి హాస్యం

పునరపి లాస్యం

కదలండి.... పేజీ త్రిప్పండిక...






జులై సంచికలోని "చాలీచాలని సుఖం" కథ ఈ మధ్యకాలంలో జ్యోతిలో వెలువడిన కథలన్నింటిలోను హైలైట్. వాస్తవికతకు దగ్గరగా. మరెంతో మంచిశైలిలో రాసిన అక్కిపెద్ది వెంకటేశ్వర శర్మగారు అభినందనీయులు.

"లైఫ్‌లో డెవలప్‌మెంటుకి ఈ సోకాల్డ్ ఆర్ట్ అవరోధం.....ఫీలవడమనేది.....జస్ట్ వీక్‌నెస్... మనిషి ఊహించే జంతువు—అనే రూల్‌ని రూలవుట్ చేయాలి" అనే శేఖరం మాటలు యువతీ యువకులను ఆలోచింపచేసేవిగా ఉన్నాయి. ఇటువంటి రచనను ప్రచురించిన మా అభిమాన మాసపత్రిక "జ్యోతి"కి ప్రత్యేక అభినందనలు.

**కె. నీరజనాథ్**
విశాఖపట్టణం

జులై సంచిక ఆకర్షణీయంగా వుంది. "ఉన్నోళ్ళు" కథలో కొత్తదనం లేకపోయినా పేదల నిజాయితీ, గొప్పవాళ్ళ మనస్తత్వాలని సూర్యకుమారిగారు చక్కగా చిత్రించేరు. "డబ్బెవరికి చేదు" కథ నేటి అవకాశవాద తత్వంపట్ల వ్యంగ్యత్వం నింపుకున్నా, సహజత్వం లోపిస్తోంది. 26 లక్షలు కౌంటర్‌లో ఉండే బ్యాంక్‌లో సెక్యూరిటీ గార్డ్స్ తప్పకుండా వుంటారు. తరువాత అంతర్రాష్ట్రీయ నేరపరిశోధనలో, ప్రాంతీయ పోలీస్ శాఖలను సంప్రదించి వారి సహాయ సహకారములతోనే రంగంలోకి దిగుతారు. అదీగాక, రోడ్‌మీద కన్పించగానే, పిస్తోలుతో బెదిరించి మూడో వ్యక్తిని మధ్యవర్తిగా పెట్టుకుని ప్రశ్నించడం, అతను దొంగతనం చేసినట్టు భయంతో వెంటనే ఒప్పుకోవడం అన్నీ హాస్యాస్పదంగా వున్నాయి. "చాలీ చాలని సుఖం" కథ మొదలు బాగున్నా ముగింపు నచ్చలేదు. రజని పాత్రని మానసిక దుర్బలగా కాక, మనస్థైర్యానికి మారుపేరుగా చిత్రిస్తే, సమాజానికి ఆదర్శప్రాయంగా వుండేది. వమ్మి వీరభద్రరావుగారి "యోగం" జాతకాల పిచ్చి వున్నవాళ్ళకి కనువిప్పు కలిగిస్తుంది. "జరీపువ్వు" కథలో క్రొత్తదనం లేకపోయినా, పైవాళ్ళు తమ స్వార్థానికి క్రిందివాళ్ళని ఉపయోగించుకొనే తీరు బాగా వర్ణించేరు. యండమూరిగారి సీరియల్ "డబ్బు"లో కొత్తదనం వుంది. ఈ సంచికలో కథ మలుపు తిరిగింది.

**ప్రకాష్**
హైదరాబాద్

# జగన్మాత

తురగా జానకీ రాణి

"రుక్మిణిని చూద్దామే మనం వెళ్ళి" అన్నది మా ధనలక్ష్మి. రుక్మిణిని చూడడం అంటే చాల పరువునష్టం, అసహ్యమైన పని అని నాకు ముందే మనస్సులో భావం వుంది. అందుకని నేను ముఖం చిట్లించాను. ఆ పేరు నోరారా ధనలక్ష్మి పలకడంకూడా నాకు బాగాలేదు. 'రుక్మిణా, దానికి బతకడానికి సిగ్గులేకపోతే, మనకి చూడ్డానికి భిడియం వుండాలిగా' అని మనసులో అనుకుని-

"ధనలక్ష్మీ! నువ్వు కావాలంటే వెళ్ళి చూడు కానీ నేను రాను" అన్నాను క్లుప్తంగా.

అదికాదె! దాని గుండె పాపం అగ్నిపర్వతమైపోయి వుంటుంది. మనబోటి స్నేహితులు వెడితే, కాస్త చల్లారుతుంది. ఎవ్వరు పలకరించకపోతే అదిచచ్చిపోదటే?" అన్నది ధనలక్ష్మి

"నీకంత జాలిగావుంటె నువ్వెళ్ళు. పాపంట, పాపం! ఏడు తరాలకు సరిపడినంత పాపం అదే స్వయంగా చేసుకుని కూచుంది. నేను దాని ముఖం చూడను లక్ష్మీ! చూడ్డమంటూవస్తే తుపాకీతో కాల్చడానికీ, ముఖంమీద ఉమ్మేయడానికీ అంతే", అన్నాను చాలా ఖచ్చితంగా.

మేము చెప్పుకుంటున్న రుక్మిణికి ఒక గాథవుంది. దానికి ముప్పైఏళ్ళు దాటినా పెళ్ళికాలేదు. చేసే దిక్కులేదు. ఆ మాత్రం వుంచి, దాని పెంపుడు మేనత్తయిచ్చింది. అల్లా వంటరిగా పెళ్ళికాకుండా బతుకుతుంటే, ఎవరితోటో సంబంధం కలిసి, ఒక కొడుకుపుట్టాడు, పెళ్ళికాకుండానే తల్లి అయిన రుక్మిణి నా దృష్టిలో పతిత, పాపి.

చిన్ననాటినుంచి నేను, రుక్మిణి, ధనలక్ష్మి ఒకే వీధిలో వుంటూ, కలిసి పెరిగాము ఎన్నో ఆటలు ఆడుకున్నాం. ఒక బండిలో ఎక్కి బడికివెళ్ళాము ఒకే కాలేజిలో చేరి, పక్కపక్కన కూచుని గ్రాడ్యుయేట్సుమయ్యాం. అంత ప్రాణస్నేహితురాలు యింత పాడుపని చేసిందంటే నాకు కడుపులో మంటలేచింది.

"అది కుమిలి కుమిలి ఏడుస్తూ, పుట్టిన నలుసుని చూడకుండా కూచొనుంటుంది. నేను వెళ్ళి ఓదార్చి, ధైర్యం చెబుతాను. ఆపిల్లవాడిని ఏం చేయాలో సలహాయిద్దాం. ఆపాటి మనమైనా చేయకపోతే, అది ఏమైపోతుంది? అందరు కాకుల్లా పొడుస్తారు. మనమూ పొడిస్తే, మన స్నేహానికి విలువ ఏముంది?" అంటూ ధనలక్ష్మి మరొకరౌండు వాదన ఆరంభించింది.

'నా ఉద్దేశ్యంలో రుక్మిణిని ముఖం వాచేటట్లు చీవాట్లు పెట్టి, ఎడాపెడా వాయించి, ఆ పిల్లాడిని ఏ దిక్కులేని శరణాలయంలోనో పడేయించాలి. వాడు అసలు పుట్టేలేదని చెప్పి, దాని పాపానికి ప్రాయశ్చిత్తంగా, ఏ ఆశ్రమానికో పంపేయాలి.' ఈ సంగతి స్పష్టంగా చెప్పాను ధనలక్ష్మికి.

"పోనీ, అల్లా చీవాట్లు పెట్టడానికైనా వెళ్ళాలిగా? పద, ఆపని నువ్వే చేద్దువుగాని. అది ఏడుస్తోంటే, నేను ఓదారుస్తాను"



అన్నదామె.

అసలు శీలం కోల్పోయిన తర్వాత ఆడదాని జన్మకు విలువేలేదు. ఏదో ఒక బలహీన క్షణంలో ఎవరికైనా లొంగినా, ఆపాప ఫలాన్ని మోసి, కనడమా? ఆ సంగతి నలుగురికీ తెలిసిపోయినా, యింకా ప్రాణాలతో వుండడమా—ఛీ! ఇల్లా ఆలోచిస్తున్న నాలో ఒక అసహ్యం, వికారంగా కడుపులో తిప్పేసింది.

ధనలక్ష్మి నిట్టూర్చింది. జాలిగా, నా కళ్ళలోకి చూసింది. "చూడు, మనం చిన్నప్పుడు ఆడుకునే రోజుల్లో, దానికి వాళ్ళ బామ్మయిచ్చిన ప్రసాదం మొత్తం నీకే పెట్టేది, జ్ఞాపకముందా? నీకు స్కూల్లో ప్రైజురావడం కోసం, తను పాటలపోటీల్లోకి రాకుండవుండేది, గుర్తుందా? కాలేజీలో అందాలపోటీలో నువ్వు నెగ్గాలని, తను వెనక్కి వుండిపోయేది; మరిచిపోయావా?"—అంటూ ధనలక్ష్మి మొదలు పెట్టిన యీపాతకథలన్నీ వింటూంటే, యీసోదికంటె, రుక్మిణి యింటికి ఒక విజిటు నయమనిపించింది.

"ఊఁ, సరే వస్తాను. కానీ ఒక షరతు. అక్కడ పదినిముషాలు మాత్రం వుంటాను. ఏడిచి మొత్తుకున్నా నేను కరగను. దులిపి వేస్తాను. నువ్వు అతిగా ఓదారుస్తూ, ముద్దు చేశావంటే, నేను వూరుకోను. సరేనా? అల్లాగైతే వస్తాను" అన్నాను. ధనలక్ష్మి వొప్పుకొంది.

సరే, బయలుదేరాం—కుతూహలం, అదీ ఎలావుందోనని ఆ కులటని చూసి, మనం చేతులు, కాస్త కడుక్కుని, ప్రక్షాళనం

చేసుకోవాలే అని ఒక బాధ.

ఇల్లు కొంచెం వెతికినా, త్వరగానే చేరి, రిక్షాదిగాం. తలుపు తీసివుంది. నేను రిక్షాకు డబ్బిస్తోంటే, ధనలక్ష్మి తలుపు కొట్టింది. రుక్మిణే తలుపు తీసింది.

"హాయ్! రండి, రండి. ఏమిటల్లా నిల్చబడి పోయారావేఁరా." అంటూ నా చేయి పట్టుకుని, లోపలికి గుంజినంతపని చేసింది. మేము లోపలికి వెళ్ళగానే తలుపు గడియ పెట్టేసింది.

"లోపలే గదిలో కూర్చుందాంరండి. నా కొడుకు నిద్రలేచే సైమయింది, లేచాడంటే యిల్లు ఎగరకొట్టేస్తాడు" అంటూ మా యిద్దర చేతులూ వదలకుండా పుచ్చుకుని, లోపలకు తీసుకెళ్ళింది. ఉయ్యాల చుట్టూ దోమతెర, లోపల పడుకున్న రెండు నెలల పసివాడు; వాణ్ణి చేతుల్లోకి తీసుకుని. "ఆ మంచంమీద కూచోండర్రా ఎవరికి యివ్వను మీలో? అసలు యింత పసివాడిని ఎత్తుకోవడం ఎవరికిబాగా ప్రాక్టీసు మీయిద్దరిలో?" అన్నది నవ్వుతో. దాని కళ్ళనిండా కాటుక, చెంపలు పలచగా, తాంబూల రంజితాలైన పెదవులకి అందమిస్తూ మెరుస్తున్నాయి కాళ్ళకి చెప్పులు, బాలింత తనం యింకా జివజివలాడుతూ పచ్చిగా వంటిని చుట్టుకున్నట్టు కనిపించింది.

ధనలక్ష్మి కాస్త తేరుకున్నట్లు ముఖం పెట్టి, "ఉండు, కాస్త, చేతులు కడుక్కొని వస్తాం." అంటూ లోపలికి నడిచి, నువ్వురా అన్నట్లు నా వంకచూసింది. నేను వెంట వెళ్ళి శుభ్రంగా కాస్త, చేతులు కడుక్కొని వచ్చాను.

మంచంమీద కూర్చున్న ధనలక్ష్మివళ్ళో ఆ బాబుని పెట్టబోయి, "ఒసే! నువ్వు ధనంకంటూ పెద్దదానివి, వాడిని ముందుగా నువ్వే ముద్దుపెట్టుకుని ఆశీర్వదించవే" అన్నది.

అంతే నావళ్ళో మెత్తగా, మృదువుగా, బుల్లి చేతుల అబ్బాయి పేలవంగానవ్వాడు.

"మాట, పలుకు లేకుండా అల్లా వున్నారేమిటి? మీకు నా కొడుకు - ఎవరనుకుంటున్నారు? ఇంక వేరే లోకంలేదు నాకు. వేరే లోకమే లేనప్పుడు, యింకా ఆ లోకంలో వాళ్ళేమేమను కుంటున్నారో నాకేం పడుతుంది? అంతా నాపోలికే కదూ? ముక్కుచూడు" అన్నది రుక్మిణి వెలిగిపోతున్న కంఠంతో. నా చేతులు, ఆపిల్లవాడిని గట్టిగా, పడిపోకుండా పట్టుకుంటున్నాయి.

"నాకు ఎప్పుడూ నా అనేవారు లేరని నాకు పిచ్చెక్కి పోతుందని అనుకున్నాడు భగవంతుడు. పాపం అందుకే నాకీ వరం ప్రసాదించాడు." మంచిపేరు దొరకడం లేదమ్మా వీడికి! మా అమ్మ, నాన్న, అన్నయ్య వదిలి వేసినా, మీరొచ్చారు నన్ను చూడటానికి. ప్రాణస్నేహితులంటే మీరే!" అన్నది మళ్ళీ- నేను గుటకమింగాను, జవాబు లేదు.

నావళ్ళో బాబు బరువుగా తన మృదుత్వాన్నంతా, నామీదవేసి నన్ను నొక్కేస్తున్నట్లుగా. ధనలక్ష్మి మాత్రం పిచ్చినవ్వు ఒకటి ముఖానికి తగిలించుకొని మార్చి మార్చి పిల్లవాడినీ, రుక్మిణినీ చూస్తోంది.

"కూచోండే! ధనమ్మా కాఫీయిస్తాను. వాడు లేచేలోగా అన్నిపనులూ పూర్తిచేసుకుంటాను. లేచాడంటే, నాకు యింకపదీ చూడాలని పించదు. వాడి ముఖంలోనే చూస్తూకూచుంటాను" అంటూగబగబా కాఫీ ప్రయత్నం చేయడం మొదలెట్టింది. ధనలక్ష్మివాడిని తనవళ్ళోకి తీసుకుంది. మా యిద్దరిమధ్య మాటలుకావుకదా, చూపులు కూడాలేవు.

మేముకాఫీలు తాగుతుంటే రుక్మిణిపిల్లవాడిని తీసుకుంది. వాడినిపొదివి పట్టుకొని

దగ్గరగా హత్తుకున్నప్పుడు ఆమె వేపు చూశాను. అరమూతలుపడుతున్న కళ్ళల్లో స్వర్గకాంతి చిన్న నవ్వుగా-విచ్చిన పెదవిలో గర్వరేఖ. వేలికొసలనుంచీ అనురాగం జాలు వారి వాడి అణువణువూ తడిమి, పునీతమౌ తున్నట్లు స్పష్టంగా కన్పిస్తున్న చేతులు.

కాఫీతాగి, "వస్తాం రుక్మిణీ! ఆరోగ్యం జాగ్రత్త" అంటూ బయటికి వస్తోంటే—

"మరోసారిరండే. అల్లావచ్చి, యిల్లా వెళ్ళిపో తున్నారు-ఏమిటో—వీడి నాన్నకి గుండెధైర్యంలేక, యింతవరకు వచ్చి చూడనేలేదు. తప్పించుకునితిరుగుతున్నారు, అంత భయపెట్టాడు నాబాబు, అంతటి మగవాడినీ!" అన్నది గలగలనవ్వేస్తూ.

మేము రిక్షా కేకవేయకుండా నడుస్తోంటే "ఏమే! కాలుస్తానన్నావు, పొడిచేస్తానన్నావు, తిట్టిపోస్తానన్నావు అల్లా మగిరాయిలా కూలబడ్డావేం." అన్నది ధనలక్ష్మి.

నేను ఒక్క క్షణం మూలుకున్ని "నాసంగతి సరేగానీ; ఓదార్చుస్తానన్నావు, ధైర్యం చెబుతానన్నావు. నువ్వూ అవాక్కయి పోయావేం?" అన్నాను ఎదురు ప్రశ్నగా. రిక్షా ఎక్కాలన్న ధ్యాసలేకండా గబగబా నడుస్తున్నాం.

"అది పడవనిదే - నేనేం ఓదారుస్తాను?" అన్నది, ధనలక్ష్మి. ఒక గొప్ప సత్యాన్నీ, తేజస్సునీ ఆ యింట్లో వదిలేసి వస్తున్నట్లు అప్పటికే అనిపించసాగింది.

"అదెందుకు పడుస్తుంది? హిమాలయ పర్వత శిఖరం మీద కూర్చుని, మనబోటి వాళ్ళందర్ని చిన్న చూపు చూస్తున్న జగన్మాత అది ఎందుకేడుస్తుంది?" అన్నాను.

# శ్రేయస్సు

మధురాంతకం రాజారాం

పండు చలికాలం. తెల్లవారుజామున అయిదు గంటలై వుంటుంది. నిండుగా ఓ శాలువా ముసుగెట్టుకుని బయల్దేరడానికి సిద్ధంగా వున్న బస్సెక్కాను. కాకీ దుస్తులకు తోడు, తలచుట్టూ ఒక మఫ్లరుగూడా బిగించి ఎస్కిమోవాడిలా వున్న కండక్టరు చేతికి డబ్బిచ్చి టికెట్టు తీసుకున్నాను. వెళ్ళి వెనకసీట్లో కూచున్నానేమో: కాసేపటి కల్లా వెచ్చగా నిద్ర పట్టింది. సూర్యోదయమైన తర్వాత ఏ పదుగంటల ప్రాంతంలోనో హఠాత్తుగా మేలుకున్నాను. గొంతు చించుకుంటూ ఎవరో కారు బారు నేసేస్తున్నారు

"ఆగమన్నచోట ఆగదు. దించమన్నచోట దించదు. ఏమార్కిసీవాళ్ళయ్యా మీరు? తీసుకెళ్ళి సుబ్బరంగా ఏ గోదారిలోనో దించేస్తారు!" అంటూ ఓ పల్లెటూరాయన చికాకుపడిపోతున్నాడు.

"వాళ్ళదంతా ఇష్టారాజ్యమైపోయిందిలెండి! వాళ్ళుండడం ప్రజలకోసం గాదు. నానా అవస్థలూ పడుతూ ప్రజలుండడం వాళ్ళకోసం! ఉలక్కుండా పలక్కుండా అలా గుండ్రాయిలా కూచున్నావేమయ్యా కండక్టరూ! ఆ పెద్దమనిషి ఏదో అడుగుతున్నాడు. జవాబు చెప్పక్కర్లా?" చిన్న సైజు పార్టీ నాయకుడిలాంటివ్యక్తి రంగంలోకి దిగి, నిలదీసి అడుగుతున్నాడు.

కండక్టరు చేతులు పైకెత్తి మోడిస్తూ అన్నాడు—"అయ్యా! మీకు నమస్కారం! గుండ్రాయిని కాబట్టే యింకా బ్రతికున్నాను. మనిషినై వుంటే ఈపాటికెప్పుడో తిరిగి రాని ప్రయాణానికి టికెట్టు పుచ్చుకుని వుందును. ఇది ఫాస్టు ప్యాసెంజరయ్యా బాబూ-అని వెయ్యిసార్లు చెప్పాను. దీనికి ఖరారుగా కొన్ని స్టాపింగులున్నాయి. అంతకుమించి మరెక్కడా ఆగరాదని రూలు...."

అరరే, భ్రమ కాదుగదా! ఈ గొంతుక ఎక్కడో విన్నట్టుంది...

"రూలు! ఏం రూలయ్యా, బోడి రూలు...." కండక్టరు నోటినుంచి వెలువడిన చివరి మాట ఆధారంగా ప్రయాణీకుల్లో మళ్ళీ చర్చ ప్రారంభమైపోయింది.

చిన్న బస్తీలాంటి గ్రామం ఒకటి ఎదురైంది. రచ్చదగ్గర మలుపులో బస్సాగింది. రెండు బళ్ళకు సరిపోయేటన్ని కూరగాయల తట్టలతో అక్కడ దాదాపొక యాభై మంది ప్రయాణీకులు బస్సుకోసం వేచివున్నారు.

వాళ్ళు దిగేవాళ్ళను దిగనివ్వలేదు.

'బలం వుంటేనే బ్రతుకు. మేమెక్కుతున్నాం. దిగేవాళ్ళకు దమ్ములుంటే మాతో తలపడొచ్చు' అన్నట్టుగా వాళ్ళు తమతమ బుట్టలతో, తట్టలతో, మూటలతో, సంచులతో లోపలి కొచ్చేస్తున్నారు. 'మేము మాత్రం ఏమంత నాజూకు మనుషులమా' అన్నట్టు దిగవలసినవాళ్ళు ఒక ఉప్పెనలా వెళ్ళి వాళ్ళపైన పడ్డారు సంకుల సమరం... జీవన్మరణ పోరాటం.

"అయ్యా, ఆగండి! బాబూ దయ పెట్టండి! అయ్యలారా, మీకు శతకోటి దండాలు!"—కండక్టరు కేకలతో బాటుగా ఆ తడి ఆకారంగూడా గుంపులో భంకరలు తిరిగింది. గిరకీలు కొట్టింది. 'ఎక్కడ ? ఎక్కడ ? కండక్టరెక్కడ ?' అనుకోవడం వినిపించింది. బస్సులో ఎక్కడివాళ్ళక్కడ సర్దుకునే సరికి రోడ్డుపైన వెల్లకిల పడిన కండక్టరు దుమ్ము దులుపుకుంటూ పైకిలేచి వచ్చాడు.

"బుద్ధుండ నక్కర్లేదా ? నిన్నెవరయ్యా యిక్కడ బస్సాప మన్నది ?" డ్రయివరు ఉరిమినట్టుగా అడిగాడు.

"మరిక్కడ స్టాపింగు వుందిగా ?"

"అయితే అఘోరించు"

టికెట్లు కొనుక్కోమనీ, తట్టలకు బుట్టలకు లగేజ్ చెల్లించమనీ కండక్టరు ప్రాధేయ పడుతున్నాడు. 'పానీలేచూద్దాం' అన్నట్టుగా ప్రయాణీకులు ఎవరి ధ్యాసలో వాళ్ళు ముఖావంగా వుండి పోతున్నారు.

ఇంకొక పదిమైళ్ళు వెళ్ళేసరికి మళ్ళీ ఒక పెద్ద గ్రామం. అక్కడా ఒక జనసందోహం. 'ఆపు, ఆపు' అంటూ ఓ యిరవై మందిదాకా అడ్డంగా చేతులు సాచేశారు.

అప్రమత్తుడైపోయిన కండక్టరు "సీటు లేదు. రైట్, రైట్" అనేశాడు.

వెన్నంటి వస్తున్న జనంలోనుంచి ఏకధాటిగా తిట్లు వినిపిస్తున్నాయి. 'మళ్ళీ ఈదారిలో రావూ ? ఏముక లేరేస్తా చూచుకో ?'

విసురుగా ఓ రాయి వచ్చి పడినట్టుంది. రేకులపైన 'ఢమీ' లమని చప్పుడు.

కండక్టరు వానలో తడిసిన పూరేడి గువ్వలా తన సీట్లో తాను ముడుచుక పోయాడు.



ఎనిమిదిన్నరకు బస్ గమ్యస్థానం చేరింది. చిట్టచివర క్రిందికిదిగిన వాణ్ణి నేనే నేమో! సర్వమూ పోగొట్టుకుని వచ్చిన కాందిశీకుడిలా అల్లంత దూరాన నిలబడి వున్న కండక్టరు కనిపించాడు.

అతడివైపు పరకాయించి చూశాను, అతడుగూడా ఒకటి రెండు క్షణాలు నావైపలాగే నిశ్చలంగా చూశాడు. ఆ కళ్ళలో ఒక స్మృతిరేఖ తటాలున వెలిగింది—"మేష్టరుగారూ! మీరా! ఈ బస్సులోనే వచ్చారా?" అంటూ దగ్గరగా వచ్చేశాడు.

నాకున్నూ గుర్తొచ్చింది—

"అరె, నువ్వా నాయనా! మూడేళ్ళ క్రితం....ఎం. ఎ. తెలుగులో .... రాంక్ తెచ్చుకుని...."

"సర్లెండి....ఇప్పుడు మీరు...."

"యం. ఫిల్. చేయడానికి సబ్జక్టుగూడా రిజిష్టరుచేసుకుని...."

"మేష్టరుగారూ! కాఫీ ఏమైనా...."

"ఉండుండు. దేనిపైన నీ రీసెర్చి? ఆధునికాంధ్ర సాహిత్యంలో విశ్వశ్రేయస్సు గదూ?"

"మీకు పుణ్యముంటుంది నాకు దిగులేస్తుంది, ఆమాట మాత్రం నాతో చెప్పొద్దు. మళ్ళీ పదింటికి డ్యూటీవుంది. ఈట్రిప్ చిత్తూరు టూ పుత్తూరు; వయా పెనుమూరు, పచ్చికాపాలం, కార్వేటినగరం, బస్ నంబరు APZ 3029. సెలవు, వెళ్ళొస్తానండి మేష్టరూ!"

---

## ! స్టాప్ అండ్ ప్రొసీడ్ !



చందాదారులకు, ఏజంట్లకు, వ్యాపార ప్రకటనదారులకు

రచయిత/త్రులకీ, పాఠకులకీ ఓమాట :



చిరునామా ఇకనుంచి 'పోస్టుబాక్సు నెంబర్' కే రాయండి—

పి. బి. నెం. సౌకర్యం వచ్చింది గనుక ఇహ మీదట....

పి. బి. నెం. 1824

హైదరాబాదు - 20

అంటే చాలు....

# యండమూరి వీరేంద్రనాథ్

సీరియల్

# డబ్బు డబ్బు

**Adm/14/1/ACCO** తేదీ. మార్చి పన్నెండు.

ఆర్యా !

విషయము: అకౌంటెంటు ఉద్యోగము.

రిఫరెన్సు : మీ దరఖాస్తు – బాక్సు నెం. 920

మీ వుత్తరం తేదీ - మార్చి ఆరు.

పై ప్రకటన ప్రకారం మీరు పెట్టుకున్న దరఖాస్తు పరిశీలించి మిమ్మలను ఇంటర్వ్యూకి పిలవటమైనది. మార్చి పంథొమ్మిదో తారీఖు ఉదయం పది గంటలకు మీరు కింద చెప్పిన అడ్రసులో ఇంటర్వ్యూ చేయబడ్తారు. మీ ఒరిజినల్ సర్టిఫికెట్లతో రాగలరు. ఇట్లు. సం॥

"ఇదేదో కేవలం నన్ను ఆటపట్టించడం కోసం పంపిన ఇంటర్వ్యూ" అన్నాడు గాంధీ దానివంకే చూస్తూ. "లేకపోతే బేరింగ్ దరఖాస్తు పంపిన వాడికి జవాబు రావటం ఏమిటి?"

"నువ్వు చెప్పింది సగం నిజంకావచ్చు, సగం కాకపోవచ్చు. ఇదిగో ఈ రిఫరెన్సు నెంబరు చూడు **Adm/14/1/ACCO** అన్నారు. అంటే లిస్ట్‌లో నువ్వు పధ్నాలుగో వాడివో ఒకటోవాడివో అయివుంటావు. నువ్వు పిలవబడ్తూన్నదికూడా ఆఫీసుకి కాదు. ఇంటికి........ అంటే నువ్వు ఒక్కడివే ఏకాంత పిలవబడుతున్నావన్నమాట." నవ్వింది లక్ష్మి. "నువ్వు చెప్పినట్టు జాగ్రత్తగా వుండాలి, నీ మెదడు ఏకీలుకా కీలు విరవటానికే వాళ్ళు పిలుస్తున్నట్టుంది చూస్తూంటే........

"మెదడులో కీళ్ళుండవ్ నరాలుంటాయ్."

". లేకపోతే అది చాలా పెద్ద కంపెనీ కాబట్టి, నువ్వు మామూలు వుత్తరం పంపేవో, స్టాంపులు అంటించకుండా పంపేవో-అంత పెద్ద కంపెనీ పట్టించుకోకపోతే; నువ్వు లిస్టులో 14వ వాడివి అయితే, అది మామూలు ఇంటర్వ్యూయే అయివుంటుంది.

"ఇంతకీ ఏ కంపెనీ అది?"

"హారికా ఇన్‌వెస్ట్ మెంట్స్...."

గాంధీ ఉలిక్కి పడ్డాడు. హారిక అనగానే ఆరోజు.... ఆరేడు నెలల క్రితం........ ఆస్పత్రిలో తనకి డబ్బు కావల్సిరావటం.... దివ్యవాణి సహాయంతో ఆమె పుట్టినరోజు చెప్పటం - ఆమె ఎక్స్ వైల సాయంతో ఈక్వేషన్ వేసి తన రహస్యం బైట పెట్టటం— అన్నీ గుర్తొచ్చినయ్.

"ఏమిటి నీలో నువ్వే నవ్వుకుంటున్నావ్?"

"ఏంలేదు"

"చెప్పకూడదా?"

అతడికి ఆమెని ఏడిపించాలని బుద్ధి పుట్టింది. తన తెలివితేటల్ని ప్రదర్శించాలన్న తాపత్రయంకూడా కొద్దిగా కల్గింది.

"నీ పుట్టినరోజుని పన్నెండుతోనూ, నీ పుట్టిన నెలని ముప్ఫయి ఒకటితోనూ హెచ్చువేసి, రెండూకలిపి చెప్పు" అన్నాడు.

ఆమె లెఖ్ఖ కట్టి - నాలుగు వందలా ముప్ఫయి" అంది.

"నీ పుట్టినరోజు అక్టోబర్ పది" అన్నాడు.

"ఎలా కనుకున్నావ్?" ఆశ్చర్యంగా అందామె.




"అమ్మో చాలా కష్టం ఎక్స్......వై నుంచి లెఖ్ఖకట్టి..'టి'...'టి వన్' లు కూడా చేర్చి కాంబినేషన్ తీసుకురావాలి" అన్నాడు. నిజమే. అతడు అంత లెక్కకట్టేడు. ఆరోజు హారిక కాగితంమీద వేసిన లెఖ్ఖ అంతా మనసులో అనుకొని జవాబు సాధించేడు. అతడి తెలివి తేటల్ని కాదనటానికి వీల్లేదు. ముఖ్యంగా అతడి జ్ఞాపకశక్తి! కంప్యూటర్ కన్నా భద్రంగా లెఖ్ఖని తన మనసులో దాచుకోగలదు అతడి మనసు. కాలిక్యులేటర్ కన్నా వేగంగా వాటిని చెయ్యగలదు అతడి మెదడు. ఒక నిముషం తన మనసులో తానే ఏదో గుణించుకొని. "నీ పుట్టినరోజు నేనూ చెయ్యగలననుకుంటాను" అంది లక్ష్మి.

అతడు విస్మయంతో "నిజవా" అన్నాడు.

"ఏదీ చెప్పు - తేదీని పన్నెండుతోనూ, నెలని ముప్ఫయి ఒకటితోనూ హెచ్చవేసి ....కలిపి...."

"నలభై మూడు" - అన్నాడతడు.

"జనవరి ఒకటి—" అన్నదామె.

అతడికి పొలమారింది. కష్టం మీద గుక్క తిప్పుకొని, ఎలా కనుక్కున్నావ్" అన్నాడు.

"కరెక్టేనా?"

"కరెక్టే"

ఆమె తేలిగ్గా శ్వాస తీసుకొని, "నాకు సరిగ్గా తెలీదు. ముప్ఫయి ఒకటితో హెచ్చ వేయబడిన సంఖ్యకి ఒక విశిష్టత వుంటుంది అనుకొన్నాను." అంది.

"నాకు సరిగ్గా అర్థం కాలేదు"

"43 ని పన్నెండుతో భాగించేను. వచ్చిన శేషాన్ని (7ని) తిరిగి ఏడుతో హెచ్చవేసి (49) దాన్ని తిరిగి పన్నెండుతో భాగించాను. వచ్చిన శేషం ఒకటి. అంటే జనవరి నెల.

అతడు అప్రతిభుడయ్యాడు. ఆమె చెప్పినదాన్ని జీర్ణించుకోవటానికి కొంచెంసేపు పట్టింది. ఏదో కొద్ది కొద్దిగా అర్థమవుతున్నట్టు అనిపించింది.

"....కానీ ఏడు అన్న సంఖ్య ప్రాధాన్యత ఏమిటి?" అని అడిగాడు.

"ముప్పై ఒకటిని పన్నెండుతో భాగిస్తే శేషం ఏడుగా"

తను ఎక్స్ వై లతో చేసిన సుదీర్ఘమైన లెక్కని అంత తేలిగ్గా చేయొచ్చని అర్థమయింది. చాలా నిజాయితీగా ఆమె తెలివితేటల్ని అభినందించేడు.

"ఉట్టి తెలివితేటలుంటే సరిపోదు. దానికి కొద్దిగా లోకజ్ఞానం, కొద్దిగా సమయస్ఫూర్తి జోడించాలని అర్థమయింది నాకిప్పుడు" అన్నాడు మనస్ఫూర్తిగా!

"అవన్నీ జోడించి ఉద్యోగం సంపాదించుకురండి మహారాజా! మీ విజయం కోసం ఈ పాక అనే కోట-పాత్రలనే సైనికులూ ఎదురు చూస్తూ వుంటారు" అంటూ నవ్వింది లక్ష్మి.

o o o o o

విశాలమైన భవంతి. చుట్టూ ఎత్తయిన గోడ. రకరకాల పూలచెట్లు, మధ్యలో ఎర్రటి మట్టిరోడు....పెద్ద ఇనుప తలుపు-పక్కనే గూర్ఖా గది.

"ఏం కావాలి" హిందీలో అడిగాడు గూర్ఖా. గాంధీ కాగితం చూపించేడు. గూర్ఖా దాన్నో పెద్ద ఆఫీసర్‌లా చూసి, వెళ్ళొచ్చు అన్నట్టు తలూపేడు.

దాదాపు వంద గజాలు....ఇరువైపులా సున్నపు రాళ్ళు వేసిన రోడు....గాలికి వూగుతున్న మొక్కలు, వెడల్పుగా వున్న మెట్లు ఎక్కి అతడు కారిడార్‌లోకి ప్రవేశించాడు. ఒకమూల నాలుగు కుర్చీలు, మధ్యలో గుండ్రటి బల్ల, బల్లమీద పూలగుత్తివున్న గ్లాసూ వున్నాయి. వరండా నిర్మానుష్యంగా వుంది.

అతడికి ఏం చెయ్యాలో తోచలేదు. వరండాలోనే వుండాలో-లోపలికి వెళ్ళాలో.... అక్కడే ఓ క్షణం తచ్చాడి లోపలికి ప్రవేశించాడు. హాల్లోకి అడుగు పెడ్తూనే అతడో క్షణం ఉక్కిరి బిక్కిరి అయ్యేడు. ఇంటీరియర్ డెకరేషన్‌లో నిష్ణాతులైన ఎవరో ఆ గదిని చాలా జాగ్రత్తగా తీర్చిదిద్దేరు. కింద తివాచీ, పైన కప్పు ఒకే రంగు. తివాచీ అంచు, ఫ్లవర్ వేజ్‌లో పూలు, అక్వేరియంలో చేపపిల్లలూ, గోడకి అమర్చిన డెకలాం ప్లేటూ, టేబిల్ మీద ఆష్‌ట్రే, న్యూస్‌పేపర్ మీద పెట్టిన పేపర్ వెయిట్, షాండ్లియర్ గొలుసులూ, చివరికి షెల్ఫ్‌లో పుస్తకాలకి వేసిన అట్టలూ-అన్నీ ఒకే రంగులో వున్నాయి. ఆ గదిలో నిశ్శబ్దం కూడా దర్జాగా వున్నది. దూరంనుంచి ఎక్కణ్ణుంచో మేడమీది రూమ్‌లోంచి సన్నగా మెహదీ హసన్ గజల్ వినిపిస్తూంది.

డబ్బు తాలూకు మత్తువాసన ఆ గదిలో మెత్తగా పరుచుకున్నట్టు వుంది. ఆ గది మధ్యలో తనకి తాను-అందమైన టేబిల్ చివరి అంచున సాలెపురుగులా అనిపించేడు. తన చెప్పుల ధూళికి ఆ తివాచీ పాడైపోతుందేమో అన్న భయం కల్గింది. వెనక్కి అడుగు వేద్దామనుకుంటూ వుండగా, పక్క గుమ్మం దగ్గిర్నుంచి ఒక గంభీరమైన స్వరం వినిపించింది.

"అయితే నువ్వేనన్నమాట జాతి పితవి-"

గాంధీ ఉలిక్కిపడి అటు చూసేడు. గుమ్మంలో రాజా రామమోహనరావు నిలబడి వున్నాడు. అతడికేం జవాబు ఇవ్వాలో తెలియలేదు.

"—కూర్చో"

కూర్చొన్నాడు. ఆయన వచ్చి ఎదుటి సోఫాలో కూర్చొన్నాడు. "స్టాంపులంటించకుండా దరఖాస్తు పంపడానికి ఎంత ధైర్యం నీకు!"




అతడు మాట్లాడలేదు.

"ప్రాక్టికల్ జోకు లేసేవారంటె నా కష్టం. కానీ నామీద జోకులేసేవాళ్ళంటే.... అదేదో తేల్చుకొనేదాకా నిద్రపట్టదు నాకు." ఆయన నవ్వాడు నెమ్మదిగా. "....ఎక్కడ మీ ఇల్లు."

ఆ ప్రశ్న ఆయన ఎందుకు అడిగాడో తెలియక గాంధీ క్షణం తటపటాయించి చెప్పాడు.

"ఇక్కడికి ఎంత దూరం?"

చెప్పాడు.

"ఎలా వచ్చావ్"

"నడిచి"

"తిరిగి ఎలా వెళతావు"

"నడిచి"

"అంతే. నీ ఇంటర్వ్యూ ముగిసింది. నువ్వు వెళ్ళొచ్చు."

గాంధీ విస్తుబోయేడు. ఆయన బిగ్గరగా నవ్వి— "టిట్ ఫర్ టాట్—ఇంతదూరం నువ్వు నడవటం - దీని కోసం పుస్తకాలు చదివి ప్రిపేరవటం నీ ఆశ, అంతా నిరర్ధకం. నువ్వు వెళ్ళిరావొచ్చు."

గాంధీ మొహం జేగురురంగులోకి మారింది. సర్టిఫికెట్లు సర్దుకొని లేచాడు. "నేను మిమ్మల్ని ఓ మూడు ప్రశ్నలు అడగవచ్చా."

ఈసారి విస్తుబోవటం ఆయన వంతయింది. "ఏమిటవి?" అన్నాడు.

"మీ నెలసరి ఆదాయం ఎంత?"







మీరు పనిచేసేగంటలు రోజుకి దాదాపు పన్నెండు. నెలకి దాదాపు మూడొందల గంటల్లో మూడు లక్షలు సంపాదిస్తారన్న మాట-అంటే గంటకి వెయ్యి"

అతడు కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు. "నాతో పదిహేను నిముషాలు మాటల ద్వారా వేస్ట్ చేసినందుకు కృతజ్ఞతలు. మీ పావుగంట ఖరీదు రెండు వందలా యాభై రూపాయలు."

అతడు సర్టిఫికెట్ల ఫైలు చేతిలోకి తీసకొంటూ అన్నాడు — "టిట్ ఫర్ టాట్"

ఒక్కసారిగా రక్త ప్రసరణం ఎక్కువ అవడంతో రాజారామ మోహనరావ్ మొహం ఎర్రగా కంది పోయింది. "నిన్ను....నిన్ను...." అన్నాడు, ఆవేశంతో మాట తడబడింది. ఇంతలో గుమ్మం దగ్గిర తెర కదిలిన సవ్వడి.... "నాంనాన్న" సున్నితంగా వినిపించింది అమ్మాయి కంఠం — కానీ మందలిస్తున్నట్టు!

ఆయన గాంధీని తినేసేటట్టు క్రూరంగా చూసి, లోపలికి వెళ్ళేడు. గాంధీ ఒంటరిగా మిగిలిపోయేడు. "బి. పి. వస్తుంది—ఆవేశపడకు అని ఎన్నిసార్లు చెప్పాను నాన్నా నీకు" హారిక కంఠం వినిపించగానే అతడు ఎందుకో గిల్టీగా ఫీలయ్యేడు. తమ మాటలన్నీ పక్కగదిలోంచి ఆమె విన్నదన్న భావం అతడి కెందుకో సిగ్గును కల్గించింది. ఆమె ముందు రెండోసారి అల్పంగా ప్రవర్తించానన్న భావన....ఈలోపులో ఆయన బైటకొచ్చారు. ఆయన మొహం ప్రశాంతంగా వుండటం చూసి, అంత కొద్దిసమయంలో ఆమె ఆయన్ని మామూలుగా చేయగలగటం గమనించి, అతడు కొద్దిగా ఆశ్చర్య పోయేడు. ఆ చిన్న సంఘటనతోనే, అలా కామ్‌గా, మౌనంగా వుండే ఆ అమ్మాయి ఎంత కమేండ్‌తో ఆ ఇంటినీ, ఇంటి వ్యక్తుల్నీ శాసించ గలుగుతుందో తల్చుకుంటే ఆశ్చర్యం వేసింది, మెచ్చుకోలు కూడా.

"నీకేదో దివ్యవాణి వున్నదట, కదోయ్" అన్నాడాయన....గాంధీ ఉలిక్కిపడ్డాడు. "....దేముడితో మాట్లాడి పుట్టిన రోజు చెప్తావట కదా."

ఈ అమ్మాయి తండ్రికి అంతా చెప్పేసిందన్న మాట. తన నింకోసారి ఫూల్ ని చెయ్యటానికి ఈయన ప్రయత్నం చేస్తున్నట్టున్నాడు. ఎలా దీన్ని తప్పించుకోవటం?

"ఏదీ నా పుట్టిన రోజు చెప్పు చూద్దాం."

గాంధీ మెదడులో ఏదో మెరిసినట్టయింది ఓ కాగితం మీద '37' అని వ్రాసి జేబులో పెట్టుకున్నాడు.

"పుట్టిన రోజేమిటిసార్ దివ్యవాణి సాయంతో మీమనసులో వున్న అంకెల్ని కూడా చెప్పగలను. మూడు స్థానాల్లోనూ ఒకే అంకె వున్న సంఖ్యని ఒకదానిని తల్చుకోండి"

"888" అనుకొన్నాడాయన.

"ఆ అంకెల మొత్తంలో ఆ సంఖ్యని భాగించండి"

"భాగించాను"

గాంధీ జేబులోంచి ముప్ఫైఏడు అని వ్రాసివున్న కాగితం తీసి "ఇదే అది" అన్నాడు. ఆయన అప్రతిభుడై, క్షణంలో తేరుకొని, "ఇదేదో ట్రిక్కు" అన్నాడు. గాంధీ నవ్వి "అటువంటి దేమీలేదు" అన్నాడు.

"సరే అబ్బాయ్" అన్నాడు ఆయన "నీకు ఉద్యోగం ఇస్తున్నాను."

ఆనందంతోనూ, ఆశ్చర్యంతోనూ గాంధీ "నిజంగానా సర్" అన్నాడు ఈసారి సర్ అన్న పదం ఉపయోగిస్తూ. అతడు చాలా సంతోషంగా ఉన్నాడు.

"అవును" అన్నాడాయన. "నీకెంత జీతం కావాలి"

"రెండువందల యాభై అని మీరే ప్రకటించారు కదా సార్"

"అంతకన్నా ఎక్కువ ఇద్దామనుకుంటున్నాను"

"థాంక్యూ సర్"

"నాతో రా" అంటూ లోపలికి నడిచేరు ఆయన. వెనుక గాంధీ....ఆయన గదిలో చిన్న పెట్టెలాటిది వున్నది ఆ పెట్టెమీద, టైప్ మిషన్ మీద వున్న కీబోర్డులాటిది వున్నది. ఒక్కో వరుసలో ఆరు బటన్లు, మొత్తం తొమ్మిది వరుసలూ వున్నాయ్

"నీ జీతం వెయ్యి రూపాయలు."

గాంధీ నమ్మలేనట్టు చూసేడు. "అవును. వెయ్యిరూపాయలు. ఈ పెట్టెలోనే పెట్టబడి వుంటాయి. ప్రతీ నెలాఖరునా వచ్చి తీసుకొంటూ వుండు"

"థాంక్స్ సార్. నిజంగా మీకు కృతజ్ఞుడినై వుంటాను" మనస్ఫూర్తిగా అన్నాడు.

"ఏవో ఆరు బటన్లు నొక్కితే ఈ పెట్టె తెరుచుకుంటుంది ఆ బటన్లేవో నువ్వే కనుక్కోవాలి" నవ్వేడాయన. ఆయన వేసిన ప్రాక్టికల్ జోకుకి గాంధీ మొహం ఉక్రోషంతో కందిపోయింది.

అతనన్నాడు "ఒక బటన్ నొక్కటానికి ఒక సెకను చొప్పున పడుతుందనుకొంటే— ఆ ఆరు బటన్ల కాంబినేషన్ కనుక్కోవటానికి నాకు ఎంతకాలం పడుతుందో మీకు తెలుసా సార్?"

ఆయన అమాయకంగా, "ఎంతకాలం పడుతుంది" అని అడిగేరు.

"నేను ముసలివాణ్ణి అయిపోతాను. నడుము వంగిపోతుంది. చచ్చిపోతాను. నా మునిమనవళ్ళు ప్రయత్నిస్తూ పోయినా అది సాధ్యం కాదు. ఆ కాంబినేషన్ తెలుసుకోవటానికి 2000 సంవత్సరాలు పడుతుంది.

మొట్టమొదటిసారి ఆయన ప్రశంసాపూర్వకంగా గాంధీవైపు చూసేడు. అందులో వున్న మెలిక కనుక్కున్నందుకు కాదు. 54×53×52×51×50×49 ని మనసులో







అంత తొందరగా లెక్క కట్టినందుకు. దాన్ని సెకన్లలో మార్చుకొన్నందుకు... ఇంత సేపూ గాంధీ ఏవో ట్రిక్స్ చేస్తున్నాడనుకొన్నాడాయన. తనముందున్న కుర్రవాడు నిజంగా లెక్కల్లో ఘనుడని అర్థమయింది.

"ఇంత తెలివైన వాడివి, ఇలా వుండి పోయావేమిటి" అన్నాడు.

ఆ ప్రశ్న గాంధీకి అర్థం కాలేదు. "అంటే" అని అడిగాడు

"ఖాళీగా"

"రికమెండేషన్, లంచాలూ లేకుండా ఉద్యోగం ఎవరిస్తారు సార్."

"రెండువందల యాభై రూపాయిలకి తెలివినంతా అమ్ముకుంటావా ?

"నాకన్నా తెలివైన వాళ్ళూ, చురుకైన యువకులూ ఇంకా తక్కువ జీతానికి పని చేస్తున్నారు సార్ ఈదేశంలో."

"అదే ఎందుకూ అని అడుగుతున్నా"

"మరేం చేయాలి ? అవసరం."

"నీ అవసరాన్ని గ్రహించి నిన్ను రెండువందల యాభైకి కొనుక్కుంటానన్నాడు-తెలివైనవాడు."

"తెలివికీ అమ్ముడు పోవటానికీ సంబంధం లేదుసార్. ఈదేశపు సగటు యువకుణ్ణి నేను. నా బ్రతుకేదో మామూలుగా బ్రతికేసి కాలం గడిపెయ్యాలి అనుకొనే వాణ్ణి. నాకు రాజకీయాలతో ప్రమేయంలేదు. బిజినెస్ వ్యవహారాలు అవసరంలేదు. ఉండటానికో ఇల్లు—తినటానికి తిండి వుంటేచాలు నమ్మకంగా పనిచెయ్యాలనే మనస్తత్వం నాది ... అంతే కానీ నా తెలివి తేటల్తో ఎవరినీ మోసం చేయాలని అనుకోను నేను."

"అంటే మేమందరం మోసం చేస్తున్నామనా నీ వుద్దేశ్యం .."

"డబ్బు సంపాదనకీ మోసానికీ అవినాభావ సంబంధం వుంటుంది. ఉండితీరు

తుంది"

"కానీ మోసం చేస్తే న్యాయస్థానం వూరుకోదు. జైల్లో పెడుతుంది."

"నేను చెబుతున్నది న్యాయబద్ధంగా మోసం చెయ్యడం గురించి. సరుకు కొనటం—ధర పెరిగేవరకూ వూరుకోవటం—తరువాత అమ్మటం—లాభం సంపాదించటం.... దీన్ని ఏ న్యాయస్థానం శిక్షిస్తుంది?"

ఆయనకి కోపం వచ్చింది. "డబ్బు సంపాదించటం అనేది సరుకు కొని అమ్మటం అంత సులభమైనది అయితే మరి మీరంతా అలా ఎందుకు సంపాదించలేక పోయారోయ్? ఇంకొకరి మోచేతి క్రింద నీరు త్రాగటానికి ఎందుకు సిద్ధపడుతున్నారు?"

"నీతిపట్ల నమ్మకం వుండబట్టి—వ్యవస్థ లొసుగుల్ని ఆధారం చేసుకోవటం ఇష్టం లేకపోబట్టి—డబ్బు సంపాదనే మనిషి ధ్యేయం కాదు కాబట్టి...."

ఆయన బిగ్గరగా నవ్వేడు. "మీ చేతగానితనాన్ని భలే ఆత్మవంచనతో కప్పి పుచ్చుకుంటున్నారు మీరు. నిజానికి మీకేమీ చేత కాదు. అది ఒప్పుకోవటం ఇష్టం లేక ఇలా వాదిస్తున్నారు."

నిజానికి డబ్బు సంపాదనే ధ్యేయం అయితే—అయిదు సంవత్సరాల్లో ఓ యాభై లక్షలు సంపాదించటం పెద్ద కష్టం కాదు."

ఆయన మరింత బిగ్గరగా నవ్వి "అయితే సంపాదించు చూద్దాం. అలాగేగానీ సంపాదిస్తే నా కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తా"

పక్కగదిలో హారిక ఉలిక్కిపడింది

ఈ గదిలో గాంధీ ఉలిక్కిపడ్డాడు. ఒకసారిగా గదిలో నిశ్శబ్దం పేరుకుంది.

ఆ మాట అన్నతరువాత రాజా రామమోహనరావూ నాలుక్కర్చుకొన్నాడు గానీ, గాంధీ మౌనాన్ని చూసి, తన వాదనకి బలం పుంజుకొని, "చూసేవా—మీ చేతకాని తనం మాటల్లోనేతప్ప క్రియలో శూన్యం" అన్నాడు.

గాంధీ మాట్లాడలేదు. ఆలోచిస్తున్నాడు. తల్లి శవం—మెడికల్ షాపు వాసరు—శవాన్ని కాల్చేవాడు—లక్ష్మి అన్నయ్య... వరుసగా అందరూ గుర్తొచ్చారు.

తిరగబడితే. ..ఈ వ్యవస్థమీద తిరగబడితే... నిజంగా అంత కష్టమా డబ్బు సంపాదించటం? అందులోనూ ఈ వ్యవస్థలో.. .తెలివితేటల్ని క్యాష్ చేసుకోవటం నిజంగా తనకి చేతకాకనా వూరుకున్నది ఇన్నాళ్ళూ—అతడు నెమ్మదిగా తల పైకెత్తాడు. స్ఫుటంగా అన్నాడు. "....మీ పందెం నా కిష్టమే."

"ఏమిటి?"

"ఈరోజు మార్చి పంధొమ్మిదో తారీకు. సరిగ్గా అయిదు సంవత్సరాలు తిరిగేసరికి యాభై లక్షలు సంపాదించి మీకు చూపిస్తాను."

పిచ్చివాణ్ణి చూసినట్టు చూసేడాయన. "ఎలా—హత్యలు చేస్తావా? దోపిడీలు చేస్తావా?"

గాంధీ నవ్వేడు. అప్పటికే అతడి నిర్ణయం ఒక స్పష్టమైన రూపు కొచ్చేస్తోంది, ఆలోచన్లు సిద్ధమవుతున్నాయ్.

"ఏం చేసినా చట్టబద్ధంగానే చేస్తాను. న్యాయపు పరిధిలోనే చేస్తాను. అయితే న్యాయమనేది కేవలం మన న్యాయశాస్త్రం చెప్పిన న్యాయమే.... దాని పరిధిలోనే సంపాదిస్తాను. అయిదు సంవత్సరాల తర్వాత వస్తాను. యాభై లక్షలు పట్టుకొని........

ఆ తరువాత అతడేమీ మాట్లాడలేదుకానీ, అతని చూపు ఎందుకో గది కర్టెన్ మీద పడింది. రాజారామమోహనరావుకి ఒక్కసారిగా తన టైమ్ వేస్ట్ చేసుకుంటున్నా నన్న







భావం కలిగింది. ఈ అనామకుడు చేసే పిచ్చి ప్రేలాపనలకు అనవసరమైన విలువ ఇచ్చి ఇంకా మాట్లాడటం వేస్ట్ కాక పోతే ఏమిటి? అయిదు సంవత్సరాల్లో యాభై లక్షలు సంపాదిస్తాడట!

"సరే—వెళ్ళిరా" అన్నారు లేచి నిలబడ్తూ.

గాంధీ కదల్లేదు. "—అగ్రిమెంటు" అన్నాడు.

"వాట్" అని అరిచేరాయన.

"అవతలి మనిషిని నమ్మలేక పోవటం అనేది నాకు ఈ క్షణంనుంచే ప్రారంభమయింది. మనం అగ్రిమెంట్ రాసుకోవాలి"

ఆయన ఓ క్షణం కోపంతో ఊగిపోయినా, ఈ పందెంపట్ల ఆసక్తుడై డ్రాయర్ లోంచి అయిదు రూపాయల స్టాంపు పేపర్లు తీసేరు. పదినిముషాల్లో అగ్రిమెంటు పూర్తయింది.

పందెం : యాభై లక్షలు సంపాదించటం.

గడువు : అయిదు సంవత్సరాలు (నేటినుంచి)

బహుమతి : హారిక అనే అమ్మాయి.

(ఇది వ్రాస్తూ వుండగా ఆయన పళ్ళు బిగుసుకున్నాయ్. 'ఎంత ధైర్యం నీకు' అనుకున్నాడు)

షరతులు న్యాయపు పరిధిలో, చట్టబద్ధంగా సంపాదించాలి.

"సంతకం పెట్టండి" అన్నాడు, ఇద్దరూ సంతకాలు పెట్టారు.

ట్రాన్స్పరెంట్ కర్టెన్ వెనుకనున్న హారిక ఈగదిలో జరిగే తతంగాన్ని అంతా చూస్తూనే వుంది. తండ్రి ముందు ఆమాట అనగానే ఉలిక్కి పడింది. ముందు గదిలోకి రాబోయింది కూడా, కానీ తమాయించుకుంది. తండ్రిని లోపలికి పిలిచి మందలిద్దామన్న

ఆలోచననికూడా విరమించుకొంది. తండ్రి తొందరపాటు—అవతలి వాళ్ళ బలహీనత మీద ఆయన ఆడుకోవటం అంతా ఆమెకి బాగాతెలుసు. మూడు రకాల అడ్వర్టైయిజ్ మెంట్ ఇచ్చినప్పుడు కూడా అందుకే అభ్యంతరం తెలిపింది.

తన తండ్రి దీన్నికూడా ఓ ఆటలా తీసుకుంటున్నాడనీ, అయిదు సంవత్సరాల్లో యాభై లక్షలు సంపాదించటం అనేది కలలోకూడా పూహించలేనటువంటి విషయం అనీ ఆమెకి తెలుసు. కానీ ఆ యువకుడు కూడా సామాన్యుడు కాడని సిక్స్త్ సెన్స్ చెప్తోంది. ఆ భావన రాగానే ఆమె కర్టెన్ సందులోంచి ముందుగదిలోకి చూసింది. ఆ షైమ్‌కి అగ్రిమెంట్ మీద సంతకం పెడుతున్నాడు గాంధీ. తీక్షణమైన కళ్ళు—కొసదేరిన ముక్కు—కొద్దిగా పెరిగిన గెడ్డం....ఆమె ఓక్షణం అతడిని నిశ్చలంగా చూసి, కర్టెన్‌ని మామూలుగా వదిలేసింది ...ఎందుకో తెలీదుకానీ ఆమె పెదవుల మీద సన్నగా నవ్వు వెలిసింది. అదే క్లైమ్‌కి అగ్రిమెంట్ కాపీ జేబులో పెట్టుకొంటున్నాడు గాంధీ. ఆ తరువాత లేచి నిలబడి, షేక్‌హాండ్ కోసం చేయిసాచేడు. అతడిలో అప్పటికప్పుడు వచ్చిన మార్పుని చూసి ఆయన విస్తుబోయారు. అయినా అప్రయత్నంగా చెయ్యి అందించారు.

ఆ తరువాత గాంధీ బైటకొచ్చేసేడు.

ఓ నిముషంసేపు ఆయన నిశ్చలంగా అలానే నిలబడ్డారు. ఆతరువాత ఒక్కసారిగా నవ్వొచ్చింది. టేబిల్ మీదున్న అగ్రిమెంటు కాపీ, గాంధీ వ్రాసింది చేతుల్లోకి తీసుకొని బిగ్గరగా నవ్వి, దాన్ని నాల్గయిదు ముక్కలుగా చింపి బాస్కెట్‌లో పడేసి తన గదిలోకి వెళ్ళిపోయారు.

ఆయన వెళ్ళిపోయిన రెండు క్షణాలకి పారిజ ఆగదిలోకి వచ్చింది. బాస్కెట్ లోంచి కాగితపు ముక్కల్ని తీసి ఒక్కొక్కదాన్ని పరీక్షగా చూడసాగింది. కొంచెం సేపటికి కావల్సిన ముక్క దొరికింది. దాంట్లో గాంధీ అడ్రసు వుంది.

o o o o o

గుడి మెట్లమీద నడుస్తున్నాడు గాంధీ.

చిన్నకొండ – కొండ మీద గుడి. మెట్ల కిరువైపులా బిచ్చగాళ్ళున్నారు. అతడు సరాసరి వెళ్ళి గుడివెనుక కూర్చొన్నాడు. మెదడు కాల్చేసే ఆలోచన్లు. ఏదో వేడి ఆవేశంలో సంతకం పెట్టేసేడేగానీ, ఎలా సంపాదిస్తాడు అంతడబ్బు?

"ఏయ్‌ – ధర్మంచెయ్యిబాబూ"

ఆలోచన్లనుంచి తేరుకొని తలెత్తి చూసేడు. ఒక ముసలివగ్గు చేతికర్ర సాయంతో వణుకుతూ నిలబడివుంది.

అతడికి నవ్వొచ్చింది. "నేనూ నీలాంటి వాణ్ణేనమ్మా" అన్నాడు.

"అలా అనకు బాబూ. దేముడు సాయం చేస్తాడు. పది పైసలు దానం చెయ్యి, భోంచేసి రెండ్రోజులయింది...."

"నేను భోజనం చేసి మూడు రోజులైంది."

ముడతలుపడ్డ ఆమె మొహంలో విస్మయం తొంగచూసింది. అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది, అతడు మళ్ళీ ఆలోచన్లలో పడ్డాడు. ఇదంతా తెలుస్తే లక్ష్మి ఏమంటుందీ. తల వాచేటట్టు చీవాట్లు పెడుతుందా? కడుపారా నవ్వుతుందా – అయినా తను చేసిన దేమిటి? ఏ ధైర్యంతో ఆ పందెం కాసేడు? అసలు ఆ ఆలోచన ఎలా వచ్చింది!

అతడికి హఠాత్తుగా ఒక విషయం బోధపడింది.





తన ఆలోచనల్లోనే అంతర్లీనంగా ఎక్కడో ఈ డబ్బు పట్ల కసి—వ్యామోహం వుండివుండాలి. డబ్బు లేమివల్ల తనని ఇంతకాలం నొక్కిపట్టి వుంచిన పరిస్థితులూ, చుట్టూవున్నవాళ్ళు డబ్బు సంపాదించే విధానం— ఇవన్నీ తనలో ఈ కోర్కెని ఎక్కడో సృష్టిస్తూ వచ్చాయి. అది లావాలా ఉడికి ఉడికి ఈ రోజు బద్దలయింది, అతను కళ్ళు మూసుకున్నాడు. ఎంతసేపు అలా వున్నాడో తెలీదు. 'బాబూ' అన్న పిలుపుతో కళ్ళు చుట్టూ చీకట్లు అలుముకున్నాయి. చాలాసేపు పడుకున్నానన్న మాట అనుకున్నాడు.

"ఈ పది పైసలు తీసుకో బాబూ"

అతను ఉలిక్కి పడ్డాడు. ముసల్ది అంటోంది—"నువ్వు ఏమీ తినలేదని తెలుస్తానే వుంది....ఆ మెట్లమీద ఎంతసేపు కూచున్నా పావలా రాలేదు.. ధరమ పెంపులే కరువయ్యారు. ఈరోజుల్లో...." అంటూ వణుకుతున్న చేతిని ముందుకు సాచింది. "ఏదైనా తిను బాబూ — ఏం తినకపోతే శోషొస్తది. ఏరుశనగ పప్పేనా తిను కొద్దిగా—"

అతడికి కళ్ళవెంట నీళ్ళొచ్చాయ్. అయితే అవి ఒక బిచ్చకత్తె తనని బిచ్చగాణ్ణి చేసినందుకుకాదు, మనుషుల్లో ఇంకా ఆమాత్రం దయ, కారుణ్యం కనబడుతున్నందుకు.

వద్దన్లేదు, అతను తీసుకొన్నాడు. తీసుకొంటూ అనుకొన్నాడు—"ఈ క్షణం నుంచీ మనిద్దరం భాగస్వాములం అవ్వా! డబ్బు నీది!! తెలివి నాది!!! ఈ పది పైసల్నే లక్షలు లక్షలు చేస్తాను-సగంలాభం నీకు పంచిస్తాను."

అతడు మెట్ల మీదనుంచి లేచాడు.

అతడి చేతిలో పదిపైసల బిళ్ళ తళతళ లాడుతుంది.

కళ్ళల్లో పట్టుదల తొంగి చూస్తుంది.

## 5

"ఇదేం తెలుగుసినిమా అనుకున్నావా-లేకపోతే ఆక్షణం నేనే అమితాబ్ బచ్చన్‌ని అనుకున్నావా........ పిడికిలి బిగించి క్లోజప్‌లో "మై మేరీ మాకి కసం ఖాతాహూ. పాంచ్ సాల్ మె పచాస్ లాఖ్ సంపాదించి, ఇంతకాలం చిన్న రొట్టెముక్క కూడా పడేయ్యటానికి సంశయించిన ఈ సంఘాన్ని నా కాలిదగ్గిర కుక్కలా ఆడిస్తాను" అని ప్రతిజ్ఞ చెయ్యటానికి! పోనీ చేసేవే అనుకో - అదేదో మర్డర్లు చేసీ - స్మగ్లింగుచేసీ సంపాదించేది అయివుంటే కొంచం థ్రిల్లింగా వుండేది కదా. అప్పుడు ఈ కథని ఏ సినిమా వాళ్ళయినా కొనుక్కొని వుండేవారు. వీరేంద్రనాథ్‌కి కనీసం ఆధాన్సయినా లేకుండా చేసేవ్. అయినా న్యాయంగా సంపాదించటం ఏమిటి—"

"న్యాయంగాకాదు. చట్టబద్ధంగా...." సరిదిద్దేడు గాంధీ.

లక్ష్మి వాక్ప్రవాహం ఆగలేదు. "రెండింటికీ పెద్దతేడా వుందనుకోను. నాలెక్కన అయిదు సంవత్సరాల్లో నీ వాటాకి యాభై లక్షలు కాదు కదా— అయిదు వేలైనా సంపాదించలేవు" అంది. గాంధీ చేతులు జోడించి— "అపశకునం మాటలు ఆపు మహాతల్లీ. నన్ను కొంచెం మాట్లాడనియ్యి" అన్నాడు.

కొంచం ఆగి, "ఈ పదిపైసలూ వచ్చేనెల ఈరోజు కల్లా ఇరవై, ఆతరువాతి నెలకి నలభై అలా నెలకి రెట్టింపు చేయగలను కదా కనీసం! ఆమాత్రం నమ్మకంవుందా నామీద?" అన్నాడు.

"వుంటే...."

"అలా అయితే అయిదు సంవత్సరాల్లో ఎంతవుతుందో చెప్పు...."

"ఎంత? నూట ఇరవై రూపాయలా?"

"కాదు?"

"పన్నెండొందలు....!"

"ఊహూ?"

"మరి!"

"అయిదు వందలా డెభ్భయినాలుగు కోట్ల కోట్ల రూపాయలకు పైగా—"

ఆమె దిగ్భ్రాంతితో అతణ్ణి చూసి. "నిజమా" అంది.

"మరి" అని కాలరు ఎగరేసేడు.

"ఆబాలేదు — చూలూలేదు కొడుకుపేరు సోమలింగం అంటే ఏమిటో తెలుసా?"

గాంధీ "తెలీదు" అన్నాడు.

"నీ పది పైసల్ని ఇరవై పైసలు చేయటమే!" అంది.

గాంధీ రోషంతో "చూస్తూవుండు-ఇప్పుడేవెళ్ళి ఈ పదిని ఇరవై చేసుకువస్తాను" అన్నాడు.

లక్ష్మి సవినయంగా కుర్చీలోంచి లేచి నిలబడి, "వెళ్ళిరండి రాక్ ఫెల్లర్‌గారూ ప్రపంచంలోని తెలివితక్కువ దద్దమ్మలంతా మీరెప్పుడొచ్చి వాళ్ళ తెలివితక్కువతనాన్ని డబ్బు చేసుకుంటారా అని ఎదురు చూస్తున్నారు" అంది. అనటంమాత్రం చాలా సీరియస్‌గా అన్నదికానీ, ఆతరువాతే తెరలు తెరలుగా నవ్వొచ్చింది—గాంధీ లేత మొహం ఉక్రోషంతో మరింత ఎర్రబడింది."—అలాగే నవ్వు, యాభైలక్షలయ్యాక నవ్వుదుగాని." అన్నాడు కసిగా.




ఆమె చప్పున నవ్వు ఆపుచేసి "యాభై లక్షలేమిటి—కోటి రూపాయలు సంపాదించాలి నువ్వు" అన్నది.

అతడు ఆశ్చర్యంతో "ఎందుకు?" అన్నాడు.

"నీకు పెట్టుబడి పెట్టిన ముసలవ్వకి సగం షేరు ఇస్తానన్నావు కదా. ఆ యాభై లక్షలూ నీకో యాభై లక్షలు, మొత్తం కోటి రూపాయలు—"

అతడు తెల్ల మొహం వేసి "నేనింత ఆలోచించలేదు సుమా" అన్నాడు.

**"నేర్చుకో మొదటి పాఠం, బిజినెస్‌లో ఎప్పుడూ తొందరపడి మాట ఇవ్వకూడదు:"**

గాంధీనవ్వి "అలాగే గురూగారూ. మీ మాట గుర్తుంచుకుంటాను" అని పది పైసలు చేతులో భద్రంగా పట్టుకొని, పాకలోంచి బైటకొచ్చాడు.

సూర్యుడు పశ్చిమానికి జారిపోతున్నాడు. రాత్రి జీవితం ప్రారంభించటానికి ప్రపంచంలో ఒక భాగం ఆయత్తమవుతోంది. ఆ రాత్రి గడిచే లోపులో పదిని ఇరవై చెయ్యాలని గాంధీ బయల్దేరాడు, అతడు హుషారుగా వున్నాడు. సవాలు అతడిలో కొత్త ఉత్సాహాన్ని రేకెత్తిస్తూంది. పందెం గెలవటం గెలవక పోవటం వేరేసంగతి. ఇది మాత్రం హుషారుగా వుంది. పందెం అనగానే అతడికి హారిక జ్ఞాపకం వచ్చింది. ఆ 'బహుమతి' సంగతి లక్ష్మికి చెబితే బావుండేదేమో అనుకున్నాడు. మళ్ళీ 'ఎందుకులే' అనుకున్నాడు. అలా అనుకోవటమే ఆ తరువాత అతడిని ఘోరమైన ప్రమాదంలో పడేసింది.

(ఇంకావుంది)

మినీ కథ

# "మనం మనమే"

## మల్లాది వెంకట కృష్ణమూర్తి

చంద్రుడిమీదకి మనిషిని మొదటిసారిగా పంపబోయేముందు అమెరికాలోని 'నాసా' సంస్థ వివిధ దేశాలనించి అభ్యర్థులను పిలిపించింది. వాళ్ళని ఇంటర్వ్యూ చేయసాగారు అమెరికా శాస్త్రజ్ఞుడు హేరీ కూపర్.

"మీరు పైకి వెళ్ళి ప్రాణాలతో తిరిగి వస్తే లక్ష డాలర్లిస్తాం. ఓకే?" అడిగాడు హేరీ కూపర్ రష్యా దేశం నించి వచ్చిన ఆస్ట్రోనాట్‌ని.

"రెండు లక్షల డాలర్లు ఇవ్వండి" కోరాడా రష్యన్.

"ఎందుకు?"

"చంద్రమండలంమీదకి వెళ్ళి ప్రాణాలతో తిరిగి వస్తే లక్ష డాలర్లు నాకోసం, మరో లక్ష నా కుటుంబ సభ్యులకోసం ఖర్చు చేస్తాను."

అదే ప్రశ్నని ఫ్రెంచ్ దేశంనించి వచ్చిన ఆస్ట్రోనాట్‌ని అడిగాడు హేరీ కూపర్.

"మూడు లక్షల డాలర్లు ఇవ్వండి" కోరాడా ఫ్రెంచ్ దేశస్థుడు.

"ఎందుకు?" అడిగాడు హేరీ కూపర్ ఆశ్చర్యంగా.

"లక్ష డాలర్లు నాకు, లక్ష డాలర్లు నా కుటుంబానికి, మరో లక్ష నా గర్ల్‌ఫ్రెండ్‌కి" చెప్పాడతను.

"చంద్రమండలంమీదకి వెళ్ళి వస్తే మీకు లక్ష డాలర్లిస్తాం. సరేనా?" అడిగాడు హేరీ కూపర్ భారత దేశంనించి వెళ్ళిన ఆస్ట్రోనాట్‌ని.

"నాలుగు లక్షల డాలర్లు ఇవ్వండి" చెప్పాడా భారతీయుడు.

"ఎందుకు?"

ఈసారి హేరీ కూపర్ ఇంకా ఆశ్చర్యపోయాడు.

"ఏంలేదు. ఓ లక్ష డాలర్లు నాకు, ఓ లక్ష డాలర్లు నా కుటుంబానికి, ఓ లక్ష డాలర్లు నా గర్ల్‌ఫ్రెండ్‌కి, మరో లక్ష నన్ను చంద్రమండలంమీదకి పంపడానికి ఎన్నికచేస్తున్న మీకు ఇవ్వడానికి" తాపీగా సమాధానం చెప్పాడా భారతీయుడు. ●

సీరియల్

# సౌభాగ్యలత

## ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవీ రామశాస్త్రి

(గత సంచిక తరువాయి)

శ్రీమంత్ అతి విసుగును ప్రదర్శించుతూ కంఠం కొంచం హెచ్చించాడు!

"ఊహాగానాలు కట్టిపెట్టి, యదార్థాన్ని స్పష్టంగా విని అర్థం చేసుకో, ఒకగూటిలోనే బ్రతికినా మన మధ్య ఈ గూరం ఎప్పటికి తరగదు. మనం స్నేహితులుగానే మిగిలిపోతాం."

ఒక్కసారిగా హృదయ స్పందన ఆగినట్టయింది వకుళకు. ఆ అనుభూతి నుండి తేరుకోవటానికి రెండు నిముషాలు మింగుడు పడినాయి.

"చూశావా నీకు ఎంత చేదో? ఫర్వాలేదు. ఈ మాటలన్నీ మరచి వేరొకరితో హాయిగా సుఖ జీవితం సాగించు"

పాలిపోయిన వకుళ వదనం అంతలోనే తేరుకొని కాంతిని పుంజుకొన్నది. తలఎత్తి నిర్మల హాసంతో జవాబిచ్చింది:

"శ్రీమంత్! నీ సరసన నిలబడ గలిగితే చాలునాకు. నీ ప్రవర్తనకూ, స్వాతంత్ర్యానికీ ఎప్పుడూ ఏ విధంగానూ నావల్ల బాధా ఇబ్బంది కలుగవు"

"ఇవి ఈ నాటి మాటలు, 'ఈ జీవితానికి అర్థం ఏమిటి?' అని విచారించి కుమిలి పోయేరోజు వస్తుంది. ఆ పశ్చాత్తాపానికి ఫలితం పరితాపమేకాని ఫలితం శూన్యం! ఇది భారత దేశం గనుక!"

"నేను భారత వనితను గనుక మనసైన మనువు ఎన్ని మలుపులు తిరిగినా మహదానందంతో మనస్థయిర్యంతో స్వీకరించడమే కాని మనస్తాపానికీ మరో ఆలోచనకూ ఆస్కారమే వుండదు!"

"సరే, నేను చెప్పవలసినదంతా చెప్పాను మరి!"

"అంగీకరించావని నాన్నగారికి చెబుతాను."

## 15

రఘురామయ్య ఆనందానికి అవధులు లేవు. పెండ్లి సన్నాహాలు ప్రారంభమైనాయి.

విశ్వేశ్వరికి ఆనందించాలో, విచారించాలో తెలియడంలేదు, కారణం ఆమె ఈ దేశపు సగటు స్త్రీ, ఆ స్థాయి ఆడ మనసు ఆలోచనలు అంతస్థులను బేరీజు వేయకండా వుండలేదు.

"పెద్ద అల్లుడు లక్షలకు అధికారి. అయితే చిన్నపిల్లను యింత నిరాధారుడికి ఇవ్వడమా!"

అసహ్యంగా, తిరస్కారంగా చూచాడు రఘురామయ్య ఈ మాట వింటూనే.

"ఒకనాడు నువ్వూ శ్రీమంత్‌ను గౌరవించావు; అల్లునిగా ఊహించావు. ఈ నాడు మరో వ్యక్తిని చూచుకొని తిరస్కార మేర్పడిందా? నీ గుణాలే నీ కూతురికీ వచ్చాయి. నీ అభిప్రాయాలు వకుళపైన కూడా రుద్దకు."

"అదికాదండీ, పెద్ద అల్లుడు........"

ఆమెమాట పూర్తికాకుండానే గర్జించాడు భర్త.

"ఆగు. ఎవరు పెద్ద అల్లుడు? ఏడీ? పెళ్ళి అయ్యిందా నీ పెద్దకూతురికి?"

"ఔతుంది కదా ?"

"యేమో? అయినప్పుడు కదా ఇటు వంటి వాళ్ళను నమ్మేది? శశి మన హద్దులనూ, మాటనూ మీరి ఏం చేయ దలచుకున్నదో తనకే తెలియాలి."

"అదేమరి నా బాధాను. పెద్దపిల్లకు అవ్వకుండా చిన్నపిల్ల పెళ్ళా?"

"ఇదుగో-ఇదే చెప్పడం నీకు. నువ్వు శశికే కాదు—వకుళకు కూడా తల్లివే. అంచేత అడుపుల్లలు వెయ్యకు, శశికి నేను పెళ్ళి చేయననలేదుగా? అతడెవరో తీసుకొచ్చి ఒప్పించమను. ఒకే ముహూర్తానికి చేద్దాం."

"అయ్యిందిగా అడగడం! వాళ్ళిప్పుడే చేసుకోరట. కొన్నాళ్ళు సరదాగా తిరగాలట."

తీక్షణంగా చూచాడు భార్యవైపు !

"ఆమాట చెప్పడానికి శశికి సిగ్గు లేకపోయింది; అది నావరకూ తెచ్చి విన్పించడానికి నీ కసలే సిగ్గూ లజ్జా లేకుండా పోయాయి. శశి కళ్ళు మూసుకుని అడుగులు వేస్తోంది. అందువల్ల కలిగే ఫలితం తననే అనుభవించనీ, మరొకరి నెత్తిన రుద్దకూడదు."

"మీ కూతురని మీరే శపించుతున్నారా?"

"లేదు. వకుళకూడ మన కూతురేనని గుర్తు చేస్తున్నాను. శశి తన జీవితాన్ని తానే నిర్ణయించుకోగల ధీమంతురాలైతే వకుళ బాధ్యత అంతా నాకే వదలి, నా సంతోషం కోసం తాపత్రయపడ్తూన్న అమాయకురాలు. మరో రెండేళ్ళు ఆగితే ఎవరి మనసు లెలా మారుతాయో? శ్రీమంత్ నాకు దక్కుతాడా? శశి చేస్తూన్న హానికి శిక్ష వకుళకు కాదు; శశినే అనుభవించనీ, వచ్చే వారంలో వకుళకూ శ్రీమంత్‌కూ వివాహం జరిగి తీరుతుంది!"

## 16

విహార యాత్రనుండి తిరిగి వస్తూనే శశిరేఖ నిర్ఘాంతపోయింది. ఇంట జరుగుతూన్న పెళ్ళి హడావుడి చూచి.




"శారద వివాహం నాకు అనవసర విషయంగా పరిగణించి వెళ్ళిపోతే శ్రీమంత్ బాగా బాధపడతాడనుకున్నాను."

"కానీ నీ లెక్క తనకు లేదన్నట్లుగా అతడు నీ చెల్లెలినే వివాహ మాడుతున్నాడని నీకు అవమానంగా వున్నదా?" అంటూనే పకపకా నవ్వేశాడు మహేష్!

"కాదా మరి? మనకంటే చిన్నదానికి మనకంటే ముందుగా పెళ్ళేమిటి? మా అమ్మగారు కూడా అలానే అంటున్నారు."

"అదుగో, 'గుడి గుడి గుంచం' లాగా తిరిగి తిరిగి అక్కడికే వస్తున్నావ్. మరొకళ్ళ కోసం మన అభిరుచులను చంపుకొని ఆత్మవంచన చేసుకోలేము కదా! పోనీయ్. నీకూ వాడి పీడ వదలిపోయిందిగా?"

"ఆప్టాల్-అతగాడి భయం నాకేమిటి? కానీ........"

"కానీ?"

"శ్రీమంత్ ఇకమీదట మా యింట నా కంటి ఎదుట తిరుగాడుతూండడం భరించలేనన్పిస్తోంది. బుద్ధితక్కువ వకుళకు ఇంతటి ప్రపంచంలో అతడే దొరికాడా?"

మహేష్ వదనంలో విసుగుదల స్పష్టంగా ద్యోతకమైంది.

"నీ ఆంతర్య మేమిటో చచ్చినా నా కర్థం కాదు. శ్రీమంత్ వద్దంటూనే అతడిని గురించి అతిగా ఆలోచిస్తున్నావ్. ఎందుకో నాకు తెలియకుండా వుంది."

"నాబాధ నీకు తెలియదు"

"ఏమిటి?"

అతడి కాలర్, టై సర్దుతూ గోముగా అన్నది శశిరేఖ: "నా భర్తగా, ఇంటికి పెద్దఅల్లుడిగా ముందు నీకు గౌరవాలు జరగాలి; లాంఛనాలు తీరాలి. అదినాకు ఆనందం

కానీ నీ కంటె ముందు ఆ శ్రీమంత్ మా ఇంట అడుగుపెట్టి మర్యాదలు పొందుతుంటే నాకు కంపరంగా వుంటుంది."

తేలికగా నవ్వేశాడు మహేష్. నిరసన తాండవించుతూన్న కంఠంతో చిరాకుగా అన్నాడు!

"అటువంటి అనవసర ఆలోచనలతో బాధపడకు, మహేష్! వెయ్యిమంది శ్రీమంతులె నా కాలి గోటికిరారు. నా పట్టుదల నీకు తెలియదా. నేను ఏదైనా- ఇలా జరగాలి అనుకుంటే అది అలాగే జరగాలి!"

ఖండితంగా ఉన్న అధోరణిని విస్మయంగా చూస్తూండి పోయింది శశిరేఖ.

"ఏమిటలా చూస్తావ్ శశీ? ఆ శ్రీమంత్ పెళ్ళి నా పెళ్ళి ఒకేసారి ఎందుకు జరగాలి? నా వివాహం నా యిష్టానుసారం ప్రత్యేకంగా జరుగుతుంది. మన జంటనూ అన్యోన్యతనూ చూసి అందరూ — ఆఖరుకు ఆ శ్రీమంత్ కూడా అసూయపడేట్లు జరుగుతుంది ఎప్పుడో ఒకప్పుడు మొక్కుబడిగా ముడిపెట్టుకొనే అగత్యం మనకులేదు!"

శశిరేఖ దిగులు మాయమై ఆనందంగా చూచింది.

"పద, మంచి పిక్చర్ వుంది. పోదాం"

## 17

"శశీ! ఈ రోజు ఇంటి దగ్గర వుండరాదూ— బజారు వెళదాము."

"ఎందుకూ? వేరేపని వున్నదమ్మా."

"ఇంక పదిరోజులేగా పెళ్ళివున్నది? వకుళకు బట్టలు — ఒకటేమిటి - అనేక పనులు, మనమూ రెండేసి చీరలు కొనుక్కుందాం"

"వకుళనే తీసుకెళుదు, నేనెందుకు? నాకు పనుంది?"

"అయ్యో, చెల్లెలి పెళ్ళి పనులకు కాస్త సాయపడే తీరికే లేదూ?"

"ఆవిడగారి వన్నీ బూజుభావాలూ, ఛాంధసాలూనూ, నా సెలెక్షన్స్ ఏం నచ్చుతాయమ్మా, ఎన్నుకుందిగా చాలా గొప్ప వరుడిని!"

హేళనగా అనేసి మేడ మెట్లెక్కి వెళ్ళిపోతూన్న శశిరేఖను చూస్తూ నిట్టూర్చింది విశ్వేశ్వరి.

"అక్కకూ చెల్లెలికీ ఒక్క క్షణం పడదు కదా! ఏమిటో ఈ ద్వేషం!"

శశి పదధ్వని వింటూనే పరుగున ఎదురు వచ్చింది వకుళ.

"అక్కా. ఈ రోజు బజారు వెళదామా?"

"ఎందుకూ?" తెలియనట్లే అడిగింది.

"ఎందుకేమిటి? పెళ్ళి బట్టలకూ నగలకూను."

శశి వచ్చి వకుళ గదిలో తీరికగా కూర్చున్నది. తల దువ్వుకుంటూన్న చెల్లెలినే పరీక్షగా చూస్తూ.

"ఏమిటక్కా అలా చూస్తూన్నావు?"

"ఏం లేదూ శ్రీమంత్‌నూ నిన్నూ పక్క పక్కల ఊహించుతున్నాను!"

వకుళ ముగ్ధమోహనంగా నవ్వి తల వాల్చుకున్నది.

"వకుళా! ఒక మాట అడగనా?"

"అడుగు అక్కా."

"శ్రీమంత్‌పై ఎందుకు నీకంత మోజు?" అనుకోని ఈ సూటి ప్రశ్నకు చకితురాలైన వకుళ అవాక్కుగా చూడసాగింది అక్క దెస.

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు




మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం— క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.

**దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే రుజువు చేసుకోండి!**

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా



సూపర్ రిన్‌తో

**సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ**

"ఏదో కాస్త అందం, ఉద్యోగం మినహా ఏ ఐశ్వర్యమూ అర్హతా లేని శ్రీమంత్‌ను కట్టుకొనే ఖర్మేమిటి నీకు?"

"అక్కా!"

"ఔనే వకుళా! నేనేకాదు-మన స్నేహితులంతా నవ్వుతున్నారు—అక్క తృణీకరించిన వాడిని చెల్లెలు కట్టుకోవడమేమిటని?"

చిన్నబోయిన ముఖంతో కొద్ది క్షణాలు మౌనంగా వుండిపోయిన వకుళ, నెమ్మదిగా అన్నది.

"వ్యక్తి విలువ తెలియని వదరుబోతులు నీ స్నేహితులు!"

"వకుళా!"

"ఔను. రాయి అనుకొని అక్క పారవేసుకున్న రత్నాన్ని తెలివైన చెల్లెలు దక్కించుకొన్నదని వాళ్ళు త్వరలోనే తెలుసుకుంటారు!"

శశి రోషంగా లేచి నిలబడింది.

బలవంతంగా ఆగ్రహాన్ని అదుపులోనికి తెచ్చుకున్నది శశిరేఖ!

"హు! నీవు రత్నవైఢూర్యాల విలువ తెలిసిన మహారాణివా లేక రసికురాలివా?"

"అంత పెద్దపదాల జోలికి పోను. కేవలం ఆరాధకురాలిని. ఒక సామాన్య స్త్రీని."

"ఎంతకాలంనుండో ఈ ఆరాధన?" అంటూన్న శశిరేఖ స్వరంలో అమిత హేళన కురిసింది.

వకుళ తల వాల్చుకున్నది.

"నీ అక్కకే అతడు భర్త అయితే ఈ ఆరాధనను ఏం చేసేదానివి ? చాలాగట్టిదానవేనే! అమాయకురాలవనుకున్నాను!"

రోషంగా తలెత్తింది వకుళ.

"ఏం? చిన్ననాటినుండీ పెనవేసుకున్న చెలిమిని తెంపివేసి ఈనాడు ఐశ్వర్యం వెంట పరుగులు పెట్టడంకన్న నిర్లజ్జాకరమైనదా ఈ సంగతి?"

అవమానభారంతో మలినమైన ముఖానికి ప్రయత్నపూర్వకంగా ప్రకాశత కొని తెచ్చుకున్నది శశిరేఖ. చెల్లెలు యిచ్చిన చెప్పుదెబ్బలాంటి సమాధానం ఆమె అహంకారాన్ని ద్విగుణీకృతం చేసింది.

"ఐశ్వర్యం లేని బ్రతుకులో ఏ అవసరాలు తీరుతాయి?"

"లోకంలో ఆనందంగా వున్నవారంతా ఐశ్వర్యవంతులే కాదు."

"ఖర్మకాలి నీకేమైనా జబ్బు చేస్తే సరైన మందు అయినా యిప్పించగలడా ఈ అయిదారువందల జీతగాడు?"

"అక్కా! నీ మహేష్ గురించి నేనూ అలా నిరశించితే నీవు భరించగలవా? కలవారి భార్యలలో అధిక శాతానికి కన్నీళ్ళేకాని కనకాభిషేకాలు దక్కవు. సారీ! నీ జీవితం మాత్రం సుఖంగా వుండాలనే నేను కోరుకుంటున్నాను అక్కా. చేతనైతే నీవూ అలానే దీవించు. మనం అక్కచెల్లెళ్ళమే కానీ వైరులం కాదు."

రోషావేశంతోనూ అతిశయంతోనూ మిడిసిపడుతున్న శశిరేఖకు ఈ హితబోధ చెవి కెక్కలేదు.

"చాలీ చాలని కొంపలలో అగచాట్లు పడేవేళ ఈనాడు చేసిన పొరపాటును తలచుకు తలచుకు దిగ్గుళ్ళుతావ్."

"భర్త అనురాగమే పెట్టని కోట అడదానికి. చెట్టు నీడనకూడా హాయిగా బ్రతకగల జంటముందు మేడలూ, మిద్దెలూ తల వాల్చాలి !"




ఈ విషయంలో ఎంత హైరానపడ్డా ఫలి
తం దక్కలేదు. కొద్దినెలలకే అధికారులు
ఆ నిషేధం సంగతి మరిచిపోయారు
భిక్షకగృహాల్లోని యాచకులు మళ్ళీ రోడ్ల
కెక్కారు

"ఈ మెట్ట వేదాంతం మరచి, మేడలలో కార్లలో తిరిగే నన్ను చూచి అసూయ పడతావేమో ?"

"అహరహం శ్రమించే నాభర్త అంతకంటె పైస్థాయికి చేరినిన్ను అసూయకు గురి చేస్తారేమో ?"

"అసంభవం! ఇతరులను అడుక్కొని బ్రతక్కపోతే అదే సంతోషం"

"అక్కా!"

"అక్కను గనుకనే యింతగా హెచ్చరిస్తున్నాను, ఇప్పుడైనా మించిపోలేదు, నీ అభిప్రాయం మార్చుకొని, కొంచం ధనవంతుడిని ఎన్నుకో,"

"ఆగర్భ శత్రువు ఎవరో అక్క రూపాన సాధిస్తోందా అన్పిస్తోంది ఆనాటి కానాను, ఇంత అసూయ ఎందుకో నీకు నాపై ? ఇంత అక్కసు ఎందుకో శ్రీమంత్ పై ? ఏమిటతడు నీకు చేసిన అపకారం ? నిన్ను నిష్కల్మషంగా ఆరాధించాడు. నీవు చెడుదోవన పడుతోంటే నిలవేసి అడిగాడు, అంతేగా ?"

"తనెవరు నన్ను అడగటానికి ఆరాధించటానికి ? ఆఫ్టారిల్—నాన్నగార్ని అడుక్కొని చదువుకొన్నవాడు"

"అక్కా!!"

గది దద్దరిల్లింది,

శశిరేఖ త్రుళ్ళి పడింది,

"అడుక్కోలేదు, అప్పుతీసుకున్నాడు—తీర్చి వేస్తున్నాడు. అడుక్కొనే అల్ప గుణమే అతడికుంటే కట్నం పేరిట ఇపుడు చాలా అడుక్కొని మూటగట్టవచ్చు; పైసా కట్నంకానీ ఏ కానుకలూగానీ తీసుకోవడం లేదు, పైగా వివాహం అతి నిరాడంబరంగా చేయమని చెప్పాడు, ఇంతటి ఔన్నత్యాన్ని నీ మనసు గ్రహించక పోగా అతడిని డబ్బు

తెరలలో నుండేగానీ చూడలేకున్నావా, అదినిన్ను నీవు కించపరచుకోవడమే కానీ శ్రీమంత్ కేమీ అవమానం కాదు."

"కైవు బాగానే ఎక్కింది – తెగ పొగడుకుంటున్నావు"

"పొగడ్త కాదు, నీకు తెలియని విలువలు తెలియజెప్తున్నాను,"

"బాబోయ్ 'కట్టిపెట్టు' నేను పోతున్నాను"

"ఆగు అక్కా"

విలాసంగా అడుగులు లేస్తూన్న శశిరేఖ ఆగిదిమాయింపు విని రక్కున నిలచింది.

"చాలా సవాళ్ళు వదిలావుగానీ నా సగర్వమైన సమాధానంకూడా వినివెళ్ళు, శ్రీమంత్ చాలా ఉన్నతుడు. ఒకరిని అడిగే అల్పత్వమూ, అన్యులపై అసూయ జెందే నీచత్వమూ, అప్పులుచేసే చేతగాని తనమూ, యదార్థాలనుండి పారిపోయే భీరత్వమూ లేని ఉన్నతుడు, అలవిమాలిన ఆశలకో సతమతంకాక సంతుష్టి సంయమనం తెలిసిన సరసజీవి, సంస్కారి, సార్థకనాముడు, అతడిలోని ఆ ఔన్నత్యాన్ని సదా నిలిపేందుకే నేను కృషిచేస్తాను."

"నీఖర్మ, అనుభవించు, ఆదర్శాల ఆయుష్షు చాలా అల్పం ఈ బీదదేశంలో."

"ఈనాడు తెగడిన నాలుకతోనే మరొకనాడు పొగడుతావు అనుకోక పోతే అదే పదివేలు అన్నావు కదూ ? ఎంత అవసరమున్నా నీయింటికి మాత్రం ఎందుకూ రాను !"

## 18

"చాలా గడుసుదానవు సుమా వకుళా, గప్ చిప్‌గా అన్నయ్యను వశం చేసేసుకున్నావ్," అంటూ హాస్యాలు ప్రారంభించింది వివాహానికి వచ్చిన శారద.

వకుళ బలవంతాన ఉత్సాహం కొని తెచ్చుకొని నటించింది.

"నన్ను తర్వాత సతాయించవచ్చు కానీ—అర్ధ ముకుకుగారూ మీ రెంతవరకు మా అన్నగార్ని కట్టి పడవేశారూ, ఏమేమి ఆజ్ఞలతో బంధించారూ వగైరాలు విన్పించండి."

"నా దేముందమ్మా?" సద్దలు చేసిన పెళ్ళిగాని బింగముూతితో సమాధాన మిచ్చింది శారద,

"మాదీ అంతే శారదా." తన ముఖభావాలు శారదకు కన్పించనీయకుండ మరోదిసకు తిరిగి కాఫీ కలుపుతూ జాగ్రత్త పడింది వకుళ.

శారద తేరిపారి జూచింది వకుళను.

"వదినా ఓమాట అడగనా ?"

"అప్పుడే 'వదిన' !"

"ఆ మరో నాల్గురోజులేగా పెళ్ళికి వ్యవధి ? ఇప్పట్నించే 'వదిన' అని పిలవాలని రూలేమీ లేదుగానీ నామాటకు సమాధానంచెప్పు ఎగర గొట్టకండి."

"ఏమిటి ?" నీరసంగా అడిగింది వకుళ,

"శశి ఎందుకు పెళ్ళి చేసుకోవడంలేదు ?"

"............"

"చెప్పు వకుళా, శశికీ మా అన్నకూ భేదాలు ఎందుకొచ్చాయి ?"

గుండెలలో రైళ్ళు పరుగెడుతూండగా మంద్రస్థాయిన జవాబు చెప్పింది.

"అది మీ అన్న నే అడుగు శారదా !"


శ్రీమతి ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి
శాంభవి .. 15.00




నవజ్యోతి పబ్లికేషన్సు

"అన్నదగ్గర నాకంత చనువూ, ధైర్యమూ వుండవని నీకు తెలియదేమిటి ? నువు చెబుదూ"

రెండు క్షణాలు ఆలోచించింది.

"ఆసంగతి ఎప్పుడైనా మా అక్కనే అడుగు శారదా," అన్నది మెల్లగా

శారద భృకుటి ముడి వడింది.

"నాదగ్గర దాపరికమా ?"

"కాదు, కానీ ఎంత దగ్గర వారైనప్పటికి ఇతరుల విషయాలు బహిరంగం చేసే హక్కు మనకెక్కడిది ?"

"ఇతరులా ?" శారద కనులు మీనములను స్ఫురణకుతెస్తూ త్వర త్వరగా కదిలాయి ఆశ్చర్యంతో, "ఇతరులెవరు వకుళా ? నీ అక్క, నాఅన్న అంతేగా ?"

"కావచ్చు, అయినా మనం మాట్లడ కూడదు"

అటుతిరిగి వున్న వకుళను గభాలున ఇటు తనకు అభిముఖంగా తిప్పుకొన్నది శారద.

వకుళ కనులలోనికి సూటిగా చూస్తూ అడిగింది.

"వకుళా ! నీకీపెళ్ళి యిష్టమేనా ?"

వకుళ కనులు భారంగా వున్నాయి, వదనం కల్లోల పూరితంగా వున్నది, కానీ పెదవులునుండి జవాబుగా ఒక్క మధుర దరహాసం ప్రదర్శించింది.

శారద నేత్రాలు విపరీతంగా చలించాయి, కనులలో ఎన్నో ప్రశ్నలు కదులాడాయి.

"నిజంచెప్పు వకుళా" నువ్వేమీ బాధపడడంలేదు గద ? బలవంతంగా గానీ అంగీకరించావా ?"

"ఛ, మనస్ఫూర్తిగా – మహాద్భాగ్యంగా భావిస్తూ."

శ్రీమంత్ వచ్చినట్టు బూట్లుధ్వని వినవస్తోంది.

శారద అతడికి ఎదురు వెళ్ళింది.

ఒంటరిగా మిగిలిన వకుళ నిట్టూర్పుతో అనేక భావాలు !

"యేమో ! సంతోషంగానే అంగీకరించాను కానీ భావి జీవితం ఆనందమయమో లేక బాధా మయమో యెవరికి తెలుసు ? శ్రీమంత్ నన్ను ఎప్పటికైనా స్వీకరింపగలడా ?"

"మరి మనం బజారు పనులనీ చూచుకోవద్దూ అన్నయ్యా ?" శారద అడుగుతోంది.

""చూద్దాం. డబ్బెంత కావాలి ?" శ్రీమంత్ ఎదురు ప్రశ్న.

"ఎంతైనా కావాలి కానీ ఎలా తెస్తావ్ ? ఇల్లు అమ్మిన డబ్బంతా నా పెళ్ళికే అయిపోయిందాయె !"

"ఇప్పుడా సంగతెందుకు? ఆఫీసులో అప్పు తెస్తాను. ఇదివరకే 'లోను'కు అప్లయి చేశాను."

"హు, తర్వాత ఆ అప్పు నెలనెలా తీర్చుకోవలసిందేగా? ఇటు సంసారం–అటు ఋణం–ఎలా నెగ్గుకొస్తావో?" సానుభూతిగా అంటోంది శారద.

"ఫర్వాలేదు. ఉన్నంతలో వకుళ గుట్టుగా గడపగలదనే ధైర్యం నాకుంది."

"అచ్చా! అప్పుడే వదినపై నీకెంత నమ్మకం పుట్టుకొచ్చింది!"

శారద నవ్వుతోంది.




వకుళ హృదయం ఆనందలాస్యం చేసింది!

అతడు తన గురించి ఆ మాత్రం అభిమానంగా గౌరవంగా తలపోస్తే, ఇక కావలసిన దేమున్నది?

"శారదా! ఎక్కువ ఖర్చులూ, ఆడంబరాలూ వద్దని మీ అన్నగారికి చెప్పు" అన్నది లోనికి వచ్చిన శారదతో.

"అదేమో నువ్వే చెప్పమ్మా."

"అబ్బ, నేను చెప్పలేక నే కదా?"

"అబ్బో! ఇవాళయితే నేను వచ్చానని రాయబారం చెయమంటున్నావు. మరి గప్‌చిప్‌గా పెళ్ళి కుదుర్చుకున్నది మీరిద్దరేగా?"

"అబ్బ! మొదలుపెట్టావా నీ పరిహాసాలు?"

కోటయ్య రావటంతో శారద అటు వెళ్ళింది.

వకుళకు తన మనసులోని మాట శ్రీమంత్‌కు వ్యక్తీకరించే దారి తెలియరాలేదు.

కోటయ్య కూడ రావడంతో తానక్కడ వుంటడం భావ్యం కాదనుకొని నెమ్మదిగా వెళ్ళిపోతున్న వకుళను చూచాడు కోటయ్య.

"ఏమ్మా వెళ్ళిపోతున్నావ్? శారద ఇపుడేగా వచ్చింది?" అంటూ మాటలతోనే ఆపాడు.

మౌనంగా నిలబడిపోయింది వకుళ.

"నేను రాగానే సిద్ధంగా భోజనం వడ్డించింది నాన్నగారూ వదిన!" శారద సంతోషంగా అన్నది.

కోటయ్య ఆనందాతిశయంతో అన్నాడు.

"తెలుసమ్మా, వకుళ నా అదృష్టం కొద్దీ ఈ యింటి కోడలవుతూన్నది. నువ్వూ,

మీ ఆయనా వస్తూ పోతూ వుంటే ఈ ఆడదిక్కులేని కొంపలో అసలు మర్యాదలూ, ముచ్చటలూ ఏమి తీరుతాయి అని బాధపడేవాడిని, ఇక నాకు నిశ్చింత. ఇటు శ్రీమంత్, అటు వకుళ కూడా నా మాటనూ, అభ్యర్థననూ మన్నించారు."

వకుళ క్రీగంట చూచింది శ్రీమంత్ భావాలు ఎలా వున్నవో నని.

శ్రీమంత్ ఈ సంభాషణను వినడమే లేదు. పోస్టులో వచ్చిన ఉత్తరాలను తదేక శ్రద్ధతో పరిశీలించుతున్నాడు!

వకుళ హృదయం వగచినా, వదనం వాడలేదు.

"నేను వెళుతున్నాను శారదా" అన్నది.

"అదేమిటీ? ఇప్పుడు బజారు వెళ్ళాలిగా?"

"వెళ్ళండి మీరు."

"కాదు. నువ్వూ రావాలి. నీ చీరలకోసమేగా?"

వకుళ ఇబ్బందిగా చూచింది.

"నేనెందుకూ?" అంటూ నసిగింది.

"ఎందుకేమిటి? వెళ్ళమ్మా నువ్వూను. మనలో మనం గాక ఇంకెవరున్నారు మనకూ?" కోటయ్య వంత పాడాడు శారదకు.

"అబ్బాయ్, మీరు ముగ్గురూ వెళ్ళి కావలసినవి చూడండి, కొనుక్కోండి. నేను యింటిదగ్గర పనులు చూచుకుంటాను." అని ఫర్మాయిషించాడు కొడుక్కి.

"అలాగే, శారదా. మీరు తయారవ్వండి. నేను ఒక్కసారి ఆఫీసుకు వెళ్ళి ఓ గంటలో వచ్చేస్తాను."

"ఒక్కక్షణం, భోజనం చేసి వెళ్ళన్నయ్యా,"

శారద పిలుపువిని లోనికి వెళ్ళాడు శ్రీమంత్.

అదను దొరికిన వకుళ శ్రీమంత్ గదిలో టేబుల్ దెస నడచి, రెండునిముషాల తర్వాత బయటికి వచ్చేసింది.

భోజనానంతరం ఆఫీసుకు వెళ్ళిన శ్రీమంత్, సీటులో కూర్చుంటూండగా కొలీగ్ చంద్రం విస్మయంగా చూచాడు.

"నీవు ఈపూట కేజువల్ లీవ్ తీసుకున్నావుగా ? మళ్ళీ వచ్చావేం ?"

ఖంగారుపడిన శ్రీమంత్ అంతలోనే సర్దుకున్నాడు, తన తడబాటును పైకన్పింపనీయకండా వుండాలని చాలా ప్రయత్నించాడు.

"అదేలే, లోన్ డబ్బు తీసుకు వెళ్ళాలని వచ్చి........ఇక్కడ........ఇక్కడ ఏదో కాస్త వర్క్ మిగిలింది—పోనీ అదిచూచి వెళదామని కూర్చున్నాను."

జేబురుమాలుతీసి ముఖం అద్దుకుంటూండగా దానిలోనుండి ఓ కాగితం మడత క్రిందపడింది.

దాచినా దాగకున్న అతడి ఖంగారునూ, ఆ కాగితాన్ని పరీక్షగా చూచాడు చంద్రం.

"ఏదో లవ్ లెటర్ లాగున్నదే! అదీ సంగతి. అందుకే పెట్టిన లీవ్ కూడ మరచి డ్యూటి కొచ్చావ్." అంటూ నవ్వాడు.

తప్పనిసరిగా నవ్విన శ్రీమంత్ ఆ కాగితాన్ని తీసుకుని బయట కారిడార్ లో నిలబడి విప్పాడు ఆశ్చర్యంగా.

"శ్రీమంత్ !

నీతో ముఖాముఖి చెప్పలేక ఈ విధంగా వ్రాస్తున్నాను. అనవసర ఆర్భాటాలూ




"నాకామాత్రం తెలియదనా ఈ నిలదీసి అడగడం? అన్నీ ఆలోచించే కొనుక్కొచ్చాను." కోపంగా అన్నది.

"ఏమాలోచించావే తెలివి తక్కువదానా? ఈ రోజుల్లో ఇంజనీరు అల్లుడు కావాలంటే లక్ష కట్నం తీసుకోనిదే దొరకడు తెలుసా? చిన్నప్పటి నుండీ మన యింట్లో తిరుగుతున్నవాడని నీకు నిర్లక్ష్య మేర్పడిందనుకోనా? కట్నం అక్కరలేదన్నాడని చిన్న చూపు ఏర్పడిన దనుకోనా? అతడి పౌరుషాన్ని. ఆభిజాత్యాన్ని నీవు సరిగా అర్థం చేసుకోలేదు."

"మహా ఏమిటండీ మీరు అర్థం చేసుకొన్నది? పెద్దదానికి కాకుండా చిన్నదానికి ముడిపెడుతున్నాం. అదీ ఆహ్వానాల్లేవు, ఆర్భాటాలులేవు, ఇదెంత మథనగా వున్నదో నాకు మీకేం తెలుసు?"

"పెద్దదానికి కాలేదు కనుకనే మనల్ని లోకం ప్రశ్నల నుండి కొంతలో కొంతైనా రక్షించటానికి అతడు యిలా నిరాడంబరంగా చేయమన్నాడు. ఈ విధంగా పెళ్ళి ఖర్చులు కూడ ఓ పాతికవేలు ఆదా అయినాయి. అది తెలియని నీ తెలివితక్కువతనం అతడికిచ్చే బట్టల దగ్గర కూడ అల్పత్వం ప్రదర్శించింది."

"మీరలా అర్థం చేసుకున్నారంతే, అతడికెటూ ఆర్భాటాలూ అవీ యివీ అడిగే అలవాటూ లేదు; వెనక తల్లి లేదుగా కావాలని ఆరళ్ళు పెట్టటానికి? మనం ఎలా చేసినా చెల్లుతుంది. అంతగా మనం అవస్థలుపడి అన్నీ పెట్టవలసిన అంతస్తుకూడా కాదు. మామూలువాడు. మరి రేపు శశి పెళ్ళికి అలా కుదరదే మరి? మహా ధనవంతులు వాళ్ళు అన్నిటా మనను మించిన వాళ్ళు, మహేష్‌కు తల్లీ అక్కలూ వున్నారు—అన్నీ లెఖ్ఖజూచి అడిగి మరీ వసూలు చేస్తారు. అంచేత ఇది ఇలా తేలికగా కానిద్దాం. అడిగిన వాళ్ళకూ అడగని వాళ్ళకూ కూడా యిస్తే మనకు మిగిలే దేమిటిక!" —(సశేషం)



# ఆరుద్ర బాతాఖానీ



సంచికలలో ఇదివరలో ప్రచారించిన ఆరుద్రగారి బాతాఖానీలని మరో సారి ప్రచురించి మిమ్మల్నోసారి మళ్ళీ ఆనందింపచేయడమే మాకు మరోసారి ఆనందం.

పానక మహాశయులారా !

మీ వినోదం కోసం నివేధించే అక్షరాల హత్యా సాహిత్యాన్ని చదివి మమ్మ్మ ఆనందింప గోకుచున్నాము

మేము ప్రికటించిన కొన్ని పుచ్చు తప్పులను వరించి వాటినే మరణంచేదు కొంటున్న హాస్యనట్టుడి కారుకి ద ఇద్దరు ప్రమోదవశాన పడి మరలించినట్టు రోజా వార్త. పక్కనున్న మైద్యశాలలో హాస్య నటుడు మాత్రము పానములు గ్రోలినట్టు తెరుస్తున్నది.

మరికొన్ని ముద్రా రాజసాల్ని విన్న విస్తున్నాము అవి ధరించండి.

చల్ మోహనరంగా, నీకు నాకు జోడు కరిచెకదరా।

నిత్య కల్యాణము, పిచ్చి తోరణము. మేఘ సందేహమును తెగులులో
చాలామంది అనువధించినారు

త్వరలో రానున్నది మా జాణపద చిత్రము.

సితిదా వచ్చిన పుచ్చును సలిలమ-గా నారికేలి సరసము భంగున్.
మోహనము మురళీధారి—బృందావన సంసారి.

అధునిక చైత్రకళ షోభాయ మానంగా వుంటుంది.

కొన్ని చిత్రాలు జతదినోత్సవాలు జరుపు కొంటాయి.

అశేష విశ్లేషమును సశేషము.

మీ

ఫ్లాక్ రీడర్




రెండు రోజులుగడిచిపోయినాయి.

ఫ్యాక్టరీ చూసే నెపంతో అక్కడికి వెళ్ళి శేఖరాన్ని అడిగింది జ్యోతి

"మీరాకి కొడుకు వున్నట్టు మీకు తెలుసా?"

"తెలుసు" అన్నాడు మామూలుగా శేఖరం.

"మీకు కొడుకున్నాడని చెప్పారు; నాకు చాలా ఆశ్చర్యంగా అన్పిస్తోంది........ మరి మీ భార్య ఎక్కడా కనపడదేం? ఘోషానా?" ఓరగా చూస్తూ వెటకారంగా అడిగింది.

"ఇందులో పెద్ద అంత ఆశ్చర్యపడవలసింది ఏముంది."

"మీ భార్యని చూడాలని నాకు చాలా కోరిగ్గావుంది. ఒకసారి చూపించండి" శేఖరాన్ని అనుకొనేంత దగ్గరగా జరుగుతూ అంది.

జ్యోతినుండి కొంచెం దూరంగా జరుగుతూ, "మీ కోరిక ఇప్పుడు తీరదు. ఆవిడ పుట్టింటికి వెళ్ళింది" అన్నాడు.

"అయితే మీ ఇద్దరికీ పడదా? కళ్ళు చక్రాల్లా తిప్పుతూ అడిగింది.

"క్షణం పడదు" నవ్వాడు.

అక్కడికి రెడ్డి రావటంతో జ్యోతి ఇంకేమీ అనలేదు.

తర్వాత శేఖరం కారులోనే జ్యోతి ఇంటి కొచ్చింది. జ్యోతి ఏమడిగినా చాలా సహనంగా జవాబులిచ్చేడు శేఖరం. ఇన్నాళ్ళకి మావయ్యా – ఆవిడా - ఎన్నో సంవత్సరాలు బాధలు అనువించినా - ఈ నాడు ఇలా కలిసేరంటే దానికి జ్యోతే కారణం. ఆరోజు జ్యోతి తనమీద కసితో అలా తీసుకెళ్ళడం - అక్కడ మీరా వుండడం – అలా

అలా అన్ని గొడవలు జరిగి - ఇప్పుడు మామయ్య రావటం........ఎంత చిత్రంగా జరిగి పోయాయి అనుకున్నాడు. వాళ్ళు ఇంటికి వచ్చేసరికి కోటేశ్వరరావూ సరోజినీదేవి వున్నారు. కాంతమ్మ, మీరా ఎవరో శాంతమ్మగారు చెప్పేసరికి వాళ్ళ ముఖాలు ముడు చుకు పోయాయి. అయినా సరోజినిదేవి ధైర్యం తెచ్చుకుంది.

ఎంత మేనకోడలు అయినా పెళ్ళి కాకుండా తల్లి అయిన పిల్లని తనకోడలిగా ఎలా చేసుకుంటుంది అనుకుంది.

ఇంటి కొచ్చిన వాళ్ళని మర్యాదచేసి పంపించింది శాంతమ్మగారు "పెళ్ళి విషయం వాడిష్టం, నాదేముంది" అంది. శేఖరం మౌనంగా వుండిపోయాడు.

o o o o o

ప్రకాశంగారిని కాంతమ్మ క్షమించినా మీరా క్షమించలేదు.

కూతుర్ని దృష్టిలో పెట్టుకుని — కూతురు జీవితం దృష్టిలో పెట్టుకుని కాంతమ్మ ప్రకాశంగార్ని క్షమించింది. తన తరవాత తన కూతురుకి ఎవరు దిక్కు? ఒంటరిగా ఎలా బతకగలదు. ఏదో ఇప్పుడు ఆవేశంలో అనుకుంటుంది-నాలుగు రోజులు నవ్వి వాళ్ళే పూరుకుంటారని. అలా వూరుకుంటారా? దాని జీవితం చక్కబడే యోగం లేక పోయినా.........నా అనేవాళ్ళు నలుగురు అండగావుంటారు. అనుకుంది కాంతమ్మ. మీరా జీవితం నవ్వంగానే వుండి-ఇన్ని సంవత్సరాలకి కారణాలు ఏమయినాగాని ఆవిడ క్షమించలేకపోనేమో!

వాళ్ళు రెండుమూడుసార్లు వచ్చి ఆప్యాయంగా మాట్లాడగానే మెత్తపడిపోయిన తల్లి మీద కోపంవచ్చింది మీరాకి. చిరాకేసిందికూడా. తల్లి పలకరించినా ఏదో ముభా వంగా బదులు చెప్పి తప్పుకు తిరుగుతోంది.

ఈ కారణంగానే శాంతమ్మగారు ఎంత బతిమాలినా వాళ్ళింటికి వెళ్ళలేదు. ప్రకాశంగారు ఆప్యాయంగా పలకరిస్తేకూడా వినపడనట్టు గబగబా తప్పుకుపోతోంది. మీరా. విజయ్‌ని సాధ్యమైనంత వరకూ వాళ్ళున్నప్పుడు ఆ ఛాయలకి పోకుండా చేస్తోంది

వాళ్ళు ఇక్కడికి రాకపోవటానికి కారణం ఏమిటో శేఖరానికి అర్థంకాలేదు. "ఇక్కడికి తీసుకొచ్చేయి మావయ్యా! అక్కడెందుకూ!" అని అతను రెండు మూడు సార్లు చెప్పాడు. అసలు మీరా ఫలానా అని తెలిశాక మీరాని శేఖరం చూడలేదు.

మీరా వైఖరి చూసిన ప్రకాశంగారు గ్రహించలేకపోలేదు. ఆయన చాలా బాధ పడ్డారు. ఇప్పుడు శేఖరంతో బాధగా అదే అన్నారు "కాంతం నన్ను క్షమించినా మీరా నన్ను క్షమించలేదురా".

మీరా పట్టుదలకి మొండి తనానికి శేఖరానికి చిరాకేసింది.

'ఇది మావయ్యమీద కోపంకాదు - తన మీద' అనుకున్నాడు.

"ఆవిడని డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళాతానన్నావుగదా! నేను మాధురా దేవితో చెప్పేను. సాయంత్రం అమ్మకూడ వస్తుంది. తీసుకెళ్ళి చూపించు—అదివరకెప్పుడూ రాని ఫిట్సు ఇప్పుడొస్తున్నాయంటే.... . అంత బలహీనంగా వున్నప్పుడు ఆలస్యం చేయడం మంచిది కాదు" అన్నాడు.

"వస్తే తీసుకెళతానురా! వస్తుందా అని"

"ఎందుకు రాదూ! అమ్మ చెప్తుంది"

"నువుకూడా వచ్చి చెప్పకూడదూ!" అన్నారాయన.

"నేను హాస్పిటల్‌కి వస్తాను" అన్నాడు.




మధ్యాహ్నం శేఖరం ఎక్కడికో వెళుతోంటే శాంతమ్మగారు అంది. "మళ్ళా ఎన్నింటికి వస్తావురా" అని.

మీరు అక్కడికి వచ్చేసరికి వస్తాను" అన్నాడు.

"ఆవిడ చాలా నీరసంగావుంది— ఇంక ఎలాగూ ఓ గంటలో బయలు దేరదామనుకుంటున్నాను. కారులో తీసుకెళ్ళచ్చు వుండిపోకూడదూ!"

"ఇప్పుడు అర్జంటుగా వెళ్ళాలమ్మా! వీలుగావుంటే ఆ టైముకి వస్తాను లేకపోతే హాస్పటల్‌కి వస్తాను నేను రాకపోతే గుర్రబ్బండి తీసుకుందమ్మని గంగులుచేత కబురుచేయి వస్తా" అని వెళ్ళిపోయాడు. తను వెడితే మీరా మరీ అసహ్యించుకుంటుందని శేఖరం ఇప్పుడు వెళ్ళదలుచుకోలేదు తను ఇంట్లోవుంటే వెళ్ళకపోతే బాగుండదనే అతను బయటకి వెళ్ళిపోయాడు.

శాంతమ్మగారు తాను ఒక్కత్తే ముందు వెళ్ళింది. కాంతమ్మకి నాలుగుమాటలు ధైర్యంగా చెప్పింది. డాక్టరుకి చూపించుకోకపోతే ఎలాగ అంది - నువ్వు రాకపోతే నా మనసు చాలా బాధపడుతుంది అంది — రాకపోతే నా మీద ఒట్టే అంది — నే నింత చనువుగా మాట్లాడుతున్నా నన్ను పరాయిగానే చూస్తున్నావంది-

ఆవిడలా మాట్లాడుతోంటే కాంతమ్మకి చాల ధైర్యం కలిగింది. ఒంటరిగా బతకడం చాలా కష్టమనుకుంది. అసలు ఇన్నాళ్ళిలా ఎలావున్నానూ ఎవరితోడూ నీడా లేకుండా అనుకుంది.

డాక్టరుకి చూపించుకోవటానికి మెత్తబడింది.

ప్రకాశంగారు గుర్రబ్బండి తీసుకొచ్చేరు వెళ్ళేముందు.

కూతురు ఏం మాట్లాడకపోవడం - అసలు కంటికి కనిపించకుండా అలా తప్పించుకు తిరగటం ఆవిడకి చాలా బాధగా, సిగ్గుగా వుంది తనని మీరా ఏమనుకుంటోంది? సిగ్గులేని దానిలా అనుకొంటోందా? తనిలా రాజీకొస్తోందంటే అది తను ఏమవుతుందో ననేగా! డాక్టరు దగ్గరికి మానేద్దామా అంటే ఆవిడ వదిలి పెట్టటంలేదు.

"మీరా!" నీరసంగా పిలిచింది కూతురుని.

మీరా వినపడనట్టే రాలేదు.

కాంతమ్మ దొడ్లోకి వచ్చింది. మీరా మొక్కలకి గొప్పులు తవ్వుతోంది. కూతురికి ఏమని చెప్పాలో తోచనట్టుగా గుమ్మందగ్గరే నిలబడి పోయింది.

కాంతమ్మ ఎంతసేపటికి రాకపోవటంతో శాంతమ్మగారు అక్కడికి వచ్చింది.

"మీరా! అమ్మని హాస్పటల్‌కి తీసుకెళుతున్నాను. వచ్చి తలుపేసుకోమ్మా!" అంది. మీరా ముభావంగా వుండడం ఆవిడా గమనించింది. కాని, ఇంకోలా కూడా అనుకుంది.

మీరా లేచి నిలబడింది.

"వచ్చి తలుపేసుకో!" అని ఆవిడ కాంతమ్మని తీసుకెళ్ళిపోయింది.

వాళ్ళు తలుపు దగ్గరకేసి వెళ్ళిపోయారు.

మీరా చాలాసేపు అలాగే నిలబడిపోయింది

ఆడదాని వ్యక్తిత్వం ఇంత బలహీనం కాబట్టే మొగాడు అలా ఆడిస్తున్నాడు. ఏదో తమజాతికి అన్యాయం జరిగిపోతోందని ఏడవటం ఎందుకూ? వాళ్ళిలా ఏడ్చినన్నాళ్ళు వాళ్ళలా ఆడిస్తూనే వుంటారు.

మీరా ముందుగదిలోకి వచ్చింది - నీరసంగా కుర్చీలో కూలబడింది.

మొదటంతా మొద్దుబారిపోయినట్టుగా అయిపోయింది. టేబిల్ మీద మోచేయి ఆనుకుని, చెంపకి చెయిజేర్చి కళ్ళు మూసుకుని అలాగే కూర్చుంది.

o o o o o

తలుపు చప్పుడవటంతో ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది.

ఎదురుగా శేఖరం—

మీరా లేచి నిలబడింది. మీరాలో కలిగిన కోపం - ఆవేశాన్ని అదిమిపెట్టింది. "మీ మావయ్యగాని - మా అమ్మగాని ఎవరూ లేరు. హాస్పటల్‌కి వెళ్ళారు—వెళ్ళచ్చు" గుమ్మంకేసి దృష్టినిలిపి అంది

"నేను వచ్చింది నీ కోసం - నీతో మాట్లాడాలని."

శేఖరంకేసి కస్సుమన్నట్లు-చూసింది.

"నాకేం చెప్పనక్కరలేదు - నేనేం వినను. ... మా అమ్మలా నేను" .. ఆయాసంతో ఆగిపోయింది.

శేఖరం తలుపు దగ్గరగా నొక్కేడు — తలుపుకి ఆనుకుని అక్కడే నిలబడి, "నువు చాలా తెలివైనదాని వనుకుంటున్నావా?" మీరా కళ్ళల్లోకి సూటిగా అన్నాడు.

"మా అమ్మలా తెలివి తక్కువ దాన్ని మాత్రం కాదు" చాలా నిర్లక్ష్యంగా అంది.

శేఖరం ముందుకు కదిలాడు-

మీరా గది గుమ్మం దగ్గరకు వచ్చి గుమ్మానికి అడ్డంగా నిలబడినట్టు నిలబడింది. ఆ గదిలో విజయ్ ఉన్నాడు. విజయ్ దగ్గరకి శేఖరం వెళ్ళటం మీరాకి ఇష్టంలేదు.

శేఖరం మీరా దగ్గరగా వచ్చాడు.

"నేనెప్పుడు సీరియస్‌గా మాట్లాడబోయినా నువ్వు ముందే ఆవేశం తెచ్చుకుని నాకు కోపం తెప్పిస్తావు. చెప్పేది సాంతం ఎందుకు వినవూ!" బాధని సూచిస్తున్నట్లు అతని కను బొమ్మలు ముడుచుకున్నాయి,

అసలే మనసు ఉడికిపోతోంది— అలాంటి సమయంలో శేఖరం వచ్చాడు. అతని




# నిప్పో
## స్పెషల్




నిప్పో స్పెషల్ ఎప్పుడూ సరికొత్తగా టాప్ సీల్ తో నాణ్యతకి సంబంధించిన ISI చిహ్నంతో వస్తుంది. టాప్ సీల్ వున్న మొట్టమొదటి పేపర్ క్లాట్ బ్యాటరీ నిప్పో స్పెషల్. ప్రపంచ ప్రసిద్ధిచెందిన నేషనల్ కంపెనీ (జపాన్) సాంకేతిక విధానంతో తయారుచేయబడింది.
అత్యుత్తమంగా పనిచేస్తుంది.
దీర్ఘకాలం మన్నుతుంది. టార్చి లైట్లకి మరియు ట్రాన్సిస్టర్లకి అనువైన బ్యాటరీ నిప్పో స్పెషల్.






నిప్పో
స్పెషల్

ప్రపంచ ప్రసిద్ధిచెందిన జపాన్‌లోని నేషనల్ కంపెనీ సాంకేతిక విధానంతో తయారుచేయబడింది.

INL-2470

మనసులో బాధనిగాని, అతని కంఠంలో తిరస్కృతినిగాని గుర్తించే స్థితిలో లేదు మీరా "నేనేం వినను– వినను– వినను నాకెవరూ ఏం చెప్పక్కర్లేదు– మీరిక వెళ్ళొచ్చు" గుమ్మంవేపు చెయ్యి పెట్టి చూపిస్తూ ఆవేశంగా అరిచింది.

అతనికీ కోపం వచ్చింది.

"నువ్వే గొప్పదాన్నిఅనుకుంటున్నావా?" అసహనంగా అడిగాడు.

"మీలా డబ్బు గొప్పతనం లేకపోవచ్చు" చాలా నిర్లక్ష్యంగా అంది.

"ఏంటి మనసు గొప్పదా?" అతనికి తెలియకుండానే అతని స్వరంలో హేళన ధ్వనించింది.

ఆ మాట ముల్లులా గుచ్చుకుంది మీరాకి.

"మీకు చాటి చెప్పుకోవల్సిన అవసరం నాకేం లేదు."

మీరా మాటలు పూర్తి కాలేదు. చిన్నగా రాగం తీస్తూ విజయ్ ఉయ్యాల్లోంచి లేచి కూర్చున్నాడు.

శేఖరం రెండడుగులు ముందుకువేసి కొద్దిగా తలతిప్పి లోపలికి చూశాడు.

శేఖరం అడుగు ముందుకు వేసేసరికి మీరా గుమ్మానికి చెయ్యి అడ్డం పెట్టేసింది.

విజయ్‌ని చూడగానే అవ్యక్తమైన ఆనందంతో అతని ముఖంలోకి కాంతి లాంటిది వచ్చింది. మీరా చెయ్యి తప్పించి లోపలికి వెళుతూ కొద్దిగా కళ్ళు వాల్చి మీరాకేసి చూస్తూ అన్నాడు "నువ్వేం భయపడనక్కర్లేదు. నీ అనుమతి లేందే బాబు వంటిమీద చెయ్యి వేయను" అనేసి ఉయ్యాల దగ్గరగా వెళ్ళాడు.

కొత్త మనిషిని చూడగానే విజయ్ వింతగా చూడసాగాడు.

కొద్దిగా తెరచిన నోరు ఆశ్చర్యంగా చూసే ఆ చురుకైన కళ్ళు ...

శేఖరం కళ్ళు విజయ్ మూర్తిని హత్తుకుపోయి ఉన్నాయి–

కొద్దిగా మెడ వెనక్కి పెట్టి నోరు తెరుచుకుని శేఖరాన్ని ఆశ్చర్యంగా చూస్తున్న విజయ్ మెడ నొప్పి పుట్టటంతో "హా" అంటూ తల అటూ ఇటూ తిప్పి తల్లికేసి చూశాడు.

ఉయ్యాల స్తంభం మీద ఒక చేయి వేసి రెప్ప వాల్చకుండా విజయ్‌నే చూస్తున్న శేఖరం కొద్దిగా మీరాకేసి తల తిప్పినా అతని చూపులు విజయ్ మీదనే ఉన్నాయి–

"ఏం పేరు?" అన్నాడు

మొదట శేఖరానికి చేయి అడ్డం పెట్టినా– వాళ్ళిద్దరినీ అలాగే రెప్ప వేయకుండా చిత్రంగా చూస్తున్న మీరా యాంత్రికంగా చెప్పింది "విజయ– విజయచంద్ర"

అతని పెదవులు విచ్చుకున్నాయి తనలో అనుకున్నట్టుగా అన్నాడు "చాలా మంచి పేరు"

మీరా తలుపుకి ఆనుకుని నీరసంగా నిలబడింది

విజయ్‌ని మరోమారు తనివితీరా చూసి, అయిష్టంగా బలవంతంగా ఇవతలకి వచ్చాడు శేఖరం మీరా దగ్గరగా ఆగాడు

"మీరా నీకు నామీద చాలా కోపం– [illegible] ఆ సంగతి నాకు తెలుసు. కాని మీ అమ్మగారి గురించి ఆలోచించు [illegible] డ్డారు. ఆవిడమీద ఆ మాత్రం జాలిలేదా?"

మొగవాళ్ళ అహంకారం– [illegible] నత గుర్తుకొచ్చి దిగజారుతున్న ఆవేశం రెట్టింపుగా వచ్చింది. "ఎప్పుడో మెడలో పసుపుతాడు కట్టించుకున్న నేరానికి ఆవిడ వెడితే వెళుతుంది– అది నాకు అనవసరం" రోషంతో ముక్కుపుటాలు అదిరాయి




తనలో కలిగిన ఆవేశాన్ని పయికి కనపడనీయకుండా రెండు మూడు క్షణాలు మౌనంగా నిలబడిపోయాడు శేఖరం. తర్వాత పాంటు జేబులోకి చెయ్యి పోనిచ్చి కొంచెం పొడుగ్గావున్న కవరు తీశాడు.

"ఇదిగో అరుణ నీకు రాసింది మూడు రోజులయింది వచ్చి."

యాంత్రికంగా అందుకుంది మీరా.

శేఖరం గడప దాటబోతూ వెనక్కి తిరిగి చూశాడు. అతని పెదవులు [illegible] విచ్చుకున్నాయి. "టా టా" అన్నట్టు చెయ్యి ఊపాడు. విజయ్ నవ్వి [illegible] ఊపాడు 'టా టా' అన్నట్టుగా. శేఖరానికి ఒక్క అంగలో వెళ్ళి విజయ్‌ని రెండు చేతులతో ఎత్తి గుండెలకి హత్తుకోవాలని బలంగా అనిపించింది. తను ముందే మీరాకి మాట ఇచ్చాడు- ఆ కోరికని బలంగా నొక్కిపట్టాడు. ఇంకా కాసేపు అక్కడే వుంటే తనాకోరికను నిగ్రహించుకోటం కష్టమని వడి వడిగా అడుగులు వేస్తూ వెళ్ళిపోయాడు.

o o o

రెండు మూడు రోజులు గడిచిపోయినాయి.

కూతురు పద్ధతి అంతపట్టక ఏం మాట్లాడ్డానికి [illegible] చాలక [illegible] సతమత మౌతోంది కాంతమ్మ

ప్రకాశం గారు తనని చూస్తూనే ముఖం చిట్లించుకుని [illegible] మీరాతో ఏం మాట్లాడితే ఏమవుతుందోనని ఎన్నోసార్లు మాట్లాడదామని ప్రయత్నించి కూడా ధైర్యం చాలక ఆగిపోయారు

అంత క్రితంరోజు వరకూ మీరా ఇంకా వస్తుంది ఇంకా వస్తుందని ఎంతో ఆశగా ఎదురు చూసిన శేఖరానికి నిరాశే ఎదురయింది.

'ఉత్తరంలో అంత వివరంగా అన్ని సంగతులూ రాసినా కూడా మీరా మనసు మారలేదన్నమాట' అతను చాలా నిరాశ చెందాడు.

తల్లి ఇచ్చిన టీ అందుకుంటూ "మావయ్య ఏడమ్మా పడుకున్నాడా?" అని

అడిగాడు శేఖరం.

"ఏం పడుకోవటమో కళ్ళు మూసుకుని అలా పడుకుంటున్నాడన్న మాటేగాని వాడికి మతిలేదు. కనిపించనన్నాళ్ళూ నలుగురుచేతా నాలుగు విధాల అన్పించుకుని మతిపోయినవాడిలా తిరిగాడు. ఇప్పుడు కనిపించేరు— ఏం లాభం?" బాధగా అందావిడ.

శేఖరం మాట్లాడలేదు. టీ కప్పులోకి చూస్తూ వుండిపోయాడు.

మళ్ళీ శాంతమ్మగారే అంది "మీరాకే ఇష్టం లేనట్టుగా అన్పిస్తోందిరా! ఆవిడ సుముఖంగానే ఉన్నట్టు కనపడింది. ఒకవేళ తన జీవితం అలా అయిందని సిగ్గుపడి రావటంలేదేమో అని చెప్పానుకూడా. అరుణ ఒకటీ నువ్వొకటీ కాదు మీరా. నిన్ను నా గుండెల్లో దాచుకుంటాను. అక్కడికి వెళ్ళడానికి నీకు ఇష్టంలేకపోతే నా దగ్గరే వుంచుకుంటాను. అబ్బాయికూడా కాదనడు అని చెప్పేను. ఏం మాట్లాడలేదు.మౌనంగా ఉండిపోయింది. అంటే ఇష్టంలేనట్టేగా!"

ఆ ప్రక్కనే వున్న పేపరు ముఖానికి అడ్డు పెట్టుకున్నాడు. శేఖరం.

శాంతమ్మగారు అతను ఖాళీచేసిన కప్పు తీసుకుని వెళ్ళిపోయింది.

శేఖరం విసిగిపోయాడు. ఇంక మీరాకి చెప్పాల్సిందేమీలేదు. మీరాకి అంత ఇష్టం లేనప్పుడు ఎవరేం చేయగలరు? అన్ని విషయాలు ఒక్క మాటకూడా పొల్లుపోకుండా వివరంగా రాశాడు తను. అది చదివి కూడా మీరా మనసు మార్చుకోలేకపోయిందంటే రాజీకి రాలేకపోయిందంటే- మనసుకు సర్ది చెప్పుకోలేనంత అసహ్యం తనమీద పేరుకు పోయిందన్నమాట..... పోనీ తనకే శిక్ష వేయాలనుకుంటే- తను సంతోషంగా భరిస్తాడు........ తప్పు చేసినవాడు తను. తన గురించి ఆవిడ బాధ పడటం ఎందుకూ? మీరా ఇక్కడికి రాకపోవటం తనగురించి తను అడ్డు తొలగపోతే మీరాకి ఇక్కడికి రావటానికి ఏం అభ్యంతరం వుండదు. అసలు తనా సంగతి రాయనే రాశాడే! తను తప్పుకుంటేకాని రాదేమో!

క్రితం రోజుకి మీరా రాకపోయేసరికే అతనో నిర్ణయానికి వచ్చాడు. ఇప్పుడు తల్లిద్వారా మీరా అభిప్రాయం స్పష్టంగా తెలిసిపోయింది.

శేఖరం తను అనుకున్న ప్రకారం ప్రయత్నాలు చేసుకోసాగాడు.

o o o o

రెండురోజులు తర్వాత—

సాయంత్రం ఐదు గంటలు దాటుతోంది—

కాంతమ్మ లోపల ఏదో సర్దుతోంది. విజయ్ బూరా ఊదుకూ ఇల్లంతా తిరుగుతున్నాడు.

మీరా గదికిటికీ దగ్గిర నిలబడింది.

మీరాకి ఈ వారం పదిరోజుల నుంచీ మతిపోయినట్టుగా వుంది. పొత్తిగా చేతిలో పనిలేదు. ఈ గొడవలొకటి, అన్నీ ఒకేసారి ఇలా ఊకుమ్మడిగా వచ్చి పడ్డాయి ఏమిటో? ఇన్ని గొడవలూ, ఇన్ని సమస్యలూ ఎవరిళ్ళలోనయినా వుంటాయా? అన్ని వింతలూ విడ్డూరాలు ఈ యింటే వెలిశాయా, అన్పించింది మీరాకి.

చంటిపిల్ల కేరింతలకి తల తిప్పి చూసింది. పూజారింటికి కాబోలు ఎవరో వస్తున్నారు. కాస్త పరీక్షగా ఆవిడని చూశాక మీరాకి గుర్తుకొచ్చింది. విజయ్ నాలుగయిదు నెలల పిల్లాడప్పుడు ఈవిడ నెల పిల్లని ఎత్తుకొని వచ్చి నెలరోజులుంది. అప్పుడు పూజార్లావిడ రాత్రి జోలపాట పాడుతోంటే తను యాంత్రికంగా ఉయ్యాల ఊగడం గుర్తుకొచ్చింది.




# స్క్రన్చ్

## కరకర తినే చక్కని తినుబండారం

భారతదేశంలో ఈ రకం రెండు రుచుల తియ్యని తినుబండారం ఇదే మొదటిసారి—చాక్‌లెట్ మరియు మింట్ కలసినది, మృదువయినది, రుచికరమైనది, ఎక్కువ చాక్‌లెట్ క్రీమ్‌తో వున్నది—గోధుమవన్నెగల కరకరలాడే రెండు అందమైన బిస్కట్ల మధ్యవున్న పెప్పర్ మెంట్ రుచిగల చాక్‌లెట్. ఇటువంటి దానిని మీరు యింతవరకు ఎప్పుడు రుచి చూడలేదు. ఇప్పుడే ఒక్క ప్యాకెట్ బిస్కట్ తీసుకోండి. కరకర నములుతూ తినండి. స్క్రంచ్... స్క్రంచ్...స్క్రంచ్...



**స్క్రన్చ్ కరకర తినే చక్కని తినుబండారం**

ట్రూ బిస్కట్లు తయారుచేసేవారు అందచేస్తున్న సరిక్రొత్త తినుబండారం

UTM-AFL-2345

వస్తుంది. ఏకంగా కలిసి వెళదాం" అనేది. నాకు కోపం వచ్చి వెళ్ళిపోయేవాడిని. దానికి సాయం నేనోసారి రావుగారితోబాటు వాళ్ళింటికొచ్చినప్పుడు జ్యోతి బృందంలో నువ్వూ వున్నావు– నేనెంత సీరియస్‌గా చూసినా నువు చాలా నిర్లక్ష్యంగా ముఖం తిప్పుకుని అరుణకోసం ఎప్పటిలా వస్తోంటే జ్యోతికన్నా ఎక్కువ మొండితనమే నీలోవుంది అనుకున్నాను.

"కాని ఒక్కొక్కసారి కొన్ని కొన్ని చిత్రంగా జరుగుతుంటాయి. ఆ రోజు అరుణకి చీర తీసుకోవాలని బజారు తీసుకొచ్చాను. నువ్వు అప్పుడే చీరెలు తీసుకొని వస్తున్నావులావుంది. నిన్ను చూస్తే అరుణకి ఎవరూ గుర్తుండరు. నీతో మాట్లాడు తోంటే అరుణకి టైము తెలీదు. నాకు అలా నిలబడ్డానికి విసుగేసింది. ఒకటి రెండు సార్లు మీకేసి చూశాను– అప్పుడే నీకేసి చాలా పరీక్షగా చూశాను— నీ రూపానికి ముగ్ధుణ్ణయిననేను — "ఆ నిర్లక్ష్యం– పొగరే లేకపోతే!" అన్పించింది. వెంటనే నీనుండి చూపులు మరల్చుకున్నాను.

"ఆ తర్వాత నా మీద కోపం తెచ్చుకుందామన్నా వచ్చేదికాదు. ఆ మర్నాడే నువు వచ్చిపైకి వస్తోంటే నన్నుచూచి రెయిలింగ్‌ని కరుచుకున్నట్టుగా నిలబడి పోయావు భయంగా నాకేసి చూస్తూ నీ భంగిమనాకు నవ్వు తెప్పించినా పైకి కనపడ నీయకుండా కిందకి వెళ్ళిపోయాను. అలాగే అన్నయ్యగారు కొన్నరోజున–నన్ను గదిలో చూస్తూనే పారిపోయావు. అరుణ నా చేయిపట్టుకుని బలవంతంగా తీసుకొచ్చింది. నాకేసి బెరుగ్గా చూసినట్టు చూశావు. అప్పుడూ నాకు నవ్వు వచ్చింది.

"ఆ తర్వాత అంత క్రితంలా నీమాటలు వింటోంటే నాకు కోపం వచ్చేది కాదు— విసుగ్గా అనిపించేదికాదు. ఒకరోజు అరుణతో ఎవరో పళ్ళులేని ఆవిడని చీకట్లోచూసి దెయ్యం అనుకున్నానని నువ్వు అరుణతో చమత్కారంగా చెప్తోంటే ఆ పక్క గదిలోనే వున్న నేను నీ చమత్కారానికి నవ్వుకున్నాను. మళ్ళా అదే సంగతి అరుణ చెపితే "రేపు నన్నూ ఏ భూతాన్నో అనుకుంటుందేమో" అన్నాను నవ్వు దాచుకుంటూ "అలా ఎప్పటికి అనుకోదు" అంది అరుణ. ఇలాగే నా గురించి కోపంగానే–నవ్వుతూనే మా ఇద్దరిమధ్యా వాదన జరుగుతుండేది.

"నేను పరాగ్గా - నీ గురించి ఆలోచిస్తూ ఉన్నప్పుడు - నా పక్కనించే నన్ను నిర్లక్ష్యంగా చూస్తూనువ్వు వెళ్ళినట్లు భ్రమపడి నవ్వుకునేవాడిని. అలాంటి రోజుల్లో–ఓరోజున జ్యోతిని తీసుకుని వచ్చేవు ముఖ్యంగా జ్యోతి గురించి రావుగారుకారులో దిగబెడతానన్నా ఒకటి రెండు సార్లు బజార్లో కనపడి మీ ఇల్లు ఎక్కడయ్యా అంటే కూడా చెప్పకుండా దాటేశాను. నువు జ్యోతిని తీసుకు రావటంతో నీ మీద మర్చిపోయిన కోపం రెట్టింపుగా వచ్చింది. అంతక్రితమే నిన్ను ఇక్కడకిరాకుండా చేయనందుకు నన్ను నేను నిందించు కున్నాను. ఏదో మైకం నన్ను తెరలా కమ్మేసి నన్నాపని చేయనీయలేదు అనుకున్నాను. మీరంతా ఏదో ప్లానులో వున్నారనుకున్నాను. అసలు అరుణని నువ్వెలా దాపురించేవని నిందించిన రోజులున్నాయి. ఓ రోజు అరుణని వదిన ఎవరింటికో పేరంటానికి వెళ్ళమంది. ఆ రోజు నువ్వొస్తావని అరుణకి వెళ్ళటం ఇష్టంలేదు. నువ్వొస్తేవనే మాట నా చెవుల్లో అమృతం పోసినట్లయింది. "నీ క్షేమంని సగౌరవంగా ఆహ్వానిస్తాను. వెళ్ళిరా" అన్నాను దాంతో అరుణకి అనుమానమేసి వెళ్ళనంది. మొత్తానికి అరుణని బెదిరించి బ్రతిమాలి ఎలాగయితేనేం పేరంటానికి పంపేను. ఒదినావాళ్ళూ ఎక్కడికో వెళ్ళే ప్రయత్నంలో వున్నారు. నువ్వొచ్చేలోగా వాళ్ళు వెళ్ళిపోతే బాగుండు ననుకుంటూ కూర్చున్నాను. ఆరోజు నీతో ఖచ్చితంగా ఇక్కడకి రావద్దని చెప్పేయాలనుకున్నాను. కాని, నేను అను

కున్నదంతా తలక్రిందులయిపోయింది. వదినా వాళ్ళు ముస్తాబులు నచ్చక మళ్ళీ లోపలికి వచ్చేరు. వాళ్ళు తిరిగి వెళుతున్నప్పుడు నువ్వు గేటులో ఎదురుపడి వాళ్ళనడిగి అరుణ లేదని వెళ్ళిపోయావు. నేను చాలా నిరాశచెందాను. మంచి అవకాశం చేతికి చిక్కినట్టే చిక్కి చేజారి పోయినట్టుగా బాధపడ్డాను. నువ్వొస్తేవుండమని చెప్పలేదని అరుణకి నా మీద చాలా కోపం వచ్చింది.

"ఎలాగయినా నీకు బుద్ధిచెప్పాలనుకున్నాను. ఇద్దర స్నేహం విడదీయాలంటే అది నీ పైపునించే చేసుకురావాలనుకున్నాను. ఆరోజునేను తలనొప్పిగా వుండి కాస్సేపు పడుకుందామని వచ్చేను. నువ్వూ జ్యోతి అరుణా ఇల్లు ఎగరగొట్టేస్తున్నారు. ఇంట్లో ఎప్పుడూ అంత నిశ్శబ్దంగా వుండే అరుణ నిన్ను చూస్తూనే అలా పరవసించి పోవడం నేను సహించలేక పోయేవాడిని, అరుణ అసలే అమాయకురాలు ఎవరేమనుకుంటారోనని భయపడే మనిషి - ఇలాగే అరుణని మీ ముఠాలో చేర్చేస్తాననిపించింది. కోపంగా విసుగ్గా నేను వెంటనే ఇట్లొంచి వెళ్ళిపోయాను.

"మళ్ళానేను ఇంటికి వచ్చేసరికి ఇల్లు చాలా నిశ్శబ్దంగా వుంది. మీరు వెళ్ళిపోయే రనుకున్నాను. నువ్వు ఆ పక్కగదిలో వున్నట్టు మొదట నాకు తెలియదు. నేను గట్టిగా కేకవేయటంతో నువ్వు ఉన్నావని అరుణ నా నోరు మూసేసింది. మొదట తెల్లబోయినా వుంటే వున్నారనిపించింది. వెంటనే బస్సుస్టాండుకి వచ్చేను.

"నేనంత ఖచ్చితంగా నిన్ను రావద్దని చెప్పినా నువు మళ్ళావచ్చి అరుణతో సమానంగా వంట చేయటం చూసి తెల్లబోయాను. నీకు మామూలు మాటలతో బుద్ధిరాదనుకున్నాను.

"ఆరోజు - నువు నా మీద చెయి చేసుకున్నరోజు - అంతక్రితమే జ్యోతి స్నేహితులతో వచ్చి ఎక్కడికో వెళుతున్నా అరుణని తయారుగా వుండమని చెప్పమంది. ఆప్పుడు అరుణలేదు. అరుణ రాదని మీరెవరూ రానక్కరలేదని ఖచ్చితంగా చెప్పాను. "మీరా వస్తుంది-ఇప్పుడు పంపిస్తారా అంది" హేళనగా అక్కడేవున్న జ్యోతి ఫ్రెండ్సు కిసుక్కున నవ్వేరు. నాకు ఒళ్ళు మండింది. నువ్వో సీక్రెట్‌వని - వాళ్ళకేదో చెప్పే వుంటావని అనుకున్నాను. ఆ కోపం ఇంకా తగ్గకుండానే నువు వచ్చేవు - మాటా మాటా అనుకున్నాం - నా మీద చెయ్యిచేసుకున్నావు. నువు కొట్టింది నా చెంపమీదే అయినా - అది తగిలింది నాఅహంమీద. నువు మాయలాడివి. నాకెలా అయినా బుద్ధి చెప్పాలనుకున్నాను. ఆరోజు కోసం ఎదురు చూడసాగాను.

"ఆరోజు - ఇంట్లో ఎవరూ లేరు" ఇప్పుడు మీరా వస్తే ఎంత బాగుండును అనుకున్నాను. నేను ఒక్కడినే ఇంట్లో వున్నాను. మధ్యాహ్నం ఓ ఫ్రెండువస్తే ఇద్దరం కలిసి బజార్లోకి వెళ్ళాం. తర్వాతవాడు వెళ్ళిపోయాడు. నేనో షాపుదగ్గర మాట్లాడుతూ నిలబడ్డాను. ఆ షాపతను నాకుబాగా తెలుసు. యధాలాపంగా తలెత్తి చూచిననాకు ఎదర షాపులో నువు కనిపించేవు. వెదకబోయిన తీగ ఎదురయినట్టు సంబరపడ్డాను. షాపులోకి ఎవరో రావటంతో షాపతను వచ్చిన వాళ్ళకి కావల్సినవి చూపిస్తున్నాడు. ఆ షాపులో కుర్రాడిని పిలిచి చీటీ నువు గుర్తుపట్టటానికి వీలులేకుండా గబగబారాసి వాడిచేత ఎలా చెప్పాలో చెప్పిపంపేను. వాడి సంగతి నాకు బాగా తెలుసు. చూసిరమ్మంటే కాల్చివచ్చేరకం. నేకేమాత్రం అనుమానం కలక్కుండా ప్రవర్తించేడు.

"నువ్వెంత సేపటికీ రాకపోయేసరికి నువ్వు అసలు సంగతి గ్రహించేసేవని అనుకున్నాను. నాన్నకేవస్తే ఏదో పుస్తకం తీసుకుని పైన బాల్కనీలో కూర్చున్నాను-













అంత దూరంలో నువ్వొస్తూ కనిపించేవు. చటుక్కున లేచి నీకు కనపడకుండా పక్కకి తప్పుకున్నాను. ఎందుకో నా గుండెలు కొట్టుకున్నాయి - మళ్ళీ ఇలాంటి అవకాశం మళ్ళా రాదనిపించింది-

"మీరా! అప్పుడు నిన్నిలా రప్పించటంలో నాకెటువంటి దురుద్దేశంలేదు ప్రమాణం పూర్తిగా చెప్తున్నాను. అరుణ స్నేహం మానేయమని-ఇంకెప్పుడూ ఇక్కడికి రావద్దని చెప్పటానికే రప్పించాను. నా నుండి తప్పించుకు వెళ్ళాలని ప్రయత్నించి -సాధ్యంకాక నిస్సహాయంగా కూర్చున్నావు. అలా చూసేసరికి నాకు చాలా జాలేసింది. 'ఎంతయినా ఆడపిల్ల ఆడపిల్లే' అనిపించింది, నీ దగ్గరకొచ్చి "నిన్ను పిలిపించటంలో నా కెటువంటి దురుద్దేశంలేదు నువ్వెళ్ళిపో" అని నిన్ను గేటువరకూ సాగనంపాలనుకున్నాను. ఏ శని దేవత నీ నాలుకమీద నాట్యం చేస్తోందో - నన్నామాట అననీయలేదు. ఇంతా పిలిపించి ఊరికే పంపేయటమా! అనిపించింది. ఎన్నటికీ మర్చిపోని విధంగా నీకు వార్నింగివ్వాలనుకున్నాను. ఇద్దరిమధ్యా మాటా మాటా పెరిగిపోయింది - నేను పశువులా ప్రవర్తించేను-

"అరుణావాళ్ళు రాకుండానే ఇంట్లోంచి వెళ్ళిపోయాను. గుక్కతిప్పుకో లేని విధంగా వ్యధ చెందాను. మూడు రోజులు స్నేహితుడి రూములో వున్నాను- అక్కడా విసుగనిపించి ఇంటికొచ్చేను. అరుణ నుండి తప్పించుకోవడం కష్టం. ఎన్నో ప్రశ్నలడిగింది. ఓపిగ్గా అదీ ఇదీ చెప్పి తప్పించుకున్నాను. తర్వాత నువ్వురాలేదని దిగులుగా వుండేది. నా దగ్గర అస్తమానమూ అనేది నువ్వు ఎన్నాళ్ళకో రాకపోవటంతో జ్యోతి ఇంటికెళ్ళి జ్యోతిని తీసుకుని మీ ఇంటికి వస్తానంది. జ్యోతి ఇంటికెళ్ళడం నా కిష్టంలేదు. నా కోసం అరుణ స్నేహం మానుకుంటావా అనుకున్నాను. జ్యోతి ఇంటికి వెళ్ళద్దనటంతో అరుణ నామీద ఎందుకు పడింది. నువ్వెన్నాళ్ళకీ రాకపోవటంతో నువు ఇంక రావేమోనను కున్నాను. మాటల్లో సెంటరులో జరిగిన సంగతి అరుణతో అన్నాను. నేనవి చెప్పకుండా -

నా ఫ్రెండని చెప్పేను. "ఇందు కా మీరా అంటే కోపం?" అయితే అసలు సంగతంతా చెప్పింది. అప్పుడు నా మనః పరిస్థితి వర్ణించి చెప్పలేను. ఆ రోజు నువ్వు అనుకోకుండా, అక్కడున్నావని జ్యోతికీ నీకూ స్నేహమేలేదని - నీకు అరుణ ఒక్కతే స్నేహితురాలని తెలిసి - నాబాధ ఏమని చెప్పను?

"ఆడపిల్లలు ఘోషా పాటించాలని నా అభిమతంకాదు, ఎందుకో - అంత విచ్చల విడిగా తిరిగే వాళ్ళంటే — నాకెందుకో నచ్చరు. నువ్వు ఆ కోవకు చెందిన దానివే అను కున్నాను. అరుణ అలా నా గురించి చెప్పేక నువ్వొకసారి కనిపిస్తే బాగుండునను కున్నాను. బయటినించి రాగానే నువ్వొచ్చేవని అరుణ నవ్వుతూ చెప్పే మాట కోసం అరుణ గదిలోకి వెళ్ళేవాడిని. తర్వాత అరుణకి చెప్పే మాటకోసం అరుణ దిగులుగా కిటికీ దగ్గర కూర్చునుండేది. ఇంక అడిగేదేముంది? వచ్చేసేవాడిని తర్వాత అరుణకి చెప్పేను జ్యోతి ఇంటికి వెళ్ళమని నన్నూ రమ్మంది. ఇద్దరం వెళ్ళాము. సరోజినిదేవి లోపలికి వెళ్ళినప్పుడు జ్యోతిని అడిగింది అరుణ మీ ఇల్లెక్కడని మీరు హఠాత్తుగా వెళ్ళిపోయారని చాలా అసహ్యంగా మాట్లాడింది జ్యోతి. జ్యోతిలా ఖచ్చితంగా చెప్పకపోయినా సరోజినీదేవి అదో మాదిరిగానే చెప్పింది. అరుణ వాళ్ళ మాటలకి అసహ్యించుకుంది, ఇంటికొచ్చి ఏడుస్తూ కూర్చుంది. నే నేదో చెప్పబోతే నన్ను విసుక్కుంది. వారం రోజులు నాతో మాట్లాడ లేదు.

"జ్యోతి మాటలనిబట్టి రకరకాల ఊహలు వచ్చినన్ను భయపెట్టాయి-ఎందుకు అంత హఠాత్తుగా వెళ్ళిపోయారు? ఒకవేళ నాకు పెళ్ళిచేసేయాలనా? లేకపోతే-నా పశు ప్రవర్తనకి - ఏమయిన జరిగిందా? ఈ ఆలోచన వచ్చేసరికి నే నెంత నరకం అనుభవించే వాడినో ఎలా చెప్పను? ఏ వూరేనా వెళ్ళినప్పుడు ఎక్కడేనా ఏ సినిమా హాల్లోనో - ఏ పార్కులోనో - ఏ రైల్లోనో కనిపించకూడదా అని ప్రతీ జంటనీ పరికించి చూసేవాడిని. నీకు పెళ్ళి అయిపోయే వుంటుందనుకున్నాను. అందుకే ప్రతిజంటనీ చూసేవాడిని. అరుణని మీదేవూరని అడిగితే విజయవాడలో వాళ్ళ బామ్మవుందిట - అంతకన్నా వాళ్ళకెవరూ లేరని చెప్పింది. విజయవాడలో వారం పదిరోజులున్నాను. వూరంతా ఒక్కసారి కాదు-ఎన్నోసార్లు తిరిగేను. పార్కుకొచ్చి తీరిగ్గా కూర్చోవడం నాకు విసుగే అయినా అక్కడున్నన్నాళ్ళూ పార్కుకి వెళ్ళేవాడిని. ఎప్పుడన్నా రాకపోతావా అనిపించి ఎన్నాళ్ళని అక్కడ వుండను? నిరాశగా వెనుతిరిగాను.

"సరోజినీదేవి వాళ్ళు వచ్చినప్పుడు - కాఫీ ఫలహారాలయ్యేక వాళ్ళు కొంతసేపు అవీ ఇవీ మాట్లాడి పెళ్ళి మాటలు ఎత్తేరు. అప్పుడు నేను ధైర్యంచేసి" ఇద్దరు భార్యలుండడం చట్టరీత్యా నేరం కదండీ", అన్నాను వాళ్ళు నోటమాటరానివాళ్ళలా అయి పోయారు. అందరికన్నా ముందు తేరుకున్న సరోజినీదేవి "నాకు పెళ్ళయిందా?" అని ఆశ్చర్యంగా అడిగింది. "ఒక కొడుకు కూడా" అని చెప్పేను. అమ్మకి కోపం వచ్చింది. పెద్ద వాళ్ళతో వేళాకోళమేమిటని మందలించింది. నేనన్నమాట వాళ్ళంతా వేళాకోళంగా తీసుకున్నారు. వాళ్ళమాటలు నేను పట్టించుకోలేదు. నేనామాట అన్నది వాళ్ళకోసం కాదు. నా దృఢమైన అభిప్రాయం నువు గ్రహించాలని - అప్పుడేనా నామీద నీకు కలిగిన అపోహపోయి నన్ను అర్థం చేసుకుంటావని ధైర్యంగా అన్నాను. కాని, నేను ఎవరైతే వినాలని అన్నానో వాళ్ళు వినలేదు. నే నన్న ఆమాటకి నువ్వెలా ఫీలయ్యావో అనే ఆతృతతో వెంటనే లోపలికి వచ్చేను. నువు లేవు. నువ్వెళ్ళి చాలా సేపయిందని అప్పి చెప్పింది. ఎంత నిరాశ చెందాను? - నీ మీద చాలా కోపం వచ్చింది. అందుకే మర్నాడు నీతో అలా చెప్పకుండా వెళ్ళావని విసుక్కుంది-

(సశేషం)

# ఆరోగ్యం, మజా, జోరూ
# తోడు జోడుగా!

బోర్న్‌విటా తీసుకోండి మనస్సులో ఉల్లాసం మరియు ముఖములో సంతోషపు వెలుగులు నింపుకోండి మీ కుటుంబానికి రుచికరమైన బోర్న్‌విటా యివ్వండి బోర్న్‌విటాలో ప్రకృతిలోని మంచి లక్షణాలుగల కోకో, మాల్ట్ పాలు, పంచదార సమృద్ధిగా వున్నాయి. దీన్ని తయారు చేసింది, 100 సంవత్సరాలకు పైగా ఆరోగ్య పానీయాలు తయారు చేయడంలో ప్రత్యేకత గణించిన క్యాడ్‌బరీవారు




## క్యాడ్‌బరీస్
# బోర్న్‌విటా

**దీన్లోని మంచి లక్షణాలన్నీ మీకోసం**

OBM 6450 TL

# మచ్చల సూటు హీరోలు

ఇంగ్లీషుమూలం: శ్రీ 'టేయర్స్'
తెలుగు అనువాదం: 'సత్యభాను'

రాత్రంతా కాపలా కాసినా, మంచె మీదనుంచి దిగిన అర్జున్‌సింగ్‌లో ఆ అలసట లేదు. అతనితోబాటే మంచె దిగిన శ్యామ్‌లో మాత్రం అలసట విపరీతంగా ఉంది. శ్యామ్ జుట్టంతా చెదిరిపోయి, కళ్ళన్నీ ఎర్రబడి, బట్టలన్నీ నలిగిపోయి ఉన్నాయి. శ్యామ్ చేతులొక్కసారి పైకెత్తి, గట్టిగా ఆవలించేసరికి చెట్టుమీద ఉన్న పిచికలన్నీ ఒక్కసారిగా కలకలంచేస్తూ పైకి ఎగిరాయి.

అయితే అతను చూసినదృశ్యం అలసటను, పోగొట్టింది - కొండల వెనకనుంచీ నెమ్మదిగా పైకి వస్తున్న సూర్యుని కిరణాలు అడవికి ఎంత అందాన్ని సంతరిస్తున్నాయి! తమతమ కలకలారావాలతో రకరకాల పక్షులు వాతావరణాన్ని అంతా సందడితో నింపుతున్నాయి. పక్కనే ఉన్న కొండవాగు లోంచి కిందకు పడుతున్న నీటి చుక్కలపై సూర్యకిరణాలు పడి ఇంద్రధనుస్సు నిర్మాణం జరుగుతోంది. వాగుపక్కనే గడ్డి తింటున్న మచ్చలలేడి ఒకటి ఎందుకో భయపడి ఉన్నట్టుండి పరుగుతీసింది.

శ్యామ్ వాగుకేసి పరిగెత్తాడు. నీళ్ళు తాజాగాఉన్నాయి. ఆ నీళ్ళల్లో ముఖం కడుక్కొని అర్జున్‌సింగ్‌ను పిలిచాడు. నిన్న రాత్రి తమకు తప్పించుకొన్న పులిగురించే ఆలోచిస్తూ అర్జున్ నెమ్మదిగా నడిచాడు. ఆతరువాత ఇద్దరూ తమ టిఫిన్‌కిట్‌లు తెరిచారు. చల్లబడినా టిఫిన్ మాత్రం రుచికరంగానే ఉంది.

"ఆ పులి ఈ నీళ్ళల్లోనే తన దప్పిక తీర్చుకొని ఉంటుంది. మనం ఈ పక్కనే దానికాళ్ళ గుర్తులను వెతికితే .." అన్నాడు శ్యామ్.

"పులులు ఇలాటి వాగుల దగ్గరకు సాధారణంగా రావు. కనపడని ప్రదేశాల్లో ఉండే నీళ్ళ దగ్గరికే పోతాయవి!" అన్నాడు అప్పటికే నలభై కి పైగా పులుల్ని పట్టుకొన్న అర్జున్‌సింగ్. ఒక్క క్షణం తలెత్తిపైకిచూసి అన్నాడు- "అదుగో. అక్కడచూడు-ఎన్నో నీటిపిట్టలున్నాయి. బహుశా అక్కడో సరస్సు ఉందేమో! మనకు ఆ ఒడ్డున కొన్ని కాళ్ళ గుర్తులు దొరకొచ్చు!"

అర్జున్‌సింగ్ ఆ సరస్సు వైపుగా నడిచాడు. శ్యామ్‌కూడా చిన్నగా పాట పాడుకొంటూ అర్జున్ వెంట కదిలాడు. అర్జునకు అది ఇష్టంలేదు- పులిని పట్టుకొనే ధ్యాసలో ఉన్నప్పుడు నిశ్శబ్దంగా ఉండటం తప్పనిసరి. పులులవేటలో కొత్తవాడే అయినా శ్యామ్‌కు పోలీస్ ఇన్‌స్పెక్టర్ కావటంతో మంచిగురి ఉంది; అందుకే శ్యామ్ తన ఉత్సాహంలో పాడుకొంటున్నా అర్జున్ ఏమీ అనలేదు.

ఆ సరస్సు చుట్టూ దట్టమైన చెట్లతో చిన్నగా ఉంది.

త్వరత్వరగా అడుగులువేస్తూ నడుస్తున్న అర్జున్ ఉన్నాట్లుండి ఆగి అన్నాడు "ఇదుగో, ఇక్కడొకటి . .... ఇంకొకటి



ఇక్కడ - ఇది మూడో కాలిగుర్తు, మరి నాలుగోది ఏది! అంటూనే నవుస్తూ పులి మూడో కాలిగుర్తులు చూశాడు. నుదురును ఒక్కసారి కొట్టుకొని క్షణం ఆలోచించి తర్వాత అన్నాడు అర్జున్- "బహుశా ఒక కాలు దెబ్బతిని ఉంటుంది. అందుకే మనకు నాలుగోది కనబడ్డంలేదు. అయితేనేం, ఇవి ఆపులి కాలి గుర్తులే!-" మనం వెతుకుతున్న మనుషుల్నితినే పులిది!"

"అలా ఎలా చెప్పగలవు?" అని అడిగాడు శ్యామ్.

"పులులు సాధారణంగా మనుష్యుల్ని పట్టుకోవు. బాగా ముసలిది అయిపోవటం వల్లనో, లేకపోతే శరీరానికి యేదైనా దెబ్బతగిలి, సాధారణంగా తాను తినేచిన్న జంతువుల్ని వేటాడలేక పోతేనో తప్ప మనిషిని తినాలనే ధ్యాస పులికి కలగదు.

"అయితే మనపని అపుడున్నట్లేలెక్క!" అన్నాడు శ్యామ్ సంతోషంగా. "నేను ఇంకొంచెం ముందుకెళ్ళి చూస్తాను ఇంకా గుర్తులు ఉన్నాయేమో!" అంటూనే శ్యామ్ కదిలాడు.

అర్జున్‌సింగ్ కాలి కొలతలను, కాళ్ళ మధ్య దూరాన్ని కొలుస్తూండగనే శ్యామ్ గట్టిగా అరిచాడు-" ఇదుగో, ఇక్కడ నాలుగు కాళ్ళ గుర్తులూ ఉన్నాయి!"

అర్జున్ వెంటనే అటుకేసి కదిలాడు. అక్కడ నాలుగుకాళ్ళ గుర్తులూఉన్నాయి. ఇంకొంచెందూరం నడిస్తే మళ్ళీ నాలుగు కాళ్ళగుర్తులూ కనబడ్డాయి.

"శ్యామ్-అంటే ఇక్కడ రెండు పులులు ఉన్నాయన్నమాట! ఈ పాదాల కొలతలను బట్టికూడా ఆ విషయం రుజువయింది. నేను కొలత తీసుకొనేటప్పుడు చుట్టూ చూస్తుండు!" అంటూ అర్జున్ ఆ పనిలో మునిగాడు.

శ్యామ్ పక్కనేఉన్నా చిన్న బండ రాయినెక్కి సిపాయిలాగ నిలబడ్డాడు.

అయితే అలా ఎక్కువసేపు ఊరికే నిలబడటం అతనికి సరిపడని సంగతి. అందుకే తన ఫీల్డుగ్లాస్ తీసి అవతలి ఒడ్డుకేసి చూడనారంభించాడు. ఎత్తుగా పెరిగినగడ్డి గాలికి సంతోషంతో తలలూపటం అతనికి కనిపిస్తూనేఉంది. ఆ గడ్డిపైన ఎన్నో పిట్టలు తిరగటమూ కనిపిస్తోంది. అయితే ఉన్నట్టుండి అక్కడ కదలిక అంతా ఆగిపోయింది. శ్యామ్ ఆశ్చర్యపోయాడు. గడ్డి మధ్యలో నెమ్మదిగా ఏదో కదలటం అతనికి అప్పుడు కనపడింది. తర్వాత కదిలే పసుపుపచ్చని తోక కూడా కనపడింది. ఇంకా కాలం వృథా చేయకుండా, తన రైఫిల్ తీసి, కదిలే జంతువు వేగాన్ని అంచనా తీసుకొని, గురి చూచి ట్రిగ్గర్ నొక్కాడు.

తన లెక్కల్లో మునిగి ఉన్న అర్జున్ ఉలిక్కిపడ్డాడు. తుపాకీ శబ్దంతోబాటే పెద్ద అరుపుకూడా వినబడింది. గడ్డిలో ఏదో వేగంగా కదిలి పోవటంకూడా శ్యామ్ చూడగలిగాడు.

అర్జున్ వైపు పరిగెత్తుతూ అన్నాడు శ్యామ్-"అర్జున్, నేను ఆ పులిని చంపేశాను-"

పులికి దెబ్బ తగిలిందనేది ఆ అరుపుతో స్పష్టమయింది. అయినా దెబ్బ ఎలా తగిలిందోనన్న విషయంలో అర్జున్‌కు సందేహం ఉండిపోయింది. శ్యామ్‌కు ఎప్పుడూండే తొందరపాటే అది. అయినా దెబ్బతిన్న దారి కనుక్కోడానికి అతను సిద్ధపడ్డాడు. అర్జున్‌తో శ్యామ్ కూడా ఆవైపు కదిలాడు.

అవతలి ఒడ్డుకు చేరుకొన్నాక బాగా ఒత్తుగా, ఎత్తుగా పెరిగివున్నా గడ్డి వారి నడకకు అంతరాయం కలిగించింది.

"అర్జున్ ఇటుచూడు" అంటూ అరిచాడు శ్యామ్. అక్కడ గడ్డిమీద రక్తపు మరకలు కనపడ్డాయి అర్జున్‌కు. రక్తపు మరకలను అనుసరిస్తూ పోతే, అవి కాలువ దగ్గర ఆగిపోయాయి. బహుశా కాలవమీద నుంచి పులి అవతలికి దూకింది కాబోలు. అది గమనించే సరికి అంతవరకూ ఉత్సాహంతో పొంగిపోతున్న శ్యామ్ నీరు కారిపోయాడు.

అయితే అర్జున్‌కు ఇదంతా మామూలే. శ్యామ్ భుజం తడుతూ అన్నాడు-"ఇంకా మనం అక్కడ కాలాన్ని వృథాచేయటం అనవసరం. మంచెదగ్గరకు పోదాం పద!"

మంచెదగ్గర చేరుకొన్నాక వారికోసం అక్కడ కొండంత ఆశ్చర్యం ఎదురుగాఉంది. మంచెకింద నేలమీద పచ్చగడ్డిలో ఆడుకొంటూ మూడు పులిపిల్లలు కనపడ్డాయి. మంచె రాటకు కట్టేసిన మేక కూడా ఆ పులిపిల్లలతో స్నేహంగా ఆడుకొంటోంది. ఒక పులిపిల్ల మేక కిందకువెళ్ళి, పెదవులను నాక్కుంటూ ఇవతలకి వచ్చింది. సంతోషం పట్టలేక శ్యామ్ పులిపిల్లలను పట్టుకోవటానికి పరిగెట్టాడు. ఆ పులిపిల్లలు జడిసిపోయి అడవిలోకి పారిపోయాయి. శ్యామ్ వాటివెంట పడ్డాడు.

శ్యామ్ చేష్టలేవీ అర్జున్‌కు నచ్చటంలేదు. పిల్లలు ఉన్నాయి అంటే దగ్గర్లోనే తల్లి కూడా ఉంటుదన్నమాట. మంచె ఎక్కి పరిశీలనగా చుట్టూ చూస్తూ శ్యామ్‌ని కేక వేసాడు.

ఈలోగా శ్యామ్ ఎలాగైతేనేం ఒక పిల్లను పట్టుకోగలిగాడు. గుండెలమీదకు హత్తుకొంటూ పులిపిల్లను తెస్తూ, దాని మెడకింద నెమ్మదిగా నిమురుతోంటే, ఆ పులిపిల్ల సంతోషంగా ఉన్నట్లు కనిస్తోంది. తప్పిపోయిన పిల్లలకోసం శ్యామ్ వెతుకుతుంటే అర్జున్ మరోసారి శ్యామ్‌ని కేకేశాడు.

ఈలోగా, పెద్ద అరుపులు అరుస్తూ అక్కడవున్న కోతులన్నీ చెల్లా చెదరు కాసాగాయి. అంతవరకు కిచకిచలాడుతున్న పిట్టలు కూడా ఉన్నట్లుండి నోళ్ళు కట్టేశాయి, వడ్రంగిపిట్ట చెట్టు క్షేమం అడగటం మానేసింది. మేకపిల్ల ముఖంలో భయం, గాంభీర్యం చోటుచేసుకున్నాయి.




అర్జున్‌కు విషయం అర్థమయింది చేతిలో తుపాకీ సరిచేసుకొని, శ్యామ్‌ను హెచ్చరించేలోపే ఎదురుగా పులి కనపడింది! అతనికి నోట మాటరాలేదు.

పులి నెమ్మదిగా అన్ని వైపులలో పరిశీలనగా చూసింది. భయంతో గడ్డ కట్టుకుపోయిన మేకపిల్ల వైపు చూడనేలేదు. దగ్గర్లోనే పులిపిల్లలకోసం వెతుకుతోన్న శ్యామ్ కదలికనే గమనిస్తోందాపులి. శ్యామ్ వెనక్కు తిరిగి పులిని చూచి బిత్తరపోయాడు మంచెమీదనుంచి, కాలవకేసి పరిగెట్టమంటూ అర్జున్ చేస్తున్న సైగలు చూసుకొని, కర్తవ్యాన్ని గుర్తుతెచ్చుకొంటూ కాలికి బుద్ధి చెప్పాడు. మౌంట్ ఆబులో పొందిన నిర్బంధపరుగు శిక్షణ అతనికి ఇప్పుడు పనికొచ్చింది.

ఆ సమయంలో అర్జున్ తుపాకీపేల్చాడు. దెబ్బతిన్నపులి, వెనకకు తిరిగి మంచెమీదకు ఉరికింది, తుపాకీమళ్ళీ పేలటంతో. పులి నేలమీదకుకూలింది

అర్జున్ కొంతసేపటివరకు మంచెమీద కదలకుండా ఉండిపోయాడు పులి మరణానికి సంతోష సూచకంగా అప్పుడు ప్రకృతిఅంతా మౌనం పాటిస్తోందా అన్నట్లుగా ఉంది. మంచెదిగి, నెమ్మదిగా కిందపడ్డ పులిని తుపాకీతో పొడిచి చూశాడు అదికదలలేదు పులి ఎంతఉందో అని కొలత చూశాడు అర్జున్. అపుడు కనిపించింది, అతనికి — పులివెనక కాళ్ళలో బుల్లెట్ దెబ్బ ఉంది. అది ఆడ పులి అనీ అపుడే గమనించాడు అర్జున్.

అర్జున్ పులికొలత చూస్తోంటే శ్యామ్‌కేక వినిపించింది "అర్జున్, పని సరిగ్గా జరిగిందా?"

అర్జున్ "ఊ" అంటూ జవాబిచ్చాడు.

శ్యామ్ వెంటనే అటురావటానికి దారి వెతికాడు. చుట్టూఉన్న దట్టమైన పొదమధ్యలోంచి చిన్నదారి కనపడింది.



ప్రధాన మంత్రి
శ్రీమతి ఇందిరాగాంధీ



ముఖ్యమంత్రి
శ్రీ టి. అంజయ్య

# సమైక్యత, సంఘీభావం నేటి తక్షణావశ్యకతలు

మన దేశం వివిధ మతాలు, జాతులు, భాషలకు పుట్టినిల్లు. ఈ వైవిధ్యం, సొగసు మన దేశాన్ని రంగుల పుష్పగుచ్ఛంగా తీర్చిదిద్దాయి. ఈ గుచ్ఛంలోని ప్రతిపుష్పాన్ని సంరక్షించుకోవలసిన బాధ్యత మనందరిపైనా వుంది.

అశోకుడు, అక్బరు, నానక్, గాంధీ, నెహ్రూ వంటి మహా పురుషులకు జన్మనిచ్చిన మన దేశం అభివృద్ధి పథంలో పయనిస్తోంది హింసాత్మక చర్యలకు పూనుకుని జాతి ప్రగతికి మనం అవరోధం కల్పించడం తగదు

మతం, భాష, ప్రాంతీయ తత్వాల పేరుతో జరిగే హింసాత్మక సంఘటనలు మన ఆర్థిక వినాశనానికి దారితీస్తాయి

మన ఆంధ్ర ప్రదేశ్ ఆదర్శ ప్రాయమైన మత సామరస్యానికి, ఐక్యతకూ దేశమంతటా పేరు పొందింది.

❋ ప్రతి మతాన్ని, ప్రార్థనా స్థలాన్ని గౌరవిద్దాము.

❋ అన్ని పండుగలు కలిసి జరుపుకుందాం.

❋ సాంఘిక సమానత్వం, అభివృద్ధికోసం చేయి చేయి కలిపి పనిచేద్దాం.

❋ స్వాతంత్ర్యం, ప్రజా స్వామ్యం, లౌకిక విధానాల రక్షణకు ప్రతిజ్ఞ చేద్దాం.

❋ సహోదరుల్లా కలిసి మెలిసి బ్రతుకుదాం.

---

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ హైదరాబాదు.

నెం : 24

దారిలో వచ్చి మలుపు తిరగగానే - అతనివైపు వస్తూ మరోపులి! తుపాకీ సిద్ధంచేసుకోనేంత సమయంలేదు. అందుకే వెనక్కితిరిగి పరుగు లంకించాడు. దారిలో చెట్టు వేరుతగిలి బోర్లాపడిపోయాడు. ఆ పడ్డంలో దొర్లుకొంటూ, రాళ్ళదెబ్బలు తగిలి వెంటనే స్పృహ కోల్పోయాడు.

శ్యామ్ దొర్లటం చూసిన అర్జునకు మతిపోయింది. అటుకేసి త్వరగా నడుస్తూ, దగ్గర్లో ఆ పులిచూసి ఆగిపోయాడు. పులి కూడా అతన్ని గమనించి అతనికేసి ఉరికింది.

అర్జున్ తుపాకీ ట్రిగ్గర్ లాగాడు. పులి ఉరకకపోతే, ఆదెబ్బకు పులి చచ్చిపోయేదే! కానీ గురితప్పిపోవటంతో, బుల్లెట్ తగిలింది. బాధతో మూలుగుతూ అర్జున్ పైకి ఉరికింది. ఈసారి అర్జున్మీదకే పడటంతో అతనిచేతిలో రైఫిల్ ఎగిరి పడింది.

అర్జున్ లేచాడు. పులి కేవలం పాతిక గజాల దూరంలోనుంచీ అతన్నే పరిశీలిస్తోంది. కదలికలేని ఆ పులి కదలితే తన్ను పొట్టన పెట్టుకొనేలాగనే కనిపించింది అర్జున్కు. కానీ చేతిలో తుపాకీలేకపోతే ఆపులికి ఎదురు నిలవటం కష్టం. నడుంకు కత్తిఉన్న సంగతి గుర్తుంది అతనికి. కానీ దగ్గర్లోనే ఉన్న రైఫిల్ అతన్ని మరీ ఆకర్షిస్తోంది. ఏం చేయాలా అని ఆలోచించి అర్జున్ రైఫిల్ కేసి కొంచెం కదిలాడు. అప్పటివరకూ దానికోసమే కాచుకొని ఉన్నట్లు పులి ఎగిరి అతనిమీద పడింది.

పులి దెబ్బకు తాళలేకపోయాడు అర్జున్. పులిచేసినగాయం విపరీతంగా బాధపెట్టింది. అయినా కసితో నడుంకుఉన్న కత్తితీసి పులి కడుపులో గుచ్చాడు. పులి గాండ్రుమంటూ వెనక్కునడిచి, మరింత కోపంగా అర్జున్పైకి ఎగిరింది. ఈసారిదెబ్బతో అర్జున్ తల పచ్చడి అయిపోయింది.

కదలకండా పడిపోయిన అర్జున్ను ఒకసారి చూసి, పులి, అక్కడేపడిఉన్న ఆడపులికేసి నడిచింది. మేకపిల్ల అరుస్తున్నా పులి దాని సంగతే పట్టించుకోలేదు. నాలిక బయటకు చాపి, కిందపడ్డ పులిని ఆప్యాయంగా నాకింది. ఆ పులిలో చలనం లేదు. కిందపడ్డ ఆడపులికి తగిలిన గాయాల్లోంచి కారిన రక్తాన్ని నాకింది. అర్జున్ చేసిన కత్తి గాయంవల్ల పులిలో బాధ పెరిగింది. అందుకే ఆడపులిపక్కనే, నెమ్మదిగా పడుకొని, కళ్ళు మూసుకొంది.

నిమిషాలు గడుస్తున్నాయి. ఆడపులి పక్కనే పడుకొన్న పులిలో చలనం లేదు. కానీ అది తన పరిశీలనమాత్రం ఆపలేదు.

స్పృహ తప్పిపోయిన శ్యామ్కు తెలివి వచ్చి, నెమ్మదిగా ముందుకేసి నడవసాగాడు. అతని అడుగుల చప్పుడుకు పులి మరింత హుషారుగా స్థిరమయింది. ముందుకేసి వస్తున్న శ్యామ్ అక్కడ పడిఉన్న రెండు పులుల్ని చూసి ఆ రెండూ చచ్చిపోయినవే అనుకొన్నాడు.

అయితే పక్కనే రక్తం మడుగులో ఉన్న అర్జున్ను చూసేసరికి శ్యామ్ వెంటనే బిత్తరపోయాడు. "అర్జున్" అంటూ గట్టిగా కేకేశాడు. ఆకేక కొండలన్నింటా ప్రతిధ్వనించింది. జవాబు రాకపోయేసరికి అర్జున్ను అటూ ఇటూ కదిపాడు శ్యామ్. ఈసారీ అర్జున్నుంచి జవాబు రాలేదు. కానీ-భయంకరమైన గాండ్రింపు వినిపించింది. శ్యామ్ తలతిప్పేసరికి నిలువెత్తున పులి—

తరతరాలుగా మనిషి తనజాతికి చేస్తున్న అన్యాయానికి, ప్రకృతిమాత ఒడిలోంచి ఒక్కొక్కటిగా తమను పొట్టన పెట్టుకొంటున్న రాక్షసత్వానికి తగినశాస్తి చెయ్యాలనే ఆకాంక్షతో కాబోలు నిలువెత్తు పులి కోపంగా నిలిచి ఉంది.

ఇటు పులి, అటు శ్యామ్-ఒకరికెదురుగా ఒకరు-ఒకరిపై ఒకరికి తీరని కసితో అవకాశం కోసం వేచి చూస్తూన్నట్లు నిలబడి ఉన్నారు.

అయితే స్నేహితుణ్ణి పొట్టనపెట్టుకొన్న అన్న బాధతో మొట్టమొదట మనిషిలోని జంతువే ఎదుటనిలిచిన జంతువుపైకి దాడి



చేసింది. అప్పటికే కత్తిపోటుకు గురైన పులిని, తన తుపాకీ నిటారుగా ఉపయోగిస్తూ శ్యామ్ తీవ్రంగా గాయపరిచాడు. బాధతో గాండ్రిస్తూ పులి నేలమీద పడింది.

నేలమీదపడ్డ పులిని మరోసారి కొట్టాలని శ్యామ్ ప్రయత్నించాడు కానీ ఈసారి గురితప్పింది. తనలో మిగిలి ఉన్న శక్తినంతా కూడగట్టుకొంటూ పులి శ్యామ్ మీదకు ఉరికింది. తన స్వస్థలంనుంచి పారదోలుతున్న జంతువు అది-దానికి శ్యామ్ నిరాయుధుడు అవటంతో సమఉజ్జీ కాలేకపోయాడు. ఎదురుతిరిగి కలబడాలన్న శ్యామ్ ప్రయత్నాలన్నీ రెండేరెండు పంజా దెబ్బలకు పటాపంచలయిపోయాయి. శ్యామ్ నేలకూలాడు.

పులి పరిస్థితిమరీ దారుణంగా ఉంది-ఉదయమే శ్యామ్ వల్ల తగిలిన బుల్లెట్ దెబ్బ, పైన మరో బుల్లెట్ దెబ్బ, ఆ పూరున అర్జున్ చేత కత్తిపోటు, శ్యామ్ తుపాకీతో కొట్టిన దెబ్బలు - శ్యామ్ కొట్టిన దెబ్బల వల్ల పులికన్నొకటి పూర్తిగా చితికిపోయింది. అర్జున్ కత్తిపోటు గాయంలోంచి రక్తం కారుతోంది. ఆ దెబ్బల బాధను తట్టుకొంటూ, నెమ్మదిగా శ్వాస పీల్చుకొంది పులి. పక్కనేపడిఉన్న ఆడపులిని మరోసారి నాకాలని ఆపులి అనుకొంది కానీ తగిలిన దెబ్బలవల్ల కదలటం కష్టమయింది. అందుకే బాధతో గాండ్రిస్తూ ఆడపులి పక్కనే పడిపోయింది.

అడవిలో అంతవరకూ జరిగిన భీకర పోరాటం ముగిసింది. అంతవరకు ప్రాణాన్ని అరచేతిలో పెట్టుకొన్న మేక మళ్ళీ గడ్డి నవలటం ఆరంభించింది. కొమ్మమీద పిచికలు కిచకిచ ప్రారంభించాయి. చుట్టూ కుశల మసుగుతూ వడ్రంగిపిట్ట ఇప్పుడు బెరడు తలుపులు కొడుతోంది. అంతవరకూ గడ్డిలో దాక్కున్న పులిపిల్లలు రెండు నెమ్మదిగా బయటకు వచ్చి చచ్చి పడిఉన్న పులుల కళేబరాలతో ఆడుకోవటం ప్రారంభించాయి.

కానీ - పోరాటంలో గాయపడి మరణించిన జంతువుల ఆత్మ శాంతికోసమా అన్నట్లు కొండలమధ్య వీచే పడమటిగాలి ఒక్కసారి ఆగి మళ్ళీ వీచసాగింది! ●




# హాస్య స్రవంతి - పి. జి. వుడ్‌హౌస్

శ్రీమతి మృణాళిని

ప్రపంచ సాహిత్యంలో హాస్య రచనల సంఖ్య చాలా తక్కువ. దానికి కారణం- నవ్వడమెంత సులభమో, నవ్వించడం అంత కష్టం కావడమే. కాస్త ప్రయత్నిస్తే సమర్థుడైన రచయిత ఒక రచన ద్వారా కొంతమంది పాఠకులను కొన్నిసార్లు నవ్వించవచ్చునేమో గాని, రాసిన సుమారు 3 వందల రచనల్లో కల్తీలేని హాస్యాన్ని, చదివిన ప్రతిసారీ, ప్రతి పాఠకుడినీ మనసారా నవ్వించగలిగిన ఘనత ప్రపంచం మొత్తం మీద ఒకే రచయితకు దక్కుతుంది. అతనే పెల్‌హామ్ గ్రెన్‌విల్ వుడ్‌హౌస్ - స్పెల్లింగును బట్టి వోడ్‌హౌస్, సాన్నిహిత్యాన్ని బట్టి 'ప్లమ్'!

పి.జి. వుడ్‌హౌస్ 1881 లో ఇంగ్లండులో గిల్డ్‌ఫోర్డ్‌లో పుట్టాడు. కాలేజి చదువు తర్వాత రెండేళ్ళపాటు బ్యాంకులో పనిచేసిన వుడ్‌హౌస్, 'బ్యాంకింగ్ అంటే ఏమిటి? దాని పరమార్థమేమిటి? ఈ బ్యాంకులో తను చేస్తున్న పనేమిటి?' అనే ప్రశ్నలకు సమాధానాలు వెతుక్కుంటున్న కాలంలోనే ఆ ఉద్యోగానికి రాజీనామా ఇవ్వడం జరిగింది. ఆ తర్వాత పత్రికా రచయితగానూ, కథా రచయితగానూ స్థిరపడ్డాడు. క్రమంగా అమెరికాలో సాటర్‌డే ఈవెనింగ్ పోస్టుకు ధారావాహిక నవలలు రచించడం ప్రారంభించాడు. నవలలు, కథలతోపాటు నాటికలు సంగీత రూపకాల రచనలో కూడా వుడ్‌హౌస్ అందె వేసిన చేయనిపించుకున్నాడు. అతని హాస్య స్రవంతి హాలివుడ్‌కు కూడా ప్రవహించింది. కానీ కొంత అనుభవం గడించాక, అక్కడి-బురద తనను కలుషితం చేస్తుందని భావించాడేమో, ఆ వ్యాసంగాన్ని విరమించుకుని, నవలా రచనలో పూర్తిగా నిమగ్నుడయ్యాడు.

తన తొంభై మూడేళ్ళ జీవిత కాలంలో వుడ్‌హౌస్ వందపైగా కథలు, నవలలు, ఇరవై దాకా నాటికలు, ముప్పైపైగా సంగీత రూపకాలు, పాటలు రచించాడు. అతని రచనలన్నీ హాస్యప్రధానమైనవే. 193[illegible] లో అతనికి, మరొక ప్రఖ్యాత హాస్య

రచయిత మార్క్ ట్వైన్ పేరట ఏర్పడ్డ 'ఇంటర్నేషనల్ మార్క్ ట్వైన్ సొసైటీ' వారి 'మార్క్ ట్వైన్ గోల్డ్ మెడల్' లభించింది. 1939 లో ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం వుడ్‌హౌస్‌ను డి. లిట్ డిగ్రీతో సన్మానించింది. 1975 లో, అతని మరణానికి కొంత పూర్వం, బ్రిటిషు ప్రభుత్వం వుడ్‌హౌస్‌కు 'నైట్‌హుడ్' ఇచ్చిన గౌరవాన్ని నిలుపుకుంది. ఇతని రచనలు చాలా భాషల్లోకి అనువదింపబడ్డాయి.

1902 నుంచి 1975 వరకు అవిరామంగా సాగిన తన సాహిత్య జీవితంలో ఏదశలోనూ వుడ్‌హౌస్ తన స్థాయినుంచి దిగజారలేదు; ఏ ప్రభుత్వానికి లొంగి రాజీపడలేదు. అతని నవల చదివిన ప్రతి పాఠకుడూ, 'ఇలాంటి నవల రాయాలంటే, ఈ రచయిత జీవితం ఎంత సంతోషంగా గడిచివుండాలి!' అనుకుంటాడు. ఈ అభిప్రాయంలో యథార్థం లేకపోలేదు. అంత మాత్రంచేత, వుడ్‌హౌస్ జీవితంలో కష్టాలు రాలేదని కాదు. జీవితంలో ఎదురైన ప్రతి సంఘటనలోనూ నవ్వదగిన విషయం ఏదో వుంటుందని గ్రహించడంలోనే అతని హాస్యస్ఫూర్తి ఇమిడి వుంది. ఆ హాస్యస్ఫూర్తి లేకపోతే, రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో, కొన్ని సంవత్సరాల పాటు, స్వదేశానికి దూరమై, జర్మన్ ఇంటర్న్‌మెంట్ కాంప్‌లో బంధించబడికూడా, 'మనీ ఇన్ ది బ్యాంక్' వంటి కళాఖండం రచింపగలిగేవాడు కాదు!

వుడ్‌హౌస్ జీవితంలాగానే అతను సృష్టించిన హాస్యంకూడా నిర్మలమైంది. చాలామంది రచనల్లోలా అతని హాస్యం ఎదుటి మనిషిని అవమానపరిచేదీ, అసభ్యమైందీ, పాత చింతకాయ పచ్చడి వంటిదీ కాదు; అతి సున్నితమైందీ, ధ్వని ప్రధానమైందీ, సరికొత్తదీ, ఏమాత్రం వెకిలితనం లేనిదీ.

వుడ్‌హౌస్ రచన చదువుతున్న పాఠకుడు ఓచోట మందహాసం చేస్తాడు, మరోచోట మనసులో నవ్వుకుంటాడు, ఇంకోచోట చిన్నగా నవ్వుతాడు, ఆ చిరుహాసం క్రమక్రమాభివృద్ధి చెంది పకపకల్లోకి దిగుతుంది. పకపకలదశ చేరేవరకే పాఠకుడికి తన ఉనికి గుర్తుంటుంది. ఆతర్వాత అంతా హాస్యమయమే. వుడ్‌హౌస్ ప్రపంచంలో ఆనందిస్తున్న పాఠకుడిని బాహ్య ప్రపంచంలోకి తీసుకురావడం చాలా కష్టం.



కొన్ని దశాబ్దాలపాటు ఏమాత్రం ప్రమాణం తగ్గని అద్భుతమైన హాస్యాన్ని ఈ రచయిత ఎలా సృష్టించగలిగాడని ప్రశ్నించుకుంటే, అతని రచనల్లోని ఇతివృత్తాలు, పాత్రలు, సన్నివేశాలు, భాషావిశేషాలు, శైలి మన కళ్ళయెదుట నిలుస్తాయి.

ఒకేపాత్రను, లేదా స్థలాన్ని కేంద్రంగా చేసుకుని, దాని చుట్టూ కథ అల్లడం వుడ్

హౌస్ రచనా సాంప్రదాయం. దాన్ని బట్టి అతని నవలలను "బ్లాండింగ్స్ కేజిల్" నవలలు, "జీవ్స్ నవలలు", ఇతర ప్రేమ కథలు అని ప్రధానంగా మూడు రకాలుగా విభజించవచ్చు.

వుడ్ హౌస్ గ్రహించే ఇతివృత్తాలు చమత్కార భరితంగావుంటాయి. అవి సాధారణంగా ప్రేమకథలే కానీ, సాధారణ ప్రేమకథలుకావు. ప్రేమ కథలకు ఆయువు పట్టయిన అపార్ధాలు, తత్కారణంగా నాయికా నాయకులు విడిపోవడం, కలుసుకోవడం మొదలైనవి ఈనవలల్లో కూడా తరచు కనిపించినా, వాటి చిత్రీకరణలో రచయిత చూపే అసాధారణ ప్రతిభవల్ల, ప నవలకానవలే వినూత్నంగా కనిపిస్తుంది. 'సెంటిమెంటు' వాసనకూడా తగలని ప్రేమకథలు వ్రాయడం అతనికే చెల్లింది. గోరంతను కొండంతలుగా చేసుకుని పరస్పరం దూరమయ్యే ఆ ప్రేమికుల గురించి చదువుతూంటే, నవ్వాపుకోవడం అసాధ్యం. ఉదాహరణకు ఒక ప్రేయసి 'టోమాటో' ను 'టోమార్టో' అంటుంది. ఆమె ప్రియుడు అదే టొమాటోను 'టొమాయ్‌టో' అంటాడు. అంత ఇంత ఘోరమైన భేదాభిప్రాయం కలిగాక, ఇంకా ప్రేమించుకోవడం వాళ్ళ ఆత్మాభిమానానికే దెబ్బ, అలా విడిపోయి, చివరకి ఒక 'గాడ్ ఫాదర్' సాయంతో ఇద్దరూ కలుసుకుంటారు.

వుడ్ హౌస్ నవలల్లో ప్రేమికులను కలపడానికే తన మేధస్సు నుపయోగించే ఈ గాడ్ ఫాదర్ పాత్ర తప్పనిసరి. బ్లాండింగ్స్ కేజిల్ నవలల్లో గాల్ హాడ్, అప్పుడప్పుడు లార్డ్ ఇక్కన్ హామ్ జీవ్స్ నవలల్లో జీవ్స్ ఈ పాత్రను పోషిస్తారు.

వుడ్‌హౌస్ గ్రహించే ఇతివృత్తాలలో ప్రముఖంగా కనిపించే విషయాలు మూడు: నకిలీ మనుషులు (Imposters), యాదృచ్ఛికాలు (Co-incedences) బ్లాక్ మెయిలర్లు. సాధారణంగా అన్ని నవలల్లోనూ నాయకుడో, అతని స్నేహితుడో, అతని మేలుకోరే మరో పెద్ద మనిషో వేరేపేరు చెప్పుకొని, తాము వెళ్ళాలను కున్న స్థలంలో ప్రవేశిస్తారు. అంతా సవ్యంగా జరుగుతున్న సమయంలో అసలు మనిషి రావడమో, లేక అసలు వ్యక్తిని బాగా ఎరిగివున్నవాళ్ళు రావడమో జరగడం వల్ల, కథ అడ్డంతిరిగి, రకరకాల తికమకలు ప్రారంభమై, పాఠకుడిని హాస్యరసాంబుధిలో ముంచుతాయి. వుడ్ హౌస్ ఒక చోట అన్నాడు—" సాధారణంగా ఇళ్ళల్లో ఎలుకలున్నట్లు నా బ్లాండింగ్స్ కేజిల్ నవలల్లో నకిలీ మనుషులుంటారు. ఎప్పుడూ కనీసం ఒక నకిలీ మనిషైనా లేందే, బ్లాండింగ్స్ కేజిల్‌కు వ్యక్తిత్వం ఉండదు."

ఇతని నవలల్లోని యాదృచ్ఛికాలు, ఇతరుల నవలల్లోలా అసహజంగా అనిపించవు. ఫలానామనిషి ఫలానా సమయంలో ఫలానా ప్రదేశంలో ఉండడానికి ఎంతో సహేతుకమైన ఆధారాలు చూపుతాడు. 'ఫుల్ మూన్' నవల దీనికి చాలా మంచి ఉదాహరణ.

'బ్లాక్ మెయిలింగ్' వుడ్‌హౌస్ పాత్రల దినచర్యలలో ఒక భాగం. నకిలీమనుషులు చీమల్లా తిరుగుతున్న స్థలంలో బ్లాక్ మెయిలింగుకు అవకాశాలుండకపోవు. దాదాపు పాత్రలన్నింటికీ అంధాకారమైన గతం వుంటుంది. "నువ్వు నాకీపని చేసిపెట్టావా, సరి. లేకపోతే నీ అసలుపేరేమిటో చెప్పేస్తా" నంటుంది ఒక పాత్ర, ఆ రెండవపాత్ర తాత్కాలికంగా ఒప్పుకుంటుంది. ఆతర్వాత మొదటిపాత్ర గతంలోని గుప్తచరిత్రని వెతికి పట్టుకుని, "నేన్నీపనిచేయను. నువ్వు నా అసరు పేరుచెపితే, నీ రహస్యాన్ని నేను బయట పెట్టేస్తాను' అంటుంది రెండవపాత్ర. ఇలా అనంతంగా సాగుతున్న బ్లాక్ మెయిల్ - ఇద్దర్లోకీ తెలివైనవాడూ, అదృష్టవంతుడు గెలిచి, రెండవవ్యక్తి ఓడిపోవడంతో ముగుస్తుంది.

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంచిందే గట్టి పళ్ళు




ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంటే. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది, అవి ముందు నోటి దుర్వాసన అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

**కోల్గేట్ యొక్క నమ్మకమైన మూడ్రెట్ల రక్షణ ఎలా పని చేస్తుందంటే:**



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క ప్రత్యేకమైన నురుగు బాగా లోతుకు చేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉంటుందన్న నమ్మకం, దంతక్షయంనుంచి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా మింటు రుచివలన బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.**

## నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!




DC.G.74 TL

వుడ్‌హౌస్ కల్పించే కథలనిండా పై మూడింటితోపాటు ఆక్సిడెంట్లు, యుద్ధాలు దొంగతనాలు, డిటెక్టివ్‌లు, రంగస్థల ఉపన్యాసాలు, కవితాపఠనాలు, సమృద్ధిగా ఉండి, అన్ని తరగతులవారికీ విభిన్నమైన రీతుల్లో వినోదాన్ని కలిగిస్తాయి.

పాత్రలను బట్టి చూస్తే, ఇతని నవల్లో తమ స్వభావంలోని వైపరీత్యం వల్ల హాస్యాన్ని కలిగించేవి, పరిస్థితులకు బలి కావటం వల్ల హాస్యాన్ని కల్గించేవి- అవి రెండురకాల పాత్రలు కనిపిస్తాయి.

మొదటిరకం పాత్రల్లో వయస్సు రీత్యా బుద్ధి మాంద్యం రీత్యా, అగ్రేసరుడు లార్డ్ ఎమ్స్‌వర్త్. 'బ్లాండింగ్స్ కేజిల్' అనే అందమైన 'కంట్రీహౌం'లో' ఎప్పుడూ యజమాన్యం నశించని యజమాని. 'టాప్‌హాట్' 'స్టిఫ్ కాలర్' లంటే ఐడుసుకునే 'హౌస్ ఆఫ్ కామన్స్' సభ్యుడు. తన కొడుకు ఫ్రెడ్డీని చూచి 'ఇతన్నెక్కడో చూసి నట్టుందే' అనుకునే మతిమరుపు మనిషి. అతనికి జీవితంలో అన్నిటికంటే, అందరి కంటే ముఖ్యమైనది, ప్రియమైనది, పెంపుడు పంది 'ఎంప్రెస్ ఆఫ్ బ్లాండింగ్స్'. స్థానిక పంది పోటీల్లో రజత పతకాలు గెలుచుకున్న 'ఎంప్రెస్' గురగరల్లో ఎమ్స్‌వర్త్‌కు సంగీతం వినిపిస్తుంది. తన కొందరు చెళ్ళెల్లో వాళ్ళ పేర్లేమిటో వాళ్ళకు పెళ్ళయిందో లేదో అయివుంటే వాళ్ళ భర్తల పేర్లేమిటో, వాళ్ళ పేర్లేమిటో, వాళ్ళు చెపితేగాని గుర్తుకు రావు కాబట్టి వాళ్ళ విషయంలోగాని అతను జోక్యం కలిగించుకోడు. ఎవరినీ విమర్శించడు, కావాలని నొప్పించడు. కాని లంఖిణి ల్లాంటి అతని చెల్లెళ్ళు మాత్రం తమ జీవితమంతా అతన్ని నిందించడానికి మార్చటానికీ ప్రయత్నిస్తుంటారు. తను ఎవర్నీ పట్టించుకోనప్పుడు, అందరూ తననే ఎందుకు పట్టించుకుంటారన్నదే అతనికి ఎడతెగని సందేహం. అతనికెంత మామూలు విషయమైనా సరే ఐదారు సార్లు మననం చేసుకుంటేగాని అర్థంకాదు. అతనితో సంభాషణ మొదలుపెట్టిన వారికి వాళ్ళడిగిన ఏ ఒక్క ప్రశ్నకయినా సరైన జవాబు వచ్చేసరికి, ముచ్చెమటలు పోసి, గుండెదడ వచ్చేస్తుంది తమ్ముడు గల్‌హాడ్‌కి తప్ప.)

వుడ్‌హౌస్ పాత్రల్లో అతి ఆకర్షణీయమైన పాత్ర 'జీవ్స్' అతను బర్టీవూస్టర్ అనే యువకుడికి, బట్లర్‌వాలె (valf) కలగలిపిన 'జెంటిల్‌మెన్'. అఖండమైన తెలివితేటలుగల మితభాషి, ఆ తెలివితేటలు రోజూ చేపలు తినటం వల్ల వచ్చాయని వూస్టర్ అభిప్రాయం. వూస్టర్ అతని స్నేహితులు ఎదుర్కొనే విచిత్రమైన ఇబ్బందులనుంచి రక్షించడం ఒక్క జీవ్స్‌కి మాత్రమే సాధ్యమయ్యేపని. అతని మెదడు ఉపాయాల పుట్ట. జీవ్స్ నవలల్లో కనిపించే పాత్రలన్నీ 'జీవ్స్' పేరును భగవన్నామంలా స్మరిస్తుంటాయి. అతను ఎటువంటి పరిస్థితుల్లోనూ చలించడు. ఆశ్చర్యపోడు, బాధపడడు, నవ్వడు, ఏడవడు. వూస్టర్‌కు మూర్ఛ తెప్పించేవార్త జీవ్స్ మొహంలోని ఒక్క కనుబొమ్మను మాత్రం కదిలిస్తుంది. అతనిసంభాషణ సాధారణంగా 'యస్ సర్' 'నో సర్' 'వెరీగుడ్ సర్' 'ఇండీడ్‌సర్' లకు పరిమితమై వుంటుంది. ఎప్పుడయినా ఒక వాక్యాన్ని మించి మాట్లాడితే చాలు —షేక్‌స్పియర్ను గుర్తుకు తెచ్చే గ్రంథం వెలువడుతుంది. అప్పుడతడు జీవ్స్ ఒక పేరాగ్రాఫ్ మాట్లాడితో అతన్ని 'ఇందాక చెప్పింది ఈసారి ఇంగ్లీషులో చెప్పు' అని అడిగిన సందర్భాలు కూడా ఉన్నాయి.

ఇంకా తమ స్వభావం, ప్రవర్తనల ద్వారా మధురమైన హాస్యాన్నందించే ఇతర పాత్రలు, స్మిత్ (మాటి మాటికీ, నేను మితభాషిని అంటూ ఒక్కొక్కసారి రెండు మూడు పేరాలకు తక్కువ మాట్లాడని చక్కటి పాత్ర! ఎవరిదో గొడుగును తన బాబు సొమ్ములా వానలో పక్క

పడిన అందాల ఆడ కూతురికి దానం చేసేసి, ఆ గొడుగు తాలుకు ఆసామి లబో దిబో మంటుంటే ఆపదలో ఆతివకు సాయపడ్డ అతని గొడుగుద్వారా అతని పేరు ఎలా చిరస్మరణీయ మౌతుందో గడ గడ వివరించి ఆ ఆసామి తాలుకు ఆవలించిన నోరు మూతపడేలోగా జారుకునే స్మిత సంభాషణా చాతురి ఇందుగో మచ్చుతునక) గాల్ హాడ్ (ఆజన్మ బ్రహ్మచారయినా, అస్తమానం తన యౌవ్వనంలో జరిగిన ప్రేమకథలు చెవులు మూసుకున్న శ్రోతలకు వినిపిస్తూ ప్రేమికులను కలపడమే తన జీవిత ధ్యేయంగా భావించే విశిష్ట వ్యక్తి) డ్యూక్ ఆఫ్ డన్‌స్టైబుల్ (ప్రపంచంలోని ప్రతి వ్యక్తీ —తను తప్ప పిచ్చివాడని భావించే తత్వవేత్త) మొదలయినవి.

తాము పరిస్థితులకుబలై పోవడంద్వారా పాఠకులను నవ్వించే పాత్రలు - లార్డ్ ఎమ్స్‌వర్త్ సెక్రటరీ రూపర్ట్ బాక్స్టర్, జీవ్స్ యజమాని బర్టీవూస్టర్.

రూపర్ట్ బాక్స్టర్ వుడ్ హౌస్ రచనలో తప్పబుట్టినవాడు. మరొకరి నవలలో ధీరనాయకుడు కాదగిన సామర్థ్యం, నిజాయితీ, గాంభీర్యం ఉన్నవాడు. కానీ, వుడ్‌హౌస్ నవలలో మాత్రం హాస్యగాడిగానే మిగిలిపోయాడు. అతనిలో ఏ మాత్రం హాస్యస్ఫూర్తి లేకపోయినా, అనువుగానిచోట సామర్థ్యం చూపడంవల్ల, పుణ్యానికి పోయినప్పుడల్లా పాపం ఎదురుకావడంవల్ల, అతని పాత్ర సృష్టించిన హాస్యం మరో పాత్ర సృష్టించదు. అతనిలోని 'విశిష్ట' గుణం- తరతమ భేదాల్లేకుండా కనిపించిన ప్రతి వ్యక్తినీ అనుమానించడం; అర్ధరాత్రి, అపరాత్రి అని చూడక, ఎవరిమీదో అనుమానం తీర్చుకోడానికి బయల్దేరి, మేడమెట్ల మీద కింద పడ్డమో, రాత్రంతా డాబామీద చలికి వణుకుతూ కూర్చుండి పోవడమో చేస్తూ, హాస్యాస్పదమై పోతుంటాడు.

వూస్టర్, తన జీవితం పరుల క్షేమం కోసమే అనుకునే నిస్వార్థ పరుడు. తన చేతనైనంతవరకు స్వయంగాగాని, జీవ్స్ తెలివిని కిరాయికివ్వడం ద్వారాగానీ, స్నేహితులకు సాయం చేస్తుంటాడు. ఎంత మంచివాడంటే- అతనికి తారసపడే పూబోణుల్లో సగంమంది అతను తమను ప్రేమిస్తున్నాడని అనుకున్నా, కాదని చెప్పలేడు. వాస్తవానికి ఏ అమ్మాయినీ ప్రేమించకపోయినా, అలా చెపితే ఆ అమ్మాయి బాధపడుతుందేమోనని, ఒప్పుకునేసి, కొన్నిసార్లు ఎంగేజ్‌మెంటు కూడా చేసేసుకుంటాడు. ఆ తర్వాత నానా అవస్థలూ పడి, జీవ్స్ సహాయంతో ఆ ఎంగేజ్‌మెంటు నుంచి బయటపడుతూంటాడు.

వీళ్ళే గాక, ప్రతి నవలలోని నాయికా నాయకులు అత్తయ్యలు, తండ్రులు— అన్ని రంగుల, అన్ని తరగతుల, అన్ని ఆకారాలవాళ్ళు ఏదో విధంగా ఉత్తమమైన హాస్యాన్ని అందిచేవారే. ఇతని రచనల్లోని ప్రత్యేకత— చాలా పాత్రలు (ఎమ్స్‌వర్త్, గాల్‌హాడ్, స్మిత్, ఉఖెన్ హామ్, జీవ్స్, వూస్టర్ కాన్‌స్టెన్స్ మొ॥ వారు) విభిన్నమైన కథలలో నవలల్లో మళ్ళీ మళ్ళీ దర్శనమిస్తున్నా ఎక్కడా విసుగనిపించకపోవటం. ఆ పాత్ర స్వభావాలు పాఠకుడికి ముందే తెలియజేయటంవల్ల ఆసక్తి పెరుగుతుందే తప్ప తరగదు.

వుడ్‌హౌస్ నవల్లో సన్నివేశాల సంఖ్య అధికంగావుంటుంది, సన్నివేశ నిర్మాణంలో ఇతని ప్రతిభ సాటిలేనిదని చెప్పడంలో సందేహంలేదు.

"మనీ ఇన్ ది బ్యాంక్" నవలలో లార్డ్ ఉపెన్‌హామ్ తను ఒకానొకప్పుడు అతి జాగ్రత్తగా దాచిన వజ్రాలు ఎక్కడ దాచాడో మరచిపోయి, ఎప్పుడూ దాని కోసం వెతుకుతుంటాడు. చింప్ ట్విస్ట్ అనే ఫుల్‌టైమ్ దొంగ-కమ్- పార్ట్‌టైమ్ డిటెక్టివ్ ఆ వజ్రాలకోసం ఇంట్లోకి చొరబడతాడు. అతను వస్తాడన్న విషయం ముందుగానే తెలుసుకున్న ఉపెన్‌హాం తన గదిలో కర్టెన్ వెనక నుంచుంటాడు, రాగానే పట్టుకోవటానికి. చింప్ చాలా

నేను వెతికి హఠాత్‌గా క్రావెట్ క్రింద కాళ్ళు కనిపించి, అవాక్కయిపోతాడు. ఉఫెన్‌హామ్ తెర వెనుకనుంచి వచ్చి గదమాయించబోతాడు, ఇంతలో బింప్, అలవాటు ప్రకారం తన మీసం చివర్లు తిప్పుతాడు. ఆ తర్వాత వాళ్ళిద్దరికీ ఈ విధంగా ఘర్షణ జరుగుతుంది.

"అవు" ఉఫెన్‌హామ్.

"సర్...." అర్థంకాక, బింప్.

"నీ మీసాన్ని దాని మూలాన వదిలెయ్. అవునూ.... ఆ మీసం.... చాలా రోజులుగా ఉందా? ఎప్పుడు పెరగటం ప్రారంభించింది?"

"రెండేళ్ళక్రితం"

"ఆ చివర్లు అలా నిక్కినట్లుండటానికి ఏం ఉపయోగిస్తావ్?"

"వాక్స్"

"దానిమీద వాక్స్ పెడతావా?"

"యస్ సర్. వాక్స్"

"ఎలాంటి వాక్స్"

"నిజానికి, సాధారణంగా నేను సబ్బు వాడతాను."

"ఏం సబ్బు?"

"స్నానంచేసే సబ్బు లేకపోతే షేవింగ్ క్రీమ్"

"అయితే, 'వాక్స్' అనెందుకన్నావ్?"

"అప్పుడప్పుడూ అదీ వాడతాను"

"ఎలాంటిది?"

"మామూలుదే"

"దానివల్లే అలా నిలుస్తాయా చివర్లు?"

"యస్, సర్. దానివల్లనే నిలుస్తాయి"

"వెల్.... మూర్ఖానికి ఫలితాలలాగా ఉంది. మీసం నాదే అయితే, వేళ్లతోనైనా పీకేసేవాణ్ణి" (ఇంతలో కర్తవ్యం గుర్తొచ్చి) "ఆ ఇప్పుడు నీ మురికిపట్టిన శరీరాన్ని ముక్కలు ముక్కలు చేస్తాను"

అసందర్భ ప్రలాపనల్లాంటి హాస్యం సృష్టించడంలో వుడ్‌హౌస్‌ను మించిన రచయిత లేడని చెప్పవచ్చు. ఇలాంటి సన్నివేశాలు ఇతని రచనల్లో అనేకంగా కనిపిస్తాయి.

భాషా విషయకంగా వుడ్‌హౌస్ సాధించిన హాస్యంకూడా అద్భుతమైంది. ఉదాహరణకు షేక్స్పియర్ కొటేషన్, "వెన్ వింటర్ కమ్స్, కెన్ స్ప్రింగ్ బి ఫార్ బిహైండ్?" కు వుడ్‌హౌస్ పేరడీ; "వెన్ బట్లర్ కమ్స్, కెన్ డ్రింక్స్ బి ఫార్ బిహైండ్?" అతని ఆంగ్ల భాషాపరిజ్ఞానానికి ఆంగ్ల సాహిత్య పరిచయానికి [illegible] ఆశ్చర్యపోయేవాడు. సాంప్రదాయ ప్రయోగాల్లో అతను చూపిన వైవిధ్యానికి, ప్రతిభకు ఆశ్చర్యపోతూ ఒక విమర్శకుడు, "వుడ్‌హౌస్ ఏ సందర్భంలోనూ శబ్దాల కోసం తడుముకున్నట్లు కనిపించడు. ఇంకా మేమే అతన్ని పొగిడేందుకు సరైన పదాల కోసం వెతుక్కోవాల్సి వస్తోంది" అన్నాడు.

వుడ్‌హౌస్ ఒకసారి తన పుస్తకాన్ని భార్యబిడ్డలకి అంకితమిస్తూ "ఎవరి సంతో, సహాయము లేకపోయి వుంటే ఇది సరైన టైములో రాయబడి వుండేదో వారికి" అని రాశాడు.

వుడ్‌హౌస్ హాస్యం గురించి ఎంత చెప్పినా, చివరిగా చెప్పగలిగింది ఒకటే. ఆ హాస్యం అనుభవైకవేద్యమైంది. విశేషణకు లొంగది. ఒక్కొక్కసారి విశ్లేషించినా, అనుభవించినా, దాని పస తగ్గిపోవచ్చు.

వుడ్‌హౌస్ సాహిత్యంలో సామాజిక స్పృహ లేదని ఈనాటి విమర్శకులనవచ్చు. కానీ అతని రచనవల్ల పాఠకులకు కలిగే ప్రయోజనం మాత్రం అపారమైంది. రోజులో కొంతసేపు జీవితంలోని కష్టాలను మరచి, స్వచ్ఛంగా, హాయిగా నవ్వుకోవాలంటే, వుడ్‌హౌస్ పుస్తకాన్ని మించిన మందు లేదు. ఈవ్లిన్ వా (Evelyn waugh) అన్నట్టు. "పాఠకులకు జీవించడానికి, ఆనందించడానికి వుడ్‌హౌస్ ఒక ప్రపంచాన్ని సృష్టించాడు.... ఈ సుందరమైన ప్రపంచం ఎప్పటికీ పాతబడదు." ●

ప్రకృతి రహస్యం కనుగొనబడింది!




# ఇది సహజంగా, మృదువుగా మీ ఒంటి ఛాయను పెంపొందిస్తుంది

ఫెయిర్ అండ్ లవ్‌లీలో గల ఒక ప్రత్యేకమైన పదార్థం చర్మం లోపల పనిచేస్తుంది. అదీ సహజంగా, మృదువుగా, సురక్షితంగా. అంతేకాదు. ఫెయిర్ అండ్ లవ్‌లీ మీ చర్మాన్ని బయట నుంచి కూడా సంరక్షిస్తుంది. దీనిలోని సూర్య కిరణాలను వడపోసే పదార్థాల మిశ్రమం, మీ చర్మం ఎండవల్ల నల్లబడకుండా కాపాడుతుంది. అయినప్పటికీ సూర్య కిరణాలలోని ఆరోగ్యమంతటినీ మీరు పూర్తిగా పొందగలుగుతారు. ఫెయిర్ అండ్ లవ్‌లీని రోజూ గనక వాడితే, 6 వారాలలో మీ శరీర ఛాయను ఇతరులు మెచ్చేలాగ ఎర్రబడుతుంది.







**ఫెయిర్ అండ్ లవ్‌లీ — నల్లని చర్మాన్ని ఎర్రబరచడం కోసం సునిశ్చితమైన పేరు**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-FAL CV. 18-17

# కబంధమాల

## వాసు

శ్రావణ మాసం ఆ అగ్రహారాన్ని పచ్చ తోరణంగా మార్చింది.

కురవనా మానవా అనే అనుమానా వస్థలో ఉంది వాన– దాన్ని గురించి ఎవరూ పట్టించుకోవటం లేదు. పైపెచ్చు, నువ్వు కురిసినా మాకభ్యంతరం లేదన్నట్టు ధీమాగా ఎవరి పనులు వాళ్ళు చేసుకుపోతున్నారు.

ఆ వాడలోని ప్రతి గడపా పచ్చగా వుంది. ప్రతి ఇంటా పండుగ జరుపు కుంటు నట్టు, తలుపులు పూర్తిగా తెరుచుకుని నవ్వుతూ ఆహ్వానిస్తున్నాయి.

అదే అగ్రహారంలో ఓ పెంకుటిల్లుంది. అది చాలావరకు కూలిపోయింది. మిగిలిన కొద్దిమేర 'వారంటివ్వకుండా ప్రతీకాణానయినా కూలుతాను జాగ్రత్తని' బెదిరిస్తున్నట్టుంది. ఆ ఇంటికి ద్వారముంది, దానికి తలుపులున్నాయి.- కాని తలుపులకి గొళ్ళెం అవతలగాని ఇవతలగాని లేదు దాని అవసరం లేదు కూడా!

ఆ ఇంట్లో దీక్షితులు గారు, వారి అమ్మాయి సీత ఉంటున్నారు.

దీక్షితులుగారికి రమా రమి అరవై ఏళ్ళుంటాయి. అతను గొప్ప వేద పండితుడే గాక అంతకన్నా గొప్ప నష్ట జాతకుడు కూడా. అందుకనే అతని ఇరవయ్యో ఏట చూపు పోయింది. దాని తరువాత ఓ సారి తనిక్కి విపరీతమైన జబ్బు చేసింది. అది రెండు నెలలుండి పోతూ పోతూ అతని మాటని కూడా తీసుకుపోయింది, ఇది చాలులే అనుకుని కొద్దిగా వదలి. అప్పటి నుండి దీక్షితులు గారు కొద్దిగా మాట్లాడ నారంభించారు- అదయినా అవసరమని ఆయనకనిపిస్తేనే! అదైనా కొన్నాళ్ళకి వాళ్ళావిడ ఓ బిడ్డని కని కన్నుమూసింది. నోరు మంచిది కనుక ఊరూ మంచిదైంది. అందుకే వాళ్ళింటి యజమాని అయిన షావుకారు "పంతులుగారూ మీరున్నంత కాలం ఉండండి" అని చెప్పేశాడు.

కటిక దరిద్రానికి ప్రతిరూపంగా కని పించే ఆ తండ్రీకూతుళ్ళిద్దరూ దానికి నిర్వచనంగా కూడా నిలుస్తారు. అతనికి రెండే రెండు పంచెలున్నాయి. ఒకటి బాగా నలిగిపోయి గట్టిగా ముట్టుకున్నా, తడిపినా పోగులు పోగులుగా మారేలా ఉంటుంది. సాధ్యమైన ప్రతిచోటా కొద్దో గొప్పో చిరిగి, కుట్టబోయే సూది పంచెని మరీ చింపుతుందనే అనుమానం వచ్చేలా ఉంటుంది. సీతకి రెండే రెండు లంగా లున్నాయి. ఒకటి పిక్కలకి కొద్ది పైకి, రెండోది ఎంత పైకి కట్టినా ఇంకా పొడుగ్గానే ఉన్నట్టు అనిపించేదీనూ. రెండిటిమీద అతుకుల ఎంబ్రాయిడరీలు చాలా ఉన్నాయి. వాటిని చూడగానే అట్టే విచక్షణ అక్క-



ర్లేకుండా చెప్పగలిగే విషయం, అవి ఆ అమ్మాయికి ఎవరో ఇచ్చారన్న విషయం.

ఆ వాడకట్టు దయా దాక్షిణ్యాలమీదే రెండు నెలలు గడుస్తున్నాయి. పగానికీ అపరానికీ సీత అందరిళ్ళకి వెళ్ళి వంట పనుల్లోను ఇంటి పనుల్లోను సహాయపడుతుంటుంది. అక్కడి వాళ్ళందరూ ఏదో సందర్భాన్ని పురస్కరించుకుని బస్తావో

అరచిస్తావో ధాన్యం దీక్షితులు గారికి పంపుతుంటారు.

సీత పలక పుచ్చుకోవలసిన వయసు నుంచే పచ్చడి రుబ్బటం ప్రారంభించింది...

"కాళ్ళు కడుక్కోండి నాన్నా" అంది సీత వడ్డిస్తూ.

అలవాటుకనుక దీక్షితులుగారు మెల్లిగా అటుకేసి నడిచారు.

"ఇదిగో చెంబు" అంటూ నీళ్ళు ముంచి ఇచ్చింది సీత. ఆ చిల్లు చెంబునందుకుని అక్కడి పని ముగించుకుని మెల్లిగావచ్చి పీటని కాలితో తడిమి కూర్చున్నారు. పరిషణ నైవేద్యాలయ్యాక "ఏవిటమ్మా కూరిలా వుంది" అని అడిగారు.

"మరేనాన్న! పొట్లకాయకూర. మన పెరట్లో పాదుది."

అతని భోజనం అవుతూండగా

"సీతా! సీతా!" అంటూ లోనికొచ్చింది కావుడు. కావుడూ, సీత మంచి ఫ్రెండ్స్.

"ఎప్పుడొచ్చావే?" అడిగింది సీత.

"పొద్దున్నే. కులాసావా బాబాయి గారూ?"

"ఎవరూ! కావా! ఏవమ్మాయి అల్లుడు కూడా వచ్చాడా?"

"వారు రాలేదు బాబాయ్! నేనూ మా అత్తగారూ వచ్చాం"

"ఆహా...." అంటూ లేచి చేయి కడుక్కొని తన కుక్కి మంచంలో కూరుకు పోయాడాయన.

"ఊ.. ఏమే! ఎలావుంది హైదరాబాదు?"

"ఏం హైదరాబాదో ఏవుటో! నాకైతే నచ్చలేదు. ఈ కబుర్లకేంగాని నీ పనవగానే అర్జంటుగా వచ్చెయ్"

"ఎందుకు?"

"తొక్కుడు బిళ్ళలాడ్డానికి, మొహం చూడు, మొహం! ఇదిగో ఇదే చెబుతున్నా ఎల్లుండి తొలి శ్రావణ మంగళవారం. నా తొలినోము.నువ్వందరిలా సాయంత్రానిక్కి నిలిగి వస్తేకాదు. రేపు ఉదయంనుంచి నీ అడ్రస్సు మా ఇల్లే, అర్థమయిందా!"

"సరే చూద్దాంలే" తేలిగ్గా అనేసింది సీత.

"ఓహో! ఈ పప్పులు మన దగ్గర వుడకవు, రేపు వుదయానికల్లా మా ఇంట్లో వుండకపోతే చూడు?"

సీత మాట్లాడలేదు- అసలు విననట్టే ఉంది.

"ఏయ్ ఏమైందే నీకు ఇలా తయారయ్యావ్? హైదరాబాదునుంచి రాగానే ముందుగా నేనొచ్చింది నీదగ్గరకే. ఇంకా ఎవరింటికీ వెళ్ళలేదు, తెలుసా?" కళ్ళు చెమ్మగిల్లాయి.

"నేనేవన్నానే ఇప్పుడు?"

"నువ్విదివరకటిలా లేవు. చాలా మారి పోయావే!"

హైదరాబాదు వెళ్ళాక మతికాస్త పోయినట్టుంది నీకు"

"తెలివిగా మాట్లాడా ననుకోకు! సరే పద!"

"ఎక్కడికి?"

"మా ఇంటికి."

"ఇప్పుడెందుకే?"

"మా అత్తగారు, ఆడపడుచు వచ్చారు చూద్దువుగాని"

"పెళ్ళిలో చూశానుగా!"

"అదివేరు."

"ఇప్పుడొద్దులే!"

"సీతా పెళ్ళయిందని నన్ను పరాయి దానిలా చూస్తావా?"

"అవేం మాటలే?"

"లేకపోతే ఏవిటే! రా" అంటూ చేయి పట్టి లాగింది.

"మళ్ళీ వస్తానన్నానా!" అంటూ విడి పించుకుంది సీత.

"చూడండి బాబాయ్, మా ఇంటికి రమ్మంటుంటే రావటంలేదు సీత."

"అదేవిటమ్మాయి" అన్నారు దీక్షితులు గారు మంచంలోనే.

"ఇంట్లో పనుంది నాన్నా"

"అన్ని అబద్ధాలే!"

# భిక్షాటన నిషేధం!




"పోనీ వెళ్ళకూడదమ్మా"

"ఎల్లుండి నాన్నా నోము"

"సరే అయితే ఇప్పుడు రానక్కర్లేదు కాని రేపు—రేపు సాయంత్రానికైనా రాక పోతే చూడు. బాబాయిగారూ మీసీత చాలా మారిపోయింది. నాతో ఇదివరకటిలా ఉండటంలేదు. రేపుదాన్ని మా ఇంటికి పంపే బాధ్యత మీదే! లేకపోతే...... ......" మాట పూర్తవకుండా పడ్డింది కాంతం. "వస్తా" వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది కాంతం.

"అదేవిటి సీతా అలా చేశావు? పాపం పుట్టింటికొచ్చిన ఆడపిల్లని అలా ఏడిపించొచ్చా?"

సీత కళ్ళలోంచి కూడా నీరు కారుతూనే ఉంది అది ఆయనకు కనిపించదు.

"కజ్జాలకీ మాట పట్టింపులకిది సమయం కాదు వెళ్ళి ఓదార్చిరా!"

"ఇంకా వంటిల్లు కడగలేదు నాన్నా"

"సరేలే వీలు చూసుకుని వెళ్ళు. రేపు మాత్రం తప్పకుండా వెళ్ళు. లేకపోతే బాధపడుతుంది."

సీతనుంచి జవాబు రాలేదు.

"సీతా!"

"ఊ. .."

"అసలేమైంది మీ ఇద్దరికీ దెబ్బలాడుకున్నారా?"

"లేదు"

"మరి రేపు వెళతావా?"

జవాబు లేదు.

"వెళ్ళకపోతే బావుండదు"

"నాకూ వెళ్ళాలనే వుంది నాన్నా!"

"మరింకేం?"

"కానీ వెళ్ళను."

"సీతా ఏవిటి నువ్వనేది?"

"వాళ్ళింటికి నేను వెళ్ళలేను అదేవనుకున్నాసరే!"

"చూడమ్మా తొలిసారి నోము నోచుకుంటోంది. వెళ్ళకపోతే బావుంటుందా?"

"అయినా వెళ్ళను"

"దీక్షితులుగారి మాట కాదనటం సీతకదే మొదటిసారి. అందుకే ఆయన కొద్ది షాక్ తిన్నారు.

"అమ్మాయ్! నీమనసులో ఏముందో చెప్పమ్మా?"

అప్పటివరకూ దాచుకున్న దుఃఖాన్ని ఆపుకోలేక "నాన్నా" అంటూ పెద్దగా ఏడుస్తూ లోపలికెళ్ళింది.

"సీతా! అమ్మాయ్ సీతా?" అంటూ తడబడుతూ లోపలికెళ్ళి సీతని తన చేతుల్లోకి తీసుకుని-

"ఏమిటి సీతా ఏమయ్యింది? చెప్పమ్మా"

"నాన్నా నేను పేరంటానికి వెళ్ళను"

"నీకంత కష్టంగా వుంటే వద్దు తల్లీ, వెళ్ళకు. కానీ ఎందుకో చెప్పమ్మా?"

సీత జవాబు చెపుదామనుకున్నా కడుపులోని దుఃఖం నోట్లోని మాటకన్నా ముందు ఏడుపునే పంపించింది. దానితో దీక్షితులుగారి కంగారు మరికొద్ది ఎక్కువయ్యింది. పదాలని కూడదీసుకుని కారణం చెప్పింది సీత.

ఆ జవాబు వినగానే అతనికి తల తిరిగిపోయింది, కాళ్ళ క్రింద భూమి అదిరినట్టయింది. ఏమీ అనకుండా తన మంచంలోకొచ్చి పడ్డారు.

అతనికి కళ్ళులేవు, కానీ కన్నీళ్ళున్నాయి. అందుకే అవి కసిగా కారసాగాయి.

లోపల సీత కుమిలి కుమిలి ఏడుస్తోంది

సీత అన్న మాటలు అతని నర నరాల్లో విద్యుచ్ఛక్తికన్నా వేగంగా పరుగులెత్తుతున్నాయి.

"వోణీ లేదు నాన్నా!!"

తన కూతురుకి వోణీ వేసుకునే వయసొచ్చిందని తనింతవరకూ తలచనేలేదు!!

అతని సిగ్గు, భయము, అభిమానము అన్నీ కలిగాయి. తాము దారిద్ర్యంలో ఉన్నామన్న సంగతి ఇదివరకు తెలిసినా ఎంతటి నికృష్టమైన పరిస్థితుల్లో ఉన్నారో ఇప్పుడే అర్థమయిందతనికి.

ఏ దేవుడి వద్దనయినా తనకి వరం కోరుకునే అవకాశం వస్తే, తన కూతురుకి వోణీ గురించి, ఇకముందెప్పుడూ కూడా ఏ తండ్రికీకూతుళ్ళకి ఇలాంటి దుస్సంఘటనే ఎదురవ్వరాదని కోరుకుంటూ' ననుకున్నాడు.

అతని కళ్ళు ఎర్రబడ్డాయి.

వయసొచ్చిన పిల్లకు వోణి కోరికకాదు, అత్యవసరం, అనివార్యం అయిన వస్తువు అన్న ఆలోచన ఎన్నడూ రానందుకు తనను తాను ద్వేషించుకున్నాడు.

'ఈ ఇంట్లో తిరిగే సీత అనే అమ్మాయిని నువ్వు తండ్రివిరా?' అని బాధ్యత అతప వీపున ఛెళ్ళున కొట్టినట్టయింది. ఈ విరకియం ఇన్నాళ్ళు సీత చెప్పకపోవటం నేఇది కాదు (అయినా ఆ పిల్ల అవసరాలు వాకి వరకతను ఏం తీర్చాడనీ) కానీ తనూఅను రాకపోవటమే ఘోరం—అని పదే పదే కొని చిన్న పిల్లాడిలా ఏడ్చాడోసారి. క,

ఆయన దుఃఖించడం భరించ లేన రాముడిచేత మరోసారి తిరస్కరింప బడిం జానకిని తనలో చేర్చుకున్న భూదేవిలా నిద్రాదేవత అతన్ని పూర్తిగా శాంతపరచింది.

సీత మాత్రం ఓ మూల గోడకానుకుని తండ్రిని బాధ పెట్టినందుకు తల పట్టుకూర్చుంది.

మూడయ్యేసరికి దీక్షితులు గారికి తెలివొచ్చించి.

"అమ్మాయ్" అని ఏదో అడగబోయి మరోటేదో గుర్తుకొచ్చి ముడుచుకుపోయాడతను. మెల్లిగా వీధరుగుమీదికెళ్ళి కూర్చున్నారు. తన కళ్ళు చెమ్మగా చెమ్మగా ఉన్నాయన్న సంగతి గ్రహించినా తుడుచుకోలేదు- అందు క్కారణం తుడుచుగుడ్డా, ధైర్యమూ, అవసరమూ మూడూ లేకపోవటమే!

మళ్ళీ అదే ఆలోచన-

'వోణీ'

తనమ్మాయికీ, తన ఏకైక సంతానానికీ, తల్లిలేని పిల్లకి, వయసొచ్చిన కన్నెకు— వోణీ లేదు.

అది లేనిదే ఆ అమ్మాయి బయటకి

వెళ్ళలేదు.

బయటి వాళ్ళొచ్చినా చూడ్డానికి బావుండదు.

ఇలా తన అవసరాన్ని నెమరువేసుకుంటూ, తన నిస్సహాయతకి సిగ్గుపడుతూ పరి పరి విధాల ఆలోచిస్తున్నారు-

"పంతులుగారూ!" అని మూడోసారి పిలిచాడు మునసబు.

"ఎవరు-మునసబుగారా?" కొద్ది తెప్పరిల్లి అడిగాడతను.

"ఆ....! ఏవిటి అలా ఉన్నారు?"

తనకళ్ళు సాక్ష్యమిస్తున్నా "బాగానే ఉన్నానే" అన్నారతను.

"రేపు పెద్దరాజుగారి షష్టిపూర్తి"

"సంతోషం"

"రేపతను ఎవరయినా మంచి వేదపండితుణ్ని సన్మానించా లనుకుంటున్నారు. అందరికీ మీరే మెదిలారు. అంచేతమిమ్మల్ని రేపు ఉదయం వారు సన్మానించబోతున్నారు! ఇదే ఆహ్వానంగా భావించి వారిని ఆశీర్వదించడానికి తప్పక రావాలి. ఇది చెప్పడానికిగాను నన్ను పంపారు."

దీక్షితులుగారు దుఃఖాన్ని ఆపుకోలేకపోయారు.

"అదేవిటి పంతులుగారూ!"

"నాకు సన్మానం చెయ్యకపోయినా ఫర్వాలేదు. ఓ రెండు వోణీలు- పాతవయినాసరే ఇప్పిస్తే........" దుఃఖం వాక్యాన్ని పూర్తి చెయ్యనివ్వలేదు.

"భలేవారండి-మీరే ఇలా అయితే ఎలా? మీకు పట్టుచాపు శాలువాతో బాటు నూటపదహార్లు చదివించా లనుకున్నారు రాజుగారు, ఆ డబ్బుతో కావలసినన్ని కొనుక్కోవచ్చు"

"ఎల్లుండి అమ్మాయి పేరంటానికి వెళ్ళాలి"

"ఎల్లుండికదా! నేనిప్పుడే వెళుతూ వెళుతూ షావుకారు గారికి ఓ నాలుగోణీలు పురమాయిస్తాను. రేపొచ్చేప్పుడు తెచ్చుకోవచ్చు"

"చాలా సంతోషం నాయనా" అంటూ కృతజ్ఞతతో ముకుచుకుపోయారాయన.

మంగళవారంనాడు—

"ఏమే సీతాలూ! వోణీ చక్కగావుంది. షావుకారు దగ్గరిదేనా?" అన్నారు భ్రమరాంబగారు తన కాళ్ళకి పసుపు రాస్తున్న సీత కొత్త వోణీనుద్దేశించి.

"మరేనండి—నాన్న గారు నిన్ననే తెచ్చారు"

"చాలా బావుందే-నువ్వు వేసుకున్నందుకు దాని 'ందం పెరిగింది" అని సర్టిఫికెట్ ఇచ్చారు మీనాక్షమ్మగారు.

"అప్పుడే పెళ్ళి కళొచ్చేసిందే సీతాలుకి. ఏమే మీదటికి మీ ఇంటికి వాయనానికి పిలుస్తావా?" అన్నారు సుందరమ్మగారు. హుందాగా.

నోము కాముద్దయినా హడావుడంతా సీతదే!

వచ్చిన పేరంటాళ్ళందరూ సీతని, సీత వేసుకున్న వోణీని చూడసాగారు- సీత ఇంతచక్కటి వోణి వేసుకుందేమా అని కాదు, సీతకి వోణి ఎంత చక్కగా అమిరిందీ అని.

"నాన్నా! ఫలహారానికొస్తారా!" అన్న సీత పిలుపుతో ఈ లోకానికొచ్చి తన మనో వేగానికి నవ్వుకుని లోనికెళ్ళారు.

"సుందరమ్మగారు పనసపండు పంపారు ఈ పూటకి........" అంటూ నాన్చింది సీత.

"అలాగే" అని లోనకెళ్ళి సన్మానం గురించి అంతా చెప్పారతను.

ఆ రాత్రంతా వోణి ఎలా వేసుకుంటే బావుంటుందో అని సీత ఊహిస్తోంది—

సుందరమ్మగారమ్మాయికి వోణీ వేసుకోవటం వల్ల కొత్త అందం కలిగిందన్న నిజాన్ని మరోసారి గుర్తు చేసుకుంది సీత.

ప్రపంచమంతా సస్య సంపదలతోనూ, ఖనిజలవణ, ఓషధీ, వనస్పతులతోనూ లాభింపినట్లు తలంచారు దీక్షితులుగారు.

ఇంకా తెల్లార్లేదని ఇద్దరూ విసుక్కు

## రచనలకు ఆహ్వానము

శ్రీరస్తు                                                    శుభమస్తు



పావళి ప్రత్యేక సంచికకు సుముహూర్తము నిశ్చయించితిమి గాన, రచయిత(త్రు)లెల్లరు తమ రచనలు (12 అరఠావులకు యొక ప్రక్కే) పంపి, సమ్మానందింపజేయ ప్రార్థన

శుభం భుయాత్

ఇట్లు



న్నారు చాలా సార్లు.

తెల్లవారింది రోజూలాగానే!

కానీ దీక్షితులుగారికి మాత్రం ఆ ఉదయం ఐరావతంలా తెల్లగానూ, సున్నము వి తొలి చిగురులా లేతగానూ, ఉల్లాసంగానూ, ఉత్సాహంగానూ ఉంది.

ఒక్క మాటలో చెప్పాలంటే, ఆంగ్ల సాహిత్యం లోని యుటోపియాలో ఉన్నట్లు భావించారు వారిరువురు

ఈ మార్పుకు కారణం తమ మనః ప్రవృత్తే గాని ప్రాపంచిక ధర్మాల్లోని మార్పు కాదనే విషయం దీక్షితులుగారికి తెలియకపోలేదు

దీక్షితులు గారు పూజ ముగించుకున్నారు.

"అమ్మాయ్ వాళ్ళగంగని పిలుస్తావా."

"అలాగే నాన్న" అంటూ చెంగున బయటకు పోయి తీసి గంగని వెంటబెట్టుకుని వచ్చింది.

"నాన్నా గంగ వచ్చింది"

"గంగా నన్ను పెద్దరావిగారి ఇంటికి తీసుకెళ్ళమ్మా"

"అలాగే తాతగారూ రండి" అంటూ అతని చెయ్యి పట్టుకుంది పదేళ్ళ గంగ.

"వెళ్ళొస్తానమ్మా"

"మంచిదినాన్నా" అంటూ సాగనంపింది సీత.

మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ నడవ సాగారిద్దరూ.

అతనికి పైగుడ్డ లేదు- అయినా దాన్ని

గురించి పట్టించుకున్నట్టు లేదతని యజ్ఞోపవీతం—'నిన్ను సదా సేవిస్తాను ప్రభూ' అని వినయంగా ఒప్పుకుంటున్నట్టు అతని ఒంటిని జాగ్రత్తగా అంటి పెట్టుకుని ఉంది. జుట్టు పూర్తిగా ఊడిపోయిన అతని తల సకల విద్యా పరిపక్వతను చాటుతూంది.

అతని నుదిటిమీది బొట్టు నియమాన్నీ నిష్టనీ నిర్మొహమాటంగా చెబుతు ంది, అతని నడక బ్రాహ్మణ్యాన్ని ఒలకబోస్తూ శాస్త్రీయంగా ఉంది.

అతని ఆలోచనల్లో రాజు, సన్మానం, పేరంటం, మునసబు, ఇవేవీ మెదలటంలేదు. అతని మస్తిష్కాన్నావహించిన మహత్తరమైన వస్తువు-వోణీ!

ఎలాంటి వోణీ అయితే సీతకి నప్పుతుంది, సీతకి నప్పాలి అంటే వోణీ ఎలా వుండాలి? సీత వాళ్ళమ్మనే పోలిందని అందరూ అంటుంటారు. అంటే చాలా తెల్లగా వుంటుందన్న మాట. అయితే సీతకి ముదురాకుపచ్చో, ఎర్రటి ఎరుపో, నెమలి కంఠం రంగో అయితే బాగా నప్పుతాయి అన్నమాట.

ఆ ఇద్దరూ ఇంకా నడుస్తూనే ఉన్నారు, వాళ్ళ గమ్యం అడుగడుక్కీ దగ్గరవుతోంది. ఆదుర్దాని దాచుకోలేని దీక్షితులు గారు ఆలోచనల్నాపి,

"ఏమే గంగా ఎక్కడున్నాం?" అని అడిగారు.

"మన వీధి చివర్లో ఉన్నాం తాతగారూ" అంటూ మలుపు తిరిగింది గంగ.

"చిన్నవీధి దాటామా?"

"ఏవంకొచ్చామండీ" అంది గంగ.

ఇంకెంత దీని తరవాతే రాజుల వీధి.

దీక్షితులుగారి హృదయం ఊగిపోతోంది.

ముదిరిన వయసు, ఉడిగిన ఓపిక ఒప్పుకోకపోయినా అతని మనస్సు మాత్రం కాలి అడుగుల్ని కొద్దివేగంగా కదపసాగింది. అతని ఆలోచనలు ఇంకా వేగంగా ఎక్కడెక్కడికో పోసాగాయి.

రాజులవీధి వచ్చేసిందన్న సంగతి చెప్పకపోయినా అతనికి తెలిసి పోయింది. అతని మనో వేగానికి రాజీ కుదరటంలేదు.

పెద్దరాజుగారి భవంతి గంగ చూపుకి ఆనుతోంది.

చూపు లేని దీక్షితులుగ్గార్లు అక్కడి వాతావరణాన్నూహిస్తున్నారు.

పెద్దరాజుగారి ఇల్లు కోలాహలంగానూ, హడావుడిగానూ వుంది. ఇంటినిండా జనం. ఇల్లంతా పచ్చగా ఉంది. పచ్చటి మావిడి తోరణాలు పందిరిని మరీ శోభనప్రాయంగా మార్చాయి.

గంగ లేకపోయినా నేరుగా పందిట్లోకి వెళ్ళేలా ఉన్నారు దీక్షితులుగారు.

గంగ మాత్రం అతని ఇంద్రియ వైకల్యానికి జాలిపడి తొందర పడొద్దని వారిస్తున్నట్టు అతని చెయ్యి పట్టుకుంది-అందుకే గంగ ఓ అడుగు వెనక్కుంది.

నాలుగిళ్ళు దాటితే రాజుగారి భవంతి.

వాళ్ళిద్దరూ అక్కడుండగా పందిట్లోంచి రాజుగారి జోడెడ్ల బండి ప్రభంజనంలా బయటకురికింది. బండికీ దాన్ని కట్టిన కోడెడ్లకి నిండా గంటలున్నాయి. అందుకే ఆ బండి కదిలితేచాలు, గణగణ మని గంటలు మ్రోగుతాయి.

ఆ బండి అతి వేగంగా బయట పడింది. కనుక దాని గంటల గణ గణ ధ్వని యముని మహిషపు లోహఘంటల్ని సవాలు చేస్తున్నట్టుగా మ్రోగి, జవాబు లేదహో అని వెర్రిగా అరుస్తున్నట్టుగా మారు మోగసాగాయి.

దీక్షితులు గారికి ఆ బండిలో ఎవరున్నారో తెలీదు.

గంగకి అందులో పెద్దరాజుగారు ఎందుకున్నారో తెలీదు.

బండితోలే వాడికి గుండెపోటుతో కింద పడిపోయిన పెద్ద రాజుగారిని ఆస్పత్రికి తీసుకెళుతున్నాననే తప్ప, పెద్దరాజుగారు శవం అయిపోతున్న సంగతి తెలీదు. ●

మినీ కథ

# (మా)నవతా నువ్వెక్కడ?!

ఒ. వి. లక్ష్మి

ఐరన్ అండ్ స్టీల్, రైస్‌మిల్స్ ఎట్సెట్రా ....బిజినెస్సులు శ్రీ రామిరెడ్డిగారి వ్యాపకాలు. ఆయన గురించిన వివరాలు: మగపిల్లలు = 4; వేదవతి (మిసెస్ రెడ్డి) పేచీ కొద్దీ ఓ ఆడపిల్ల, వెరసి 5 గురు సంతానం. రెడ్డిగారింట నౌకర్లు బోల్డు మంది. ఆ అంతమందికీ నడ్డి విరిగేలా వంగి (నిష్కారణంగా దణ్ణం పెట్టడం తెలుసు) పూజ్యభావంతో+భయంతోటి ఆ నమస్కారా లెట్టడం, ముఖ్యంగా రెండోభావం తోటే అనుకోండి!

నౌకర్ల లిస్ట్‌లో వున్న రాముడు-మంచి బాలుడే—కాకపోతే అతనికి మోడరన్ అశోకుడి అభిమాను డవడంచేత ఆ సెంటిమెంటుకొద్దీ చెట్లు, చేమలూ అంటే చెప్పరాని ప్రేమ. అతను నాటిన చెట్టేమోగానీ అతని భార్య కాసిన కాపు నారులోనే నశించింది-"సివ్వాసెలం ఎల్లి" హడావుడి పడ్డాడు ఓసారి. ఓ నలుసు పుట్టాడు-వాడిపేరు "సివ్వాద్రి".

నాలుగు వేళ్ళూ నోటికి చేరడానికి రాము దంపతులు కాళ్ళు, చేతులు, డొక్కలు, నడుములు వగైరా అవయవాలు విరిగేలా పని చేస్తుంటే మరోపక్క కొంపలంటుకుపోతున్నట్టు "అప్పన్న" ఎదిగిపోయి బళ్ళో జీడీలు, చేగోడీలూ కొండానికి చిల్లరగురించి గొడవ చేస్తున్నాడు-"సివ్వాద్రి అప్పన్న".

'అప్పి'గాడికి స్నేహితులంటూ ఎవరూ లేరు బళ్ళో-కారణం వాడు పనిమనిషి పైడితల్లి కొడుకు కావడమే. పైగా అతని కున్న ప్రమాదకరమైన కోరిక జీళ్ళు, పప్పుచెక్కలు-అవి కొనాలంటే 20 పైసలకు మించిన ధనం!-అదీ అప్పుడప్పుడంటే ఎలా? ఎప్పుడేనా ఓసారే దుర్లభం-అని వాడింకా అనుకోడంలా—

ప్రస్తుతం అతని ధ్యేయం-ఐస్‌క్రీములు, అద్దాల బీరువాలో లడు, స్టీలు వుంగరం, ఇత్యాదులు. "హవ్వ....సిన్నంత్రం పెద్దం త్రం లే...."—కసరడాలు అయ్యేయి.

శ్రీ రామిరెడ్డిగారి ముద్దుల మూట శశి పుట్టినరోజు సంగతి ఆకాశవాసులకీ తెలిసింది. ఔను దద్దరిల్లింది. కార్లు, పట్నం మోటార్లు, లావుపాటి మనుషులు....

---

**నయం! నయం!**

మనకన్న
గాజుముక్కా
నీటి చుక్కా
నయం
తమ గుండెల్ని చీల్చిపోయే
కాంతిని సైతం
ఆరు నొక్కా ముక్కలు
చేసి వదులుతాయి!

**లింగబాబు. జి.**

---

# లోచనం

ఎక్కడో
జీవితాన్ని పారేసుకున్నాను
అక్కడే అనుకుంటాను
చిరునవ్వుల్నీ
చిన్నచిన్న ఆనందాల్నీ
అమ్మ చనుబాల తీపినీ
ఆ ఒడిలో చల్లదనాన్నీ కూడా
పారేసుకున్నట్టున్నా
అందుకే
జీవితం
ఇరుగ్గా
ఇబ్బందిగా
ఇనపడెక్కల మధ్య
బిగుసుకుంటున్నట్టుగా
అడుగులు
బరువుగా
భారంగా
ఎక్కడైనా
మనిషి విలువలు మిగిలి
వున్నాయేమోనని
మమత నిండిన గుండెలు
కలుస్తాయేమోనని
వెతుక్కుంటూ....

భైరవయ్య

వారందరికీ ఐస్క్రీములూ, మందులు, మాకులూ, చల్లని పానీయాలూ, ("టెన్డ్" బాపతు) లస్సోరా, కొవ్వొత్తులు వూదుట ........దమన్‌లాల్ చమన్‌భాయ్ నవ్వు.... ....సొట్టబ్బాయి కెమెరా .... చమ్కీ.. చమ్కీవ....ఉడగ....ధగ ధగ ధగ ధగ్గ వెలుగు....

ఉన్నట్టుండి—

అందమైన పెద్దసైజు కేకు ప్లేటుతో సహా ప్లయింగ్ సాసరయి వరండా మెట్ల కివతల విసరబడింది....సకారణంగా నే.... (పీటర్ స్కాచ్+వజీర్ బీర్ సుసంఘటిత శక్తిచే)

సంబరంలో మూల నక్కిన 'సివ్వాద్రి అప్పి'గాడి కంటపడింది-జీవితానికో తియ్యటి మెత్తటి కోరిక పరిగెత్తించింది వాణ్ణి.

కేకుకు అంటిన పింగాణి పెంకుముక్క పరి—నోట్లో వేసుకో—భౌ...భౌ....భౌ.... సింహంలాంటి కుక్క....."కేచ్ ది రోగ్.... ఏదో పట్టుపోతున్నాడు. కాచ్ హిమ్!!" కొందరి పరుగు.

తరిమింది-తరిమింది దివినుండి గేటు వరకు....చిందింది అరికాలి రక్తం.

ఒక్క పెద్ద గెంతు—అవతలికి.

అవతల్నుంచి సర్రుమని సడన్ టర్న్...

కారు బొయ్‌మంది, అప్పిగాడు "అమ్మో" అన్నాడు—

"కిడ్నాప్ డేంజరెస్-పూర్ ఫెలో....ప్చ్ ....క్యూట్ లిటిల్ స్టుపిడ్.... అరెవెధవ డర్టీ... ఆ తోటమాలి ఇడియెట్ ఎక్కడ చచ్చాడు-ఇలా పిల్లాణ్ణి అడ్డంగా వదిలేక పోతే ...ముందు- సీ వాట్...వ్వా...ఫ్...హి ఇస్ డెడ్....!!

అనువుగానిచోట, అధికుల ముందు వెర్రి చావు....రోదన... బాండ్ మేళం - మెరుపు వెలుగు....బర్త్ డే కేక్....ఛీర్స్....

"వోలమ్మో సచ్చిపోనాడమ్మో!!.... సానేటి సేద్దునోరి బాబో"

కొత్త పుస్తకంతో కొంతసేపు



# ఆధునిక స్త్రీ

రచన :

**మల్లాది సుబ్బమ్మ**

**250 పేజీలు : వెల రు. 12-00**

**ప్రజాస్వామ్య ప్రచురణలు**

**హైదరాబాద్-500 028**

స్త్రీ స్థాయిని, హోదాను, స్థానాన్ని, ఆమె హక్కులను వివరించే 53 వ్యాసాలు ఇందులో వున్నాయి. ఇవి 1964 నుండి రచయిత్రి చేసిన రేడియో ప్రసంగపాఠాలు, పత్రికలు ప్రకటించిన వ్యాసాలు. దానికి ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు ముందుమాట వ్రాస్తూ 'ఈ పుస్తకం చదివితే స్త్రీ పాత్ర స్పష్టమవుతుంది. ఆ సమస్య అనుపానాలు తెలుస్తాయి. స్త్రీకి సముచితమైన స్థానం రావాలంటే ఇంకా ఎంత ప్రయత్నం జరగాలో విశదమవుతుంది' అన్నారు రచయిత్రిని ఆధునిక స్త్రీగా అభివర్ణించారు.

ప్రముఖ రచయితా, మేధావి శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు శుభాకాంక్షలు తెలుపుతూ "రచయిత్రిలాంటి మహిళా మణులు ఒక లక్షమంది ఉంటే దేశ స్వరూపమే మారిపోతుం"దన్నారు.

ఈ సంకలనంలోని వ్యాసాలు స్త్రీ స్వేచ్ఛకు సంబంధించిన వివిధ విషయాలపై ఉన్నవి వాటిని మూడు భాగాలుగా విభజించారు.

"మనం దేనికి బానిసలం" అనే శీర్షికతో వున్న మొదటి భాగంలో స్త్రీల సాంఘిక సమస్యలు చర్చకు వచ్చాయి. స్త్రీలకు ప్రత్యేక సమస్య లున్నవా? వివాహం, వరకట్నం, విడాకులు, దాంపత్య జీవితం, విద్య, ఉద్యోగం ఇందులో ఏది ముఖ్యం లాంటి 22 వ్యాసాలున్నాయి. రెండవ భాగంపేరు 'తల్లే పిల్లను చంపితే'; నోబుల్ బహుమాన గ్రహీత మదర్ థెరిసా రోమన్ కాథలిక్. ఆమె గర్భస్రావాన్ని వ్యతిరేకిస్తారు. ఒప్పుమతి పొందిన తొలి రోజుల్లో ఆమె గర్భస్రావాన్ని నిరసిస్తూ చేసిన ప్రసంగం పత్రికలలో ప్రచారం పొందింది కుటుంబ నియంత్రణోద్యమంలో గౌరవ ప్రచారకురాలుగా కృషి చేసిన మల్లాది సుబ్బమ్మగారికి ఇది కోపకారణమయినట్లు కన్పడుతుంది. గర్భస్రావం చేయించుకునే స్త్రీ తల్లిగా తన బాధ్యతను విస్మరించి పిల్లని చంపినట్లు అవుతుందని థెరిస్సా ఆరోపణ. దానిని దుయ్యబట్టారు రచయిత్రి. అందుకే కాబోలు 'తల్లే పిల్లను చంపితే' అనే థెరిస్సా నినాదాన్ని శీర్షికగా పెట్టుకున్నారు కుటుంబ నియంత్రణ ఆవశ్యకత, అపోహలు, ప్రజాస్వామ్యం, కులతత్వ నిరసన, సంస్కరణోద్యమ ఆవశ్యకత వగైరా విషయాలు ఇందులో ప్రధానమైనవి. ముగ్గురు సోదరు లుంటే ఒకరు అవివాహితులుగా వుంటే జనాభా సమస్య పరిష్కారమవుతుందనే వినోబాజీ వింత పరిష్కార మార్గాన్ని రచయిత్రి త్రోసిపుచ్చారు. ఏది అశ్లీలం? రచయిత్రుల బాధ్యత, ఆధునికత రచనలలో అడుగంటి పోతున్నదా? అనే వ్యాసాలు రచయిత్రు

# అక్కరకు రాని ఆస్తి

చాలామంది తమ ఆస్తిని కన్నులారా చూచి తృప్తి చెందుతుంటారుగాని, వాటిని అనుభవించరు. 'పామ్ బీచ్' అనే పట్టణములో ఒక విధవరాలు మరణించింది. ఆమె బ్రతికినంతకాలమూ, ఇతరులు దయతో అందించిన ఆహారము భుజిస్తూ, మతాధికారులు జాలితో ఇచ్చిన దుస్తులు తొడుగుకుంటూ, పందులు నివసింపదగిన పాకలో నివసిస్తూ, తన జీవితాంతం వరకూ, కాలక్షేపం చేసింది. ఆమె మరణించిన పిమ్మట ఆమెకున్న ఆస్తి వివరాలను ఆరాతీస్తే అది ఎనిమిది లక్షల డాలర్లు. అనగా ఇంచు మించు 64 లక్షల రూపాయలు. ఆమెకు బిడ్డలు పాపలు లేరు బంధు బాంధవులూ లేరు. కన్నులారా చూచుకొనేందుకు మినహా ఆమె ఆస్తివలన ఆమెకొచ్చిన లాభం శూన్యం.

నలభై ఏళ్ళ వృద్ధు డొకడున్నాడు. 50,000 రూపాయలు బ్యాంకులో దాచుకొన్నాడు. దానిమీద వచ్చేవడ్డీ తప్ప అసలు ధనాన్ని తాకడు. తనకు ఇబ్బందులు కలిగినా, వ్యాధులొచ్చినా. సరియైన భోజన సదుపాయములు లేకున్నా, ఆ మూల ధనాన్ని వెచ్చించకుండ దానిని అలాగే విడిచి మరణించాడు. అతని మరణాంతరం, ఆయనకు దగ్గరబంధులమని చెప్పుకుంటూ వచ్చిన ముప్పయి రెండుమంది వ్యక్తులకూ, వారిపక్షాన వాదించిన న్యాయవాదులకు ఆ ధనం వెళ్ళిపోయింది. తన స్వంత అవసరాలకు గాని, పరుల అవసరాలకుగాని ఉపయోగపడని ధనమువలన ఎవ్వరికి లాభం? కుయుక్తితో దానిని స్వాధీనపరచుకొన్న వారికే అది లాభం.

ధనము ఎవ్వరికి శాశ్వతంగాదు. అయితే అది కలిగియున్నప్పుడు, తన నిత్యావసరములను తీర్చుకొంటూ, తనశక్తికొలది ఇతరులకూ తోడ్పడినయెడల ఎంతమేలు! తాను ధనవంతుడై యుండియు, మనము తన దారిద్ర్యము వలన ధనవంతులు కావలెనని మన నిమిత్తము దరిద్రుడయిన యేసు క్రీస్తు గూర్చి తెలుసుకొన్నారా?

లకు కొన్ని సవాళ్ళను అందజేస్తున్నాయి.

'విముక్తి ఉద్యమాలు - మహనీయులు' అనే పేరుగల మూడవ భాగం విశిష్టమైనది. ఇందులో మహిళోద్యమం, బౌద్ధమత ప్రాశస్త్యం, మానవ హక్కులు, మహిళల డిమాండు అనే వ్యాసాలేకాక రాజా రామ మోహన రాయ్, కందుకూరి దంపతులు, ఎం. ఎన్. రాయ్, గురజాడ, సరోజిని నాయుడు, ఎలెన్ రాయ్, గాంధీజీ మొ॥ వారు మహిళోద్యమానికి, సమాజానికి చేసిన మేలును వ్యక్తీకరించారు.

ఇవన్నీ ఒక ఎత్తు, రచయిత్రి వ్రాసుకున్న 'నేను' వేరు. నల్గురు పిల్లల తల్లి అయిన తరువాత పాతిక సంవత్సరాల తదుపరి తన 6వ తరగతి స్థాయి పాత చదువుతో ప్రారంభించి బి. ఏ. వరకూ చదివి కుటుంబ నియంత్రణలో ప్రత్యేక శిక్షణ పొంది విజ్ఞత సంపాదించుకున్న సంఘ సేవకురాలు సుబ్బమ్మగారు. ఆమె గాథ అందరికీ గుణపాఠాల్నిస్తుంది.

'స్త్రీ పరాజయ గాథ' అని వీణా శత్రుఘ్న, 'భావ సంచలనం కావాలి' అని పి. సత్యనారాయణ మహిళాభ్యుదయాన్ని కాంక్షించి కృషి చేసినవారిని గురించి పదే పదే చెప్పాలి' అనీ డా॥ సూర్యకుమారి అభిప్రాయాలను ప్రకటించారు. ఒహుశః ఇవి వివిధ భాగాల ఉపోద్ఘాతాలు కావచ్చు.

ఒకేసారి వ్రాసిన గ్రంథం కాదుగనుక ఒకే అభిప్రాయం పలుమార్లు చెప్పినట్లు ద్యోతకమవుతుంది చివరికి. కాని 16 సంవత్సరాల వ్యవధిలో అపుడు చేసిన ప్రసంగాలు, వ్రాసిన వ్యాసాలు కనుక ఆ ఇబ్బంది దిని తప్పించుకోలేరేమో చదువరులు.

సంప్రదాయాన్ని విడిచి ఆధునికతను అవగాహన చేసుకుని అలవరచుకొనేవారు విధిగా చదవాలి ఈ గ్రంథాన్ని. కాగా సంప్రదాయవాదులు యథాతథస్థితివాదుల వారికి కొన్ని. ప్రశ్నలున్నాయి ఈ గ్రంథంలో. కనుక ప్రతివారూ చదవదగ్గ పుస్తకం.

**-మండలేముల రామారావు**



# కళాసౌరభం

## చలం ప్రత్యేక సంచిక

సాహితీ వివాద మార్గంలో, ప్రయాణంలో చలం ఓ మలుపు, ఆ (అ) చలం మీద ప్రత్యేక సంచిక నీసుకురావడం ఎంత ఆనందించ తగినదో, అంత కష్టమయిన విషయం - అని కొందరికి తెలిసినా గర్వించ తగ్గ విషయం.

తెలుగు సాహితీ దేశంలో కొంత భాగం చెలాన్ని "పో.... అది, పోతాడేమోనన్న భయంతో" అలాటి "గుటిసాటి వెంకట చలేయుగు గుండెబాదుకు" చెప్పినా— విమర్శక లోకం చెలాన్ని ప్రిజమ్ గుసి వివిధ కోణాలని వివిధ రంగుల్లో చూసి పూరుకోమా లేదు—ఛ్రమించారు (కొందరు)

చెలంబాధ విమర్శకులకి 'బాధ', విమర్శకుల బాధంతా చెలం 'బాధే'. విమర్శకులంటే ఇంట్ర ప్రెటర్స్ కూడా!

శ్రీ కె. వి రమణారెడ్డి, నిఖిలేశ్వర్, రంగనాయకమ్మ, త్రిపురనేని మధుసూదన రావు మొ॥ పుష్పాల "సౌరభం", ఇది చెలం గురించి అల్లిన మాల.

విడి ప్రతి రూపాయి పెడితే వస్తుందీ 'సాహితీ సౌరభం'. అందుబాట్లో దొరక్కపోతే "కళాసౌరభం", తారానగర్, (బి.హెచ్.ఇ.ఎల్ దగ్గర) హైద్రాబాద్-33 కి రాస్తే చాలు.





# మౌనమయ ప్ర
# దేవుడు

ఎ. శ్యామలా రాణి

అగవిడుతున్న పూల గుబాళింపు, అలలు

అలలుగా తేలి వచ్చే చిరుగాలి, సింధూరపు రాసులు నిండిన అందమైన ఆకాశం వింత సాయంకాలపుశోభ- ఒక్కర్తెనూ పంచేసుకోను?

ఇంటిపనులయ్యాయి. పని మనిషి వెళ్ళిపోయింది. తోటపనయింది. మాలి వెళ్ళిపోయాడు. పింకీ ఆటకి వెళ్ళిపోయింది.

నేనెంత వంటరిదాన్ని!

ఐదు.... ఐదున్నర.... ఆరు!

ఊ హు....ఈ మనిషి జాడేలేదు.

మనిషేమిటి-తప్పు తప్పు....దేవుడు!

తన పెళ్ళిలో అంతా అలాగేకదా అన్నారు.

దేవుడు నిజంగా ఇలాగే వుంటే వాడికొకటికాదు కోటి దండాలు....దేవుడు!

మళ్ళీ మొదలై పోతుంది నా దినచర్య.

దూరం దూరంగా అక్కడక్కడా విసిరేసినట్టున్న బంగళాలు- దగ్గరలో మనిషి సంచారం లేదు. మనసు రంగం మీదికొస్తోంది పొందికగా....మడచి పెట్టిన పట్టు బట్టలా-

రు గాలులు రేగుతున్నాయి.

పట్టు బట్ట పొరలొక్కొక్కటే విడుతున్నాయి.

వాతావరణం గమ్మత్తుగా వుంది.

చలివేస్తున్నట్టుంది. కప్పుకుండే ఉన్ని బట్ట తీస్తే చలి-ఇది బయట వాతావరణం, దీనికి మార్పొస్తుంది. కాని లోపలి వాతావరణమో! ఎప్పుడూ ఇలాగే వుంటుంది

టార్చర్! నిజంగా ఎంత టార్చర్?

నేనే గయ్యాళిగా మారి మనసులోనిదంతా వెళ్ళగక్కేసినా బాగుండేది- లేదా ఇంత తింటూవుంటూ మనసులో ప్రమేయం లేకుండా రఫ్‌గా బతికేసినా బాగుండేది. రెండూ కాలేక ఎందుకింత సెన్సిటివ్‌గా తయారయ్యాను?

పట్టుబట్ట పొరలెగురుతున్నాయి.

ఆ పొరలమధ్య ధూళి రేగి రేగి దుమారంగా మారుతుందేమోనని భయం.

మాగజైను అందుకున్నాను.

"సుఖ జీవనానికి చిట్కాలు!" నవ్వొచ్చింది చదివి. ఈ ఆర్టికల్ రాసిన శాస్త్రికి జాలిగా దొల్లిపోతున్నాయన్న మాట

రోజులు. అలాంటి వాళ్ళే ఇలా రాయగలరు.

ఏ చిట్కాలూ ఆ మనిషిమీద మాత్రం పనిచేయవు.

గ్రహింగా ఏం మనిషి!

ఎప్పుడూ ఆ బట్టలు నలిగినట్టే ఉంటాయి. జుట్టు రేగే వుంటుంది- జోళ్ళకు పాలిష్ అంటే ఏమిటో తెలియదు- కళ్ళద్దాల్లోంచి ఏదో వేదాంతిలా చూపులు - పుస్తకాలు తప్ప మరో ప్రపంచం తెలియని మనిషి- మళ్ళీ తప్పు—పతిదేవుడు!

ఆ రూపాన్ని కాసేపు మరచిపోవాలనుంది.

అబ్బ! ఎవరింట్లోంచో సంగీత సాధన- ఎంత కర్ణ కఠోరంగా ఉంది! శృతిలేని వీణనెలా మీటాలనిపిస్తుందో!..ఎలా గేమిటి? శృతిలేకుండా బ్రతుకులనే ఈడ్చేస్తున్న తనలాంటివాళ్ళుంటుంటే వీణకేం?

మనసు పొరలు రెప రెప లాడుతున్నాయి.

ఎగరనీ దుమారం రేగనీ!....కసిగావుంది.

అంతే! మొదలయింది.

"వసంతీ!"

దూరాన సన్నని పిలుపు. ఏనాటి పదిహేనేళ్ళ క్రిందటి పిలుపో!

ఆ పిలుపు ఎటో లాక్కుపోయింది.

○ ○ ○

ఏవేళప్పుడు చూసినా మడత నలగని కొబ్బరికాయ ముక్కలాంటి బట్టల్లో అంతకన్నా చెక్కు చెదరని చిరునవ్వుతో పురంధర కృష్ణ! పేరులోనేకాదు ప్రత్యేకత- ఆ వ్యక్తే వేరు.

అతను నేను ఎమ్. ఎ. చదివిన రోజుల్లో కలిసిన వ్యక్తి, నా సహాధ్యాయని శ్యామల పెత్తండ్రి కొడుకు.

కాలేజి యానివర్సిరీకి నేను పాడేను. నా ఎదురుగా ముందువరసలో కూచున్నవాడు ప్రోగ్రాం అవుతూనే క్రొత్త బెరుకు లేకుండా వచ్చి అభినందించాడు. నేను అన్నిటికీ చాలా బిడియపడేదాన్ని మొగమాటంగానే థాంక్స్ చెప్పాను.

నేను పుట్టిపెరిగినది అటు పల్లె అనికాని ఇటు పట్నమనికాని చెప్పలేని ఊరు-ప్రయివేటుగా బి. ఏ చేశాను.

జ్యోతిషం వెర్రివున్న నాన్న ఆ రోజుల్లో పెళ్ళిచేస్తే మంచిది కాదంటే ఇంట్లో గోళ్ళు గిల్లుకుంటూ కూచోలేక చదువుతానన్నాను. విశాఖపట్నంలో ఉన్న



చిన్నత్త దగ్గరుంచుకుని చదివిస్తాను రమ్మంది. నాకూ కాలేజిలో చేరాలని ఉబలాటం. నాన్న నన్ను కాదన్నా చిన్న అత్తని కాదనలేక పంపారు ఆవిడకు పిల్లల్లేరు. నేనంటే అపేక్ష—నా చదువు మొదలయింది.

"అతనే మా కజిన్, నిన్ను చాలా లైక్ చేస్తాడు" అందోరోజు శ్యామల.

మా ఇంట్లో ఆడపిల్లలు అలా అబ్బాయిల గురించి స్వేచ్ఛగా ఆలోచించి అభిప్రాయాలు వెల్లడి చేసే అలవాటులేదు. అదో తప్పుగా భావించే ఫామిలీ మాది. అందుకే నేనేమీ అనలేదు. అట్టే ఆలోచించనూ లేదు.

నేనెక్కడికి వెళ్ళినా అతను కావాలనే ఎదురొచ్చేవాడు. హుషారుగా పలకరిస్తూ,

"హాల్లో వసంతీ! బాగున్నారా?" అంటూ.

ఎవరు కనిపెడుతున్నారో, మర్యాదస్తుల కుటుంబంలోంచి వచ్చిన నేను ఎక్కడ అల్లరిపాలయి, పెద్ద పేరొచ్చేస్తుందేమోనని హడిలిపోయే దాన్ని. అతని నిర్భీతికి కొంచెం కోపం వచ్చేది. కాని, అతన్నింకే కారణంగానూ నేను అసహ్యించుకోలేక పోవడం చేత ముక్తసరిగా మాట్లాడి తప్పించు కునేదాన్ని.

పరీక్ష లవుతున్నాయి.

"పురందర నిన్నడగ మన్నాడు." శ్యామల నవ్వుతూ అందొకనాడు.

"ఏమిటి?" అన్నాన్నేను వెర్రి ముఖం వేసి.

"నువ్వు చాలా నచ్చేవట, నీలా అందంగా, సన్నగా, తెల్లగా అంతకంటే చల్లని కంఠంతో"... ఏమేమిటో చెప్పింది. నాకు ఒళ్ళు చెమటలు పట్టేసింది.

చిన్నత్తలో చెప్పే నామాట. తప్పు చేసినట్టు తలదించుకుని.

"మీనాన్న నిన్నూ నన్నూ కలిపి చంపిగల్డు!" అంటూ "నీ ఉద్దేశమేవిటి?" అంది.

"ఉద్దేశమేవిటి" కంటేముందు "చంపిగల్డు" అన్నామాటే నామీద పనిచేసింది.

"ఛీ! నాకలాంటి ఆలోచనేలే"దన్నాను ఖచ్చితంగా మర్యాదయిన ఆడపిల్లలా.

"ఆముక్క చెప్పి అయితే" అంది చిన్నత్త.

శ్యామలతో చెప్పేసాను. శ్యామల నవ్వొకగర్విష్టిలా చూసింది.

తర్వాత రెండు మూడు సార్లు పురందర ఎదురొచ్చేడు. కాని మునుపటిలా హుషారుగా ధైర్యంగా పలకరించలేదు—కృత్రిమ పద్ధతిలో నన్ను నేనే మోసగించుకుంటూ తప్పు చేసానేమోనని లోలోపల అన్పించేది. బయటకు చెప్పలేక అంతర్యుద్ధంతో అలసి పోయేదాన్ని—అలా బాధ నణచుకున్నప్పుడు కడుపులోంచి గొంతులోంచి మంటగా అన్పించేది-యాసిడ్ పోసినట్టు.

తర్వాత కొంచెం రోజులకే పురందర స్టేట్స్ వెళ్ళిపోయాడని తెలిసింది.

మరో రెండేళ్ళకీ నా పెళ్ళయింది.

నాన్న దృష్టిలో ఈయన దేవుడు.

దేవుళ్ళకి సరదా పాడు ఉండదుకాబోలు. తననొకరు గుర్తించలేదనీ ప్రశంసించలేదనీ బాధాలేదు, ఒకరిని గుర్తించి మెచ్చుకోవటమూ చేతకాదు.

ఉన్నతంగా దర్జాగా బతకాలన్న కోరికైనా లేదు.

వేదప్రపంచానికి చెందిన మనిషో! ఆబ్సెంట్ మైండెడ్ ప్రొఫెసర్!

నేనూ వింత మనిషినే ననిపిస్తుంది. నాలోచెలరేగే అసంతృప్తిని అణచకోనూ లేను, వెళ్ళగక్కనూలేను, నాలాంటి వాళ్ళకి చిత్రహింస తప్పదుమరి,

గేటు చప్పుడైంది. ఎవరో జీపు దిగి వస్తున్నారు.

అంతవరకూ రంగులమీద దెలగాడుతున్నా మనసు చటుక్కున షెల్ లోకి దూరి పోయింది,

"నాపేరు ప్రకాశరావండీ. ఫ్రెండ్స్




క్లబ్ సెక్రెటరీని, వీరు మా క్లబ్ మెంబరే మధుగారు."

పరిచయాలు, నమస్కారం ప్రతి నమస్కారాలు అయ్యాయి.

"వారింకా రాలేదండీ." అన్నాను వినయంగా.

"ఇంకా రాలేదా? వస్తూంటారే లెండి. మీరు సిద్ధంగానే ఉన్నారు కదా?"

"ఎందుకు?"

"ఆ. ప్రోగ్రాం ఇంకా ఏడు గంటలకి లేండి మొదలు."

"ఏం ప్రోగ్రాం?"

"అరె! మీరు మరచిపోయారా కొంప దీసి! ఈరోజే కదండీ క్లబ్ యానివర్సరీ"

ఏదో చాలా వ్యవహారమే ఉందన్నమాట. నాకేమీ తెలియదని వాళ్ళముందు ఒప్పేసుకుందికి చిన్నతనంగా ఉంది, ఆయన నాతో ఏదో చెప్పే ఉంటారు ముందుగానే. ఆయన ఏ విషయం నాతో వెంటనే చెప్పే అలవాటులేదు. తర్వాత మరచి పోతారు అంతే....అలవాటు.

చిరాగ్గా ఉంది, గొంతులోంచి మంటగా ఉంది.

"ఆయన ఇంటికి వస్తే తప్పక రావటానికి ప్రయత్నిస్తాంలెండి" గడుసుగానే ఏదో అన్నాననుకున్నాను,

వాళ్ళిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకుని ఓ కాగితం తీసి నా చేతిలో పెట్టేరు. ప్రోగ్రాం కాగితం అది. నాగుండె జారి పోయిందొక్కసారి,

'ఏడు నుండి ఎనిమిది వరకు శ్రీమతి వసంతలక్ష్మి గానం'

"ఇదేమిటి?!" వెలవెలపోతూ అడిగేను,

నాకన్నా వెర్రి ముఖాలు పడ్డాయి వాళ్ళకి. అయినా వాళ్ళే ముందు తేరుకున్నారు.

వారంరోజులముందే ప్రోగ్రాం ప్రింటయిందట. నేను ఈరోజు పాడుతానని ఇరవై రోజుల ముందే ఆయన ఒప్పుకున్నా

రట, ఆయన చేతికి ఇన్విటేషన్ కూడా ఇచ్చేరట. నాకింతవరకు ఏమీ తెలియదు.

'ఛీ, ఎంతఅవమానం. ఎలా తలెత్తుకోవాలి? ఇంట్లో ఎలా ఏడ్చినా ఫరవాలేదు, కాని, బయట వాళ్ళముందు ఎంత న్యూనత! ఆయనమీద వాళ్ళకి చిన్న చూపు ఏర్పడుతుందేమో! అదీనాకే బాధ.

"ఈమధ్యంతా కాన్ఫరెన్స్ హడావిడిలో ఆయన సరిగా భోజనానికి ఇంటికే రావటంలేదు లెండి"—అదో అబద్ధం, (అడ వాళ్ళని, అందున్నా నీలాంటి వాళ్ళని పాతెయ్యాలి అంటోంది మనసు) నిజానికా కాన్ఫరెన్స్ జరిగి నెలయింది.

నామాటలు వాళ్ళు వింటున్నట్టులేదు.

"మరి ప్రోగ్రాం ఎలాగండి. ఏదు కే గదా"

'నా నెత్తి కాయ ప్రోగ్రాం' అనాలనుంది.

"ఇంత హటాత్తుగా ఏం పాడతానండీ?" నాబుర్ర పనిచేయడం మానేస్తోంది. వాళ్ళకి ఒళ్ళు మండుతోందని తెలుసు నాకు.

"మీ పుణ్యముంటుంది, రసాభాసు కాకుండా ఏవో నాలుగు పాటలు పాడేద్దురూ" పాపం బ మాల్తున్నారు వాళ్ళు.

వీళ్ళకి సంగీతమంటే తెలిసినట్టులేదు. నాసంగీతం ఇంకెంత బూజుపట్టి పోయిందో అసలెరుగరు. వీళ్ళననుకుని ఏంలాభం?

అయినా నాకు సాధనలేదు. కనీసం నాలుగురోజుల ముందన్నా తెలిస్తే ఆయన మాట నిలబెట్టడానికైనా ఏదో అఘోరించే దాన్ని. ఇప్పుడు ఉన్నపాటున నేను స్టేజి ఎక్కి అభాసుపాలు కావాలా?

"సారీ—ఏనుమకోకండి!"

వాళ్ళేమనుకున్నారో కాని విసవిసా వెళ్ళిపోయారు—కనీసం నా పాట బదులు ఇంకేదో ఎరేంజి చేసుకునేడవాలిగా.

జీపు వెళ్ళిపోయింది.

నాకు కళ్ళ నీళ్ళొచ్చే పరిస్థితి.

ఆయనొచ్చేరు — అలసి సొలసిన కార్మి డిలా.

ఫ్రెండ్స్ క్లబ్ ఇన్విటేషన్ చేతిలో పెట్టేను — ఏమిటనుకున్నారో ఏమో నవ్వుతూనే పుచ్చుకున్నారు. పేపరు విప్పి చదివేరు.

"అరే!" కాసేపు అంతరిక్షంలోకి చూస్తూ ఉండిపోయారు. నింగిని తాకే చెట్ల చివర్లని పిట్టల బారుల్ని చూస్తూ ఎదురుగా నేనున్నానని మరచి పోయారేమో!

నాకు ఒళ్ళు కుతకుత ఉడికి పోతోంది.

"ఏమిటో, నిజంగానే మరచిపోయాను సుమా—చాలా పొరపాటయింది." అంటూ జేబులోంచి అదే ఇన్విటేషన్ తీసి చూసుకుంటున్నారు,

ఎందుకది ఏడవను?

పావుగంటసేపు అలాగే నిలబడిపోయి, "పాపం ఏంఇబ్బంది పడుతున్నారో వాళ్ళు" ఇంకేదో గొణుగుతూ లోనికి నడిచారు.

అందులో నూరోవంతు సానుభూతి నా మీదేడిస్తే ఎంత బాగుండును!

"వసంతలక్ష్మీ!"

రెండు నిముషాల్లో కేక, కాఫీ కోసం కాబోలు. అంటే ఆ అధ్యాయం ముగిసి పోయిందన్నమాట.

నాపేరు ఉట్టి వసంతలక్ష్మి కాదు. వీర వెంకట సత్య వసంతలక్ష్మి. అలా పిలవండి. అనాలనుంది, ఆయనలా పిల్చినప్పుడల్లా అలా అనాలనే ఉంటుంది. కానీ అనలేను.

కాఫీ కలిపి ఇచ్చేను.

"ఈవాళ కాఫీ ఎందుకో చాలాబాగుంటి సుమా!" ఆ మాత్రం మాట ఆయన నోట రావటం అరుదే. అందుకే అలాంటి మాట విన్ననాడు పండగంత వేడుకగానే ఉంటుంది—నాకు కాని, ఎందుకో ఇప్పుడది కూడా చిరాగ్గానే ఉంది, మాట్లాడలేదు నేను.

"పోనీ, నువ్వు వెళ్ళవలసింది. ఏవో నాలుగు పాటలుపాడి వచ్చేస్తే సరిపోయే దిగా! పాపం వాళ్ళెంత ఇబ్బంది పడ్డారో," మళ్ళీ అదే గోల.

"నిజమేకాని నాకు బొత్తిగా సాధకం

లేదుకదండీ? ఏం పాడతాను?" నేనంత అణకువగా మాట్లాడితే నాకు ఒళ్ళు భగ భగ మండి పోతోందని ఆయన కెలా తెలుస్తుంది మరి; నా బలహీనతే అది,

"అవున్లే అదీ నిజమే. నా మరపు ననా లింతకీ!"

ఏం మనిషి! కసురుకోవాలో, జాలి పడాలో తెలియదు. మా ఇద్దరిమధ్య మరికాస్త సంభాషణ పెరిగితే నే నింకా కరిగిపోతానేమో!

పింకీ వచ్చింది ఆటనుంచి.

ఆయన పాఠాలు చెప్తున్నారు దానికి.

నేను యథాప్రకారం తోటలో వాలు కుర్చీలో.

పురందర! మళ్ళీ మనసు పొరల్లో.

నేను కాలేజీలో పాడటం—ఆరాధనగా అతని చూపు - ఎదుట పడినప్పుడల్లా చైతన్యం. మూర్తీభవించినట్లుగా 'వసంతీ' అంటూ.... నేనతన్ని అప్పట్లో నిజంగా ప్రేమించలేదు. ప్రేమించే ఉంటే సంప్రదాయాలూ చట్టు బండలూ కాదని అతన్నే పెళ్ళాడే దాన్నేమో!

కాని ఇప్పుడింతగా నేనతన్నే ఎందుకు గుర్తు చేసుకుంటాను? కాదు....కాదు.... అతను నాకు గుర్తొచ్చేలా చేస్తున్న దీ [illegible]. ఈయనున్నంచే మనసు తంపపుకోత.

"వసంతలక్ష్మి! వడ్డిస్తావా?"

యాంత్రికంగా వడ్డన. తిండి, [illegible] ఆయన వద్దన్నా మారు వెయ్యటం [illegible] వాటు. కాని ఎందుకో స్తబ్ధంగా ఊరు కొన్నాను. జ్ఞాపకం లేక కాదు. ఆయన లాగే తినేసి నవ్వుకుంటూ లేచి చేయి కడిగేసుకున్నారు. నామనుసు కలుక్కు మంది.

అలా నవ్వకపోతే నీకేమైంది? ఎందు కలా వున్నావు? అనకూడదూ? రోజూ మారు వేసే దాని వీ రోజు ఎందుకు వెయ్య లేదని కాస్త ఉక్రోషంగా ఓమాటైనా అనరాదూ? ఆ నవ్వేమిటి? అది నాపాలిటి వరమా? శాపమా?

నోటికి తిండి పోవడం లేదు.

రాత్రి పదయింది. అమావాస్య రోజులు. బయట చీకటి - నిశ్శబ్దం.

ఆయన పక్కమీద పడ్డదేపాటు, హాయిగా నిద్ర పోతున్నారు. అంత సులువుగా నిద్రెలా వస్తుందో?

'మైండ్ క్లియర్‌గా ఉంటే అలాగే వస్తుంది నిద్ర' అంటారాయన—ఉక్రోషం పట్టలేక ఎప్పుడైనా అడిగితే.

నిజమే-చీకూ చింత లేని జీవితం. నాకే ఈ గుంజాటమంతా. కళ్ళంట గిర్రున నీళ్ళు తిరిగాయి. పంతానికైనా ఆయన లాగ నిద్రపోవాలని ప్రయత్నం. నాకా భాగ్యం లేదు;

కాంపోజ్ వేసుకుని పడుకున్నాను.

"వసంతలక్ష్మి! వసంతలక్ష్మి?"

నిద్రలోంచి ఉలికి పడి లేచాను.

"కలవరిస్తున్నావు."

"ఏమని?!" మనసు పొరల్లోంచి ఏమి బయటకొచ్చాయో నని భయం, సన్నని వణుకు.

"నీకు సంగీతమంటే చాలా ఇష్టం. ఏమిటో నాకు సరిగమలైనా రావు. దేవుడు మనంటి జంటల్ని కావాలనే తయారు [illegible]రోలు;"

—[illegible]—

"[illegible]" నన్నాగా [illegible]

"[illegible]"

"అర్ధరాత్రి ఇప్పుడేంపాటి?" (ఆయన వన్నీ విచిత్రాలే) పడుకోబోయే ముందు వరకు ఆయనమీద కోపంగానే ఉంది కాని, ఇప్పుడెందుకో అన్నీ మరచి ఫక్కున నవ్వేను.

"పురందరదాసు కీర్తన- 'బారయ్యా వైకుంఠకృష్ణా' అని పాడుతుంటావు చూశావూ!"

పక్కలో పిడుగు పడితే ఇలాగే ఉంటుందా!!

పురందర గురించి ఈయనకు తెలుసా

కొంపతీసి! ఇంతకీ నేనేమని కలవరించేను. ఆ ప్రశ్న అడగలేను. ఏమని కలవరించేనో తెలుస్తూనే ఉందిగా.

"అన్నట్లు చెప్పడం మరచిపోయాను. ఆమధ్య జరిగిన కాన్ఫరెన్సుకి పురందర కృష్ణ అనే ఒకతను వచ్చాడు. నిన్ను తెలుసునన్నాడు. నీపాటంటే, నువ్వంటే చాలా ఇష్టమన్నాడు. .. "

దేవుడా! ఏం ఘోరం జరగబోతోంది? నా చెవులు దిబ్బళ్ళేసుకు పోతున్నాయి. పురందర పెళ్ళి చేసుకున్నాడని, భార్యకూ తనకూ పడక విడాకులు పుచ్చుకున్నాడని తెలుసు. ఈయనకు నామీద ఏమైనా అనుమానం వస్తే? నా సంసారం ఏంకావాలి? దేవుడా! నన్ను క్షమించు. నేను నిజంగా పురందరని ప్రేమించలేదు. అతని జ్ఞాపకాలు పట్టి మనోవికారాలు మాత్రమే - నీకు తెలుసు.

"అతను భలే ఏక్టివ్‌గా ఉంటాడు. నీ గురించి ఎంత పొగిడాడో తెలుసా? నాకు చాలా గర్వమనిపించింది."

నేను మతి పోయినట్లు చూస్తూన్నాను. ఆకంఠంలో అసూయలేదు. అనుమానం లేదు. క్రోధంలేదు. వ్యంగ్యంలేదు. ఇదే పురందరలాంటి మగాడయితే? పాపం, విడాకులవరకు వచ్చిందట తన సంసారం అని జాలిపడేదాన్నిదివరకైతే. ఇప్పుడవన్నీ అసలు-తలవాలనిలేదు.

దేవుడా నువ్వెంత కరుణామయుడవి,

నేను పాడుతున్నాను.

ఎంతో హాయిగా దూది పింజలా తేలికైన మనసుతో సంతోషంగా పాడుతున్నాను — ఆయన కోరిన పురందరదాసు కీర్తన.

పాడుతూ, పాడుతూ ఎందుకో ఆయన ముఖంలోకి చూసాను, గుడ్డిదీపం వెలుగులో స్పష్టంగా కనుపించటంలేదుకాని, సన్నగా గుర్రు వినిపిస్తుంది.

అంటే—చీకూ చింతా లేకుండా నిద్రపోతున్నారన్నమాట. ఇదే మరొకప్పుడైతే పాడమని అడిగి పడుకున్నందుకు కోపం వచ్చేది.

ఓఫ్ ! ఏం మనిషి !

తప్పు... తప్పు....దేవుడు.

నిజంగా దేవుడు.

నా కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి.

నా మనసులో పేరుకున్న దుమ్ము, ధూళి అంతా ప్రక్షాళితమై పోతోంది - ఆనంద ధారల్లో. ●

# రాజ్యమేలాలంటే...

పమిడిఘంటం సుబ్రమణ్యం

“[illegible] ప్రయో[illegible] [illegible]రాడు కుని చస్తేగాని ఏకచ్ఛత్రాధిపత్యం ఏర్పడదు. అది మోసంద్వారా గావచ్చు, యుక్తి వల్లనూ గావచ్చు; పౌరుషం, ధీరత్వం వల్లనూ గావచ్చు. ప్రాచీన రాజ్యాల మధ్య చిన్న తమాషా అయిన మోసం, యుక్తిగా చేసే యుద్ధం గురించి చెప్పనా రాందాసూ?! అయితే ఇందులో సర్వసంగ పరిత్యాగి అని పేరుగల బుద్ధుని మిళితం, తంత్రం కూడా మనకు బైటపడు తుంది సుమా!” అని హెచ్చరించాడు గోపాలచక్రవర్తి. అతను తెలుగు,సంస్కృత భాషల్లో పండితుడు. కొంత కాలం కాశీలో చదివాడు, అతని వివరణల్లో కొంత చాదస్తం కనిపిస్తుంది గానీ, అతన్ని మాత్రం ఆప్రాంతంలో రిఫరెన్స్‌గా వాడు కుంటారు అది ఓ చిన్న గ్రామం గావట్టి చారిత్రిక విధిలూ, వేదాంత విషయాలూ, రాజకీయాలూ, లోకాభి రామాయణం ఇష్టమున్న ఔత్సాహికులు అంతా అక్కడ చేరుతారు.

“ఇది బౌద్ధ సాంప్రదాయిక కథ”

“సారీ! ఇప్పుడు ఆళ్ళనిగూడ ‘వాంటెడ్ పరుసు’ లిస్టు కిందేశారంటగా” అడిగాడు రాందాసు.

“వాళ్ళనే ఏమిటి అందర్ని ఆ లిస్టుల్లో వేస్తే ఇంక ఆసమస్యే తల ఎత్తదుగా? అయినా అది అప్రస్తుతం, మన ఈ భరత ఖండంలోని ఉత్తర దిశలో ఒక భాగాన్ని “అజాతశత్రువు” అనే ఓ మహా రాజు పాలించేవాడు.

“దరమరాజుకేమైనా దగ్గిర బందువా ఈన?” రాందాసు.

“అబ్బే! వాళ్ళిద్దరికలాటి సంబంధం లేదు. సుందరమైన రాజమందిరాలతో, విశాలమైన వీధులతో, ఎంతో వైభవంగా అందంగా వుండేది వాళ్ళ రాజధాని. ఈ అజాతశత్రువు అనే రాజు బుద్ధవ్యతిరేకి ‘దేవదత్తుడి’ చేత ప్రోత్సహింపబడి, తండ్రి బింబిసారుడ్ని హతమార్చి ఆ తర్వాత సింహాసనానికి వచ్చాడని బౌద్ధ సాంప్రదాయం ఏరిత్ర మనకు చెబుతోంది.”

రాందాసు మధ్యలో అడువస్తూ “రాజ్జెం కోసం వేల మందిని అతమార్చి లచ్చలాది జనాన్ని జైల్లలో తోసేసి నిర్బొక్కోవటం నయమా? ఒకడో, అరో, అది అన్నగానీ, అయ్యగానీ ఎవుర్నయి తేసేం సంపి పైకెక్కేయటం నయ మంటరా?”

“నేచెప్పేది సంపూర్ణంగా వింటావా లేదా? అట్లా హతమార్చిన వాడు ఆతరు వాత పశ్చాత్తప్తుడై బుద్ధదేవుని సన్నిధిలో తన సుఖవైభవాల కోసం తండ్రిని హత మార్చాననే, దోషాన్ని అంగీకరించాడని



తెలుస్తుంది."

"అంటే గోవుని చంపిన నాయన సాయంత్రానికి గుళ్లోకి పోయొచ్చినట్టు"

"అయితే జైన సాంప్రదాయానుసారంగా ఈ అజాతశత్రువు పితృ హంతకుడు కాడనీ - తండ్రి బింబిసారుడ్ని చెరసాలలో బంధించినాగానీ కొడుకైనటువంటి అజాత శత్రువే తన రాజ్య పాలకుడని ప్రకటించాడనీ వుంది. చెరసాలలో బింబిసారుడి రెండవ భార్య చెల్లనా దేవి భక్తితో భర్తనే సేవిస్తోంది. కొడుకు పశ్చాత్తప్తుడై తండ్రిని చెరనుండి విడిపించ

డానికి వస్తోండగా బింబిసారుడు తనను కొడుకు హతమార్చడానికి వస్తున్నాడని తలపోసి సిద్ధంగా వుంచుకున్న విషఘుటికను మింగి చనిపోయాడని తెలుస్తోంది"

"ఈడు మాటికి జైల్లోనూకి, సావనూకి పశ్చాత్తాపం పెకటించటం; మన పోలీసోల్లచేత పెజల్ని పావనూకి మనోళ్ళు సానుబూతి పెకటించి నట్టుగా వుంది," రాందాసు - ఆవూర్లు పంచాయితీ బోర్డు మెంబరు. కామెంట్ చెయ్యకుండా కుదురుగా కూర్చొని వినడం అతని వల్ల గానిపని.

"ఇదిలావుండగా అజాతశత్రువు రాజ్యానికి సమీప రాజ్యం లిచ్ఛవిరాజ్యం"

"ఈళ్ళనేనాసామీ లుచ్చాలూ అనేది."

"కాదులే వినవయ్యా! గంగా తీరంలోని రేవు ప్రాంతంలో ఈ లిచ్ఛవులకు, అజాత శత్రువుకూ సమధికారంవుంది. ఒక పర్వత భాగంలో రత్నాలగని బైట పడింది. దానిలో సమభాగం ఇవ్వకుండ లిచ్ఛవులే పూర్తిగా స్వాధీనం చేసుకున్నారు. ఈ కారణంగా వారిరువురు మధ్య యుద్ధం సంభవిస్తుంది. అయితే లిచ్ఛవులు చాలా బలవంతులు, ఐకమత్యం కల్గినవారు, వార్నిఎదిర్చి నిలవడం అజాత శత్రువు లాంటి రాజువల్ల అయ్యేపనిగాదు, అప్పుడు అజాత శత్రువు తన మంత్రియైన 'వత్సకారుడ్ని' పిలిపించి తనకు విజయం లభిస్తుందో లేదో తెలుసుకురమ్మని బుద్ధ భగవానుని వద్దకు పంపుతాడు."

"అయితే బుద్ధుడప్పట్లో జోతిశ్శ్యం కూడ చెప్పేవోడన్న మాట." రాందాసు.

"జ్యోతిష్యం చెప్పలే, మార్గం చెప్పాడు. ఏం చెప్పాడో తెల్సా?"

"ఏవుంది. శాంతిమంతుడుగదా. యుద్దం మానెయ్యండ ఏం! అనుకుంటాడు." రాందాసు.

"అలా చెబితే మనం మళ్ళా ఈ కథ చెప్పుకోవటం దేనికి రాందాసూ. బుద్ధుడు బుద్ధికుటిలతని మనకు చరిత్రకారులు, సూచనప్రాయంగా తెలుపబట్టి మనం ఈ కథలోకి వెళ్ళాల్సిన అగత్యం ఏర్పడింది అవునా? బుద్ధ భగవానుడు అజాత శత్రువు మంత్రియైన వత్సకారుడికి ఏం బోధించాడయ్యా అంటే "ఐకమత్యాన్ని, ఐశ్వర్యాన్ని సాధించి, కఠిన శాసనాలు చేయకుండ పాలిస్తూ, పూర్వ సాంప్రదాయులను అనుసరిస్తూ, మహాత్ములను, స్త్రీలను గౌరవిస్తోన్న బలవంతమైన దేశాన్ని అజాత శత్రువు లాంటి రాజు జయించలేడు. లిచ్ఛిలను దానంతోనో, భేదంతోనో తప్ప జయించరాదని"

"ఇది మన శనగారపు శాంతయ్య 'ప్రెయివేటు' చేసినట్టుంది."

"సర్వసంగ పరిత్యాగి అయిన బుద్ధుని సలహా మేరకు ఈ భేద తంత్రాన్ని వుపయోగించి తన మంత్రియైన వత్సకారుడ్ని నిండు సభలో గుండు జేయించి, అవమానించి, లిచ్ఛవుల్ని బలపరిచాడనే నేరం మోపి దేశ బహిష్కారం గావిస్తాడు. వత్సకారుడు కూడా లిచ్ఛవుల్ని కావాలనే బలపరుస్తాడు."

"అంటే మన రాములోరు సీతమ్మోర్ని ఎల్నాకినట్టు"

"అది అలానాటకం కాదు రాందాసూ"

"నాకు తెల్సులే సామీ దానికత."

"నీవు చెప్పినా వినిపించుకోవు. సరే. ఈ లిచ్ఛవులు వత్సకారుడికి ఆశ్రయం ఇచ్చి, విశ్వాసంతో దగ్గిరకు తీస్తారు."

"పక్కలో పాముని పండేసుకున్నామని తెలీక."

"వినుమరి. అక్కడ ఈ వత్సకారుడు మంచిపేరూ, పలుకుబడి, ప్రతిష్ట సంపాయించటమే గాకుండ, గొప్ప మంత్రిత్వాన్ని కూడా సంపాదిస్తాడు.

"వార్ని .. మంతిర్న సమ్మొకోమని అల్లకి ఎవురు సెప్పింద్రు సామి?"

"నాయకులంటే ఈనాడు కాదు రామదాసూ."

నాయకులన్నాక ఎవుడైనా ఎప్పుడైనా ఒకటే. ఆళ్ళ నెక్కిచ్చినోళ్ళని తొక్కేయ

టవే దాని మొదటి లచ్చనం."

"ఇక అవత్సకారుకు విజృంభించి వాళ్ళ ఐకమత్యాన్ని భగ్నంచేసి, వాళ్ళలో అంతః కలహాలు రేపి, ఆదేశంలో అరాచకం సృష్టిస్తాడు. ఈసమయంలో అజాతశత్రువు సైన్యం లిచ్ఛవులపై దండెత్తి విజయం సాధిస్తుంది."

"అంటే ముందే వూసులాడుకుని కరప్స నోళ్ళకు లంచాలు తినేవోళ్ళని పట్టిత్తారు సూడు అట్టగన్నమాట."

"అంతేమరి"

"ఇదేం కతసామీ? బుర్రకు దాకా లేదయాం. పొలారం సమితి పెసిడెంటు సెంచురావుడు తెల్సునా? ఆడికత ఇంత కంటే బవుసొగ్గా వుంటది. సెప్పేదా?" అడిగాడు రాందాసు.

అందరితో పాటూ ఆయనా 'సరే' అనక తప్పలేదు.

"అయితే సెవుతున్నా—సెంచురావుడు అంటే దశరదుడికి మల్లేనో, రావులోరికి మల్లేనో మారాజుకు మల్లే పుట్టలే. సెంచు రావుడి అయ్య సమితి పెశిడెంటూ కాదూ, నాకుమల్లే పంచాయితీ బోర్డు మెంబరు గూడ కాదు. ఆడు గుర్రబగ్గీ తోలేబోడు. పుడు ఆడూ ఆడి బండి ఒకేసారి పోయి నయి. అసలు 'పొల్లారం'అంటే తెల్సునా?" అందరికేసి చూశాడు. ఎవరూ సమాధానం చెప్పలే.

"అదేనయ్యా! 'పొలంలేనోడికి పొల్లారం ఆల్లేనోడికి అద్దంకి' అంటారు సూడు. ఆవూరు."

"ఆసామెత ఎలా వచ్చింది రాందాసూ" నవ్వుతూ అడిగాడు చక్రవర్తి,

"ఏవుంది సామీ! పండిసచ్చే పొలంలేదు దున్నిసచ్చే ఎద్దులు లేవు కావాలనోడికి కావాలన్నంత పొలం ఆవూరికి రైలుటే సను శాస్త్రారం. ఈ సెంచురావుడు అయ్యసచ్చినాక పిల్లా మేకను అదిరిచ్చుకు తినేవోడు. పెద్దయినాక పెద్దోల్లనీ, పెద్ద పుల్లాటోల్లని బెదిరించుక తినేవోడు. వూరు వూరంతా యీడంటే అడిల్సచ్చేవోళ్ళు, ఈడుబాగా ఎదికినాక ఆ వూరికి ఓ బయం మాత్రం తగ్గింది, అదేవంటే ఈడున్నంత కాలం ఆవూరికి కన్నం దొంగలు రావటం మానేసినారు. ఇళ్ళల్లో సొమ్ము పోతే ఏయింది గాని ఇళ్ళకు కన్నాలు మాత్రం పట్టంలే. ఈడిమీద ఎవురైనా రిపోట్రు ఇద్దామంటే - మొన్న నువు సెప్పినావు సూడు పొటాసియం సైనేట్రు-దాని రుసి తెల్సుకునే యవ్వారంలాగుంటది."

"ఓపాలి పట్టాభిరావయ్యని పీడరీ సేత్తా వుంటాడు పట్నంలో-ఆయన ఈడ్నేవుంటా రోజూ పట్నంపోయి అన్ని కోరట్లో వాదించే గెల్సొత్తావుంటాడు. ఆయినింటి కెల్లిండు ఈ సెంచురావుడు దొంగతనానికి. ఆయనెట్టాంటి పీడరంటే జడ్జీ కల్లెదురుగా వున్న బెంచి గుమాత్తాన్ని గునపంతో పొడిసి గుటుక్కు మనిపించినా, గుక్క తిరక్కసచ్చాడుగాని ఇది అత్యగాదని అర్సి మరీ గెలిపిత్తాడు. ఇగ ఆయన సంపా యిజ్యం చెప్పే బల్లే, భార్యకు బంగారపు తొడుగయితే దోరబంటరాలకి ఎండిపూత. ఇల్లు యినువుతో కట్టితే - యినప్పెట్టి ఇందురుడి వొర్జాయిదం... ఇల్లు ఇల్లాంతా యిమానం రేకుతో పరిసిండంటే నమ్ము"

"అంతటి బాగ్యవంతుడింటికెల్లిండు ఈ సెంచురావుడు. ఆయనకి పిల్లాపీసూలేరు. ఆడకూతురొక్కతే వుంది. పీడరేమో పట్నె మెల్లిండు. తలుపు తట్టినాడు మన్రావుడు, ఆయాడకూతురేమో తలుపు తెరిసి ఈడ్ని జూసి బూకంపం వొచ్చినంత కేకేసింది. ఆ ఇంద్ర బవనానికి కేకలు ఇనపడే అంత దగ్గిర్లో ఇల్లులేవు. ఆ మెకాల్లు, సేతులూ. నూతికి గుడ్డకట్టి దొరికినంత వూడ్చిండు. ఇంటాయన వొచ్చేంతమటుకు దొంగతనం జరిగి నట్టుగూడా వోరికి తెలవదు. ఆయనొచ్చి నాక ఆఇల్లు అద్దెకి పారేశిండు. అయిదరా వాదు బోయి, ఆడగూకోని ఈడి ఆట కట్టిచ్చిండు. సెంచురావుడికి శిచ్చవెప్పారు. మూడు సంత్సాలకి అడ్ని వొదిలిపెట్టారు.

పీడరి పట్టాభి రామయ్య నీళ్ళొదుకోవాలనే వూరంతా అనుకుంది. పోలీసోల్లు ఎప్పుడైతే యీడ్ని పట్టుకున్నారో పాత నేరాల క్కూడా సాచ్చికాలిచ్చినోరున్నారు వూళ్ళో. ఆ నాయాల్లంత కూడ నవగ్రహ కూటమికి బయపడి కొండలెక్కినారు సూడు అట్టా అదిరి సచ్చారనుకో." మంచినీళ్ళకోసం సైగ చేశాడు రామదాసు. పడక్కుర్చీలో కూర్చున్న గోపాల చక్రవర్తి మరచెంబు గ్లాసు అతనివైపుకు పంపాడు. రెండు గ్లాసుల నీళ్ళు గడగడా తాగి మళ్ళీ మొదలెట్టాడు.

"నాగుబావులాటి సెంగురావుకు నత్త గుల్లకు మల్లే వచ్చిండు. ఆడెంత మంచోడయి వచ్చిండంటే ఈస్వరుడి కోసరవని యిస్య పెయత్నం జేసిన యాల్టి రావను డంత మంచోడయి వచ్చిండంటే నమ్మ. కానీ వూల్లో ఎవురూ నమ్మలే ఈడ్ని. వూల్లో లాక్కోవటానికి రిచ్చాగూడా అద్దెకియ్యలే ఈడికి. కూలిపనికి రానియ్యలే, ముఠావోల్లు కలవనీయలే. ఆడు ఆడి జీవితంలో కూటికి మాడిన రోజులేమైనా వుంటే అయ్యే;"

"ఏందే సెంగురేదో తెగ సెపుతుంటాడు?" ఆవూరి మాజీ ప్రెశిడెంటు ప్రవేశిస్తూ అడిగాడు.

"మీ పెశిడెంట్ల సంగతేలే!" అన్నాడు రాందాసు.

"ఆ.! నెంబర్లు సరిగా పడితె పెశిడెంట్లూ సరిగా పడుత్తారు." అన్నాడు మాజీ.

"నెంబర్లు నిప్పులాటోల్లయినా తాళాలు వుప్పునీరులాటోల్లకిచ్చినే, తాగను బనికి రావు, తలకు బోసుకోనూ బనికిరావు."

"సర్లేవా. కానీ నీ కత" మాజీ కూర్చుంటూ అన్నాడు.

"సరే ఆపాట, ఆడు వూర్లో సావుకోర్లంద రి కాడికి తిరిగిండు. మాఅయ్యకు మల్లే నేనూ గుర్రబగ్గీ తోలుకుంటాను. తలావో సెయ్యి ఎయ్యమని, బండి కొనిపెట్టమని అడిగిండు. సావుకార్లకి గుండెలు పగిలినయి. అసలే ఆవూరు వొచ్చేయి అద్దరేత్రిబళ్ళు. ఆటికిదొంగలబళ్ళు అని పేరు వుండనే వుంది. ఈడు రైలుకాడ్నుంచి వూల్లోకి మడుసుల్ని జేరేత్తాడా శవాల కుప్పలు పోగేత్తాడా అని అనుమానం వొచ్చింది. అందులో కొంత దిటవున్న సావుకోరు "ఒరే రావుడూ! నువుగుర్రబ్బగ్గీ తోలటం ఏందిరా. రేపురా. ఇంకేదయినా సూద్దాం." అన్నాడు. ఆడ్నుంచీ మొదలైంది సావీ ఆడికత నువు నమ్మవుగానీ - సావంతుడు రారా జై, మారాజై, సెంగురావుడు సెక్రవర్తయిండు."

"ఎట్లగంటావా? ఎలచ్చన్లొచ్చినయి. అంటే ఓట్లు అని అరదం. ఓటంటే ఆవూల్లో ఏంటో తెల్సునా!" అడిగాడు రాందాసు, ఎవర్నుంచీ సమాధానం లేకపోయేసరికి మళ్ళీ అతనే చెప్పుకోసాగాడు.

"కాగితం. రూపాయినోట్లనాన్న కాయితాలే అనుకో. అయితే ఈకాగితాలు తీసేసుకుని ఆ కాగితాలు ఇచ్చేడం. అయి పెబుత్వం గుద్దితే - ఇయి పెబలు గుద్దుతారు. ఎగస్పార్టీ వోల్లని కొంతమందిని ఎర్రమల అడవులకు తోలినారు,

"ఎందుకు?" బ్రొరయ్య ప్రశ్నించాడు.

"ఆరి పిచ్చిసన్నాసీ! బెమ్మదేవుడి కూడా ఓటుంటే—అడెటేసేదీ - ఎవురికీ తెలవదు. ఆకరికి ఆడికూడ-ఎంచేతంటే తాగేసి, గుద్దేత్తారుగాబట్టి. అందుకని ఈడు మనోడు గాదనుకుంటే రాజావారి కోట లోనో రావవేంద్రాపురం కాలవలోనో తోసేత్తారు. ఎట్టా సేరదీసేరోగాని పార్టీ వోళ్ళు ఈడ్ని, ఈ సెంగురావుడ్ని సేరదీసి ఓ వార్డు పై నామినేసను ఎయించినారు. ఇక జూసుకో నా సామిరంగా! ఈడిమీద నామినేసను ఎయ్యటానికిబంకినారు. ఎవరూ ముందుకు రాలే. పంచాయతీ నెంబరు గావాలో - పాణాలే గావాలో ఎల్చుకోమన్నారు. ఎగస్పార్టీ వోళ్ళు పాణాల మీదే మోజుపడినారు. ఈడు ఏకగ్రీవంగా ఎన్నికయిండు. సిట్టసివరకు సెంగురావుడి

ఒకే మెజార్టీ తీర్మానం ఓటు అయ్యేతలికి ఆడు పెశిడెంటుగిరీమీద మోజుపడిండు."

"అయితే చెంచురావుకు ఏకగ్రీవంగా ప్రెశిడెంటు అయినాడా?" చక్రవర్తి అడిగాడు,

"ఇనవేం. ఎనకటికో పంచాయితీలో ఆడదాన్ని నిలేసి ఆడితోనన్నా వుండు, ఆడి అన్నతోనన్నా వుండు, అంతేగాని అల్లరి సిల్లరి తిరుగుల్లు పనికిరావని తీర్పు చెప్పారు పెద్దమనుసులు. ఆడూ ఒద్దు, ఆడి అన్నావొద్దు. మరిదితో మరికాసిన్ని రోజులుంటానందంట. అట్టనే రెండుపార్టీలోల్లు కొట్టుకుని ఎనిమిది తలలు తెగినాక, ఎనభై మంది జైల్లకు పొయినాక సేసేదేవీలేక ఈడికి పెశిడెంటు పదవి కట్టబెట్టిండ్రు; ఇగన రంగం సమితి ఎలచ్చన్లకు జేరింది. ముఠాలన్నాక ఆడారెండు వుండాలిగదా. ఈడు ఏ ముఠాదూగాకుండ సమితి సింహాసనం ఎక్కాలని, ముఠా ఏదైనా పగ్గే అండగావాల. ఈడు లోపాయికారి. ఈ ముఠాతో మాట్లాడిండు. మీద పెప్పులే ఏయించుకున్నాడో, కేకరిచ్చే వుమ్మిలే ఎయిచ్చుకున్నాడో, గుండు, గాడి దూరే గింపు తప్ప సకల అగమానాలూ పొయినా జేయించుకుని అవతల పార్టీ వోళ్ళతో దూరి సకల సమ్మానాలూ జేయించుకుని ఈముఠాలో కాసిని వోట్లు, ఆముఠాలో కాసిని వోట్లూ జేర్చుకుని చిట్టసివరకు బొల్లారం సమితికి సెక్కర వర్తయి గూకున్నాడు."

"ఇయన్ని ఎట్టా ఒడించాడబ్బా?" రాఘవులు,

"ఏంది రాగవులూ ఎదురుంగా మాజీని పట్టుకుని మమ్మల్నడుగుతవు. అడిన్నంచీ కానీ. ఆడు ఏలిండు. ఒకోక్క ఆపీసర్ని పిల్చేవోడు. ఈ రోడు ఎవురేసిండ్రు? ఆడికి తెలవగపోతే మా మేసిత్రీరి కాడకొచ్చిగూకుని అన్ని తెల్సుకుని ఏయించాల. ఇట్లా తెల్సితెలియని ఎవ్వారాలు జేసిఆల్ల పాణం తీసి చివరికి పెశిడెంట్ల పాణాలికి ఆపీసర్ల బతుకులకి బమ్మ రాచ్చసుడైపోయాడు.

"పూరేమొగాని ఆడి ఏసం మాత్రం ఇచిత్రంగా మారిపోయింది. సీరు కావి గుడ్డలు, కిర్రుసెప్పులు, మెళ్ళోకంఠె అట్న లుగుర్తు ఇట్నలుగురు ఈటెలు, కత్తులు, గండ్రగొడ్డళ్ళతో గాడ్రులకు మల్లే నడుత్తొంటే కారు సెడిపోయి నడుచుకుంటూ పోతున్న గవర్నరుగోరికి మల్లే వుండేవోడు ఈడిబీబత్సానికి తట్టుకోలేక ఓపాలి అందరూ కల్సి అవిస్వాస తీర్మానం పెడదవనుకన్నారు, అందరూ మీటింగాని కొచ్చి కూకున్నారు. ఈ యవ్వారం అంతా ఈడికి ముందే తెల్సు. మీటింగులో నుల్చోని సెంచురావుడు ఒకటి శెప్పిండు. "ఇదుగో, నాకీ ముసుగులో ఎవ్వారం తెలీదు. నన్ను ఎవురోడించే సెయ్యాలని సూత్తన్నారంట. నేను పెశిడెంటుగా వుంటం ఇట్టం లేని వోల్లెవరో మరియాదగా సేతులెత్తండి నరికవతలనూకుతాను." అన్నాడు. అంతే. ఆడి మీద అవిశ్వాసం అప్నేడు మల్లా కనబడలే. ఇగనానాట్నించి ఆడంతే అవిశ్వాసమూ లేదు; అయిట్టత అంతకన్నాలేదు."

"అది సరే. ఈసారి ఎలక్షన్లు ఎలా వుంటాయో నీ అంచనా చెప్పు రాందాసూ?" గోపాలచక్రవర్తి.

"ఏంది సామీ. నువ్వా అట్టాగడుగుతావు. బిడ్డ పుట్టిండు అంతే మొక్కట్లు మొగుడియా, మిండగాడియా తెలవ్వోచ్చు. అసలు బిడ్డకు బీజమే పడకపోతే ఎట్టా తెలవటం?" అన్నాడు రాందాసు నవ్వుతో. "అయినా మా జిల్లాలో ఎలచ్చన్లనుకున్న రెండుసార్లా ఎకార్సన్లయినాయి" మళ్ళీ అన్నాడు.

ఆ రోజుకు సభ చాలించి అందరూ లేచారు ఒక్క చక్రవర్తి తప్ప. అతను లేవకపోవడాని క్కారణం అది అతనిల్లు కావటం.

# హిస్టీరియా

కౌడిగిరి పోతరాజు

దేశంపై అత్యవసర పరిస్థితి పడగ విప్పుకొంది.

అర్ధరాత్రిపూట పోలీసులు-దేశం నలు మూలలా విజృంభించారు. నియంతృత్వాన్ని వ్యతిరేకించిన ఇళ్ళ తలుపులు కొట్టారు. ఉన్నపళంగా ఆయా వ్యక్తులను తీసికెళ్ళి పోలీసు లాకప్పులలో కుక్కారు. చట్టం అమలులోకి రావటానికి ఒక్కరోజు ముందే అరెస్టులు జరిగిపొయ్యాయి. పోలీసు స్టేషన్లకు వెళ్ళిన వ్యక్తులు మళ్ళీ ఇళ్ళకు తిరిగి రాలేదు. వారిపై అంతరంగిక భద్రతా చట్టం ప్రయోగించబడ్డది. 'మీసా' విషపు కోరలలో చిక్కుకొన్న వాళ్ళు - అటు నుంచి అటే జైళ్ళకు వెళ్ళిపొయ్యారు.

జైళ్ళకు వెళ్ళి నెల రోజులు గడిచి పోయినా, ఆ నిర్భాగ్యులు ఏ జైళ్ళల్లో, ఎందుకు, ఎప్పుడు నిర్బంధించబడ్డారో మొదలైన సమాచారాన్ని, ప్రభుత్వం— వారి వారి తల్లిదండ్రులకూ, భార్యాపిల్లలకూ అందించలేదు.

'డిటెన్యూలు'గా పిలువబడుతున్న ఈ నిస్సహాయులు తతిమ్మా ఖైదీలతో పాటు జైళ్ళలో గోడల మధ్య విచారణలేని నిర్బంధానికి గురై కాలం వెళ్ళదీస్తున్నారు.

అటువంటి జైళ్ళలో ఒకజైలు.

సెంట్రల్ ప్రిజన్—వరంగల్.

సువిశాలమైన కారాగారం. డిటెన్యూలకు, ఖైదీలకూ, బాహ్య ప్రపంచంతో సంబంధాలు తెంచివేస్తూ 'సుదీర్ఘమైన గోడ'. దీర్ఘ చతురస్రాకారంలో ఉంది. ఆగోడ మధ్యలో ఉన్నతమైన ముఖద్వారం. ఆ ముఖద్వారానికి కాపలాకాస్తూ అటూ ఇటూ సాయుధులైన పోలీసులు.

రాజ ఠీవిని ఒలకపోస్తూ ఆకాశంలో చొచ్చుకుపోయిన ఆముఖద్వారానికి రెండు పెద్దతలుపులు. ముదురు పచ్చ రంగు పూయ బడిన తలుపులు శాశ్వతంగా మూయబడి ఉంటాయి. ఆ తలుపు రెక్కలలో ఒకదానిలో మనిషి దూరటానికి వీలుగా ఒకరంధ్రం. మనుషుల రాకపోకలు ఆ రంధ్రం ద్వారా జరగాలి.

ఆరోజు ఉదయం — ఖైదీలు, డిటెన్యూలు, ఆరంధ్రంలోదూరి జైలు బయటికి పోతున్నారు— సూదిలో దారంలా. టైం—ఎనిమిదిన్నర గంటలు.

ఆముఖద్వారం లోపలివైపు 'పోర్టికో'లో కొందరు డిటెన్యూలు, పైజమా జేబులు, లాల్చీల జేబులు బయటికి లాగిలాగి, పోలీసులకు చూపెడుతున్నారు. పోలీసులు బయటికి వెళుతున్న డిటెన్యూలను 'చెక్' చేస్తున్నారు. ఖాళీజేబులున్న డిటెన్యూలను రంధ్రంలో దూరటానికి అనుమతిస్తు



న్నారు.

జట్లు — జట్లుగా బయటికిపోతున్నారు. 'స్క్రీటనీ' కోసమై చివరి జట్టులో 'గంగన్న—రవి' నిలబడి ఉన్నారు.

"రహస్యమైన పత్రాలుకానీ, ఉత్తరాలు కానీ, ఏమీ లేవు లేవయ్యా!.... చూసుకో".... అంటూ రవి చేతులు పైకెత్తాడు హేండ్స్ అప్ పొజిషన్‌లో.

"ఏమోసార్.... మిమ్మల్ని నమ్మిందెవరు—ఏదైనా జరిగిందంటే మాపెళ్ళాం పిల్లల నోట్లో మన్ను బడుతుంది"........ నడుంమట్టూ, వీపుమట్టూ తట్టిచూస్తూన్న కానిస్టేబుల్ అన్నాడు.

స్క్రీటనీ అయిపోయి సందులోనుండి బయటికి వెళ్ళిన డాక్టర్ లోకనాథ్ గారు మళ్ళీ లోనికొచ్చాడు. వాంతి చేసుకోబోతున్నట్టుగా ముఖం పెట్టుకొని తల వాల్చుకున్నాడు.

"ఏమిటీ సంగతి....యం—జి—యమ్ లిస్టులో మీపేరు లేదా?" గంగన్న ఆతురతతో అడిగాడు.

"నాపేరుంది!....కానీ సంకెళ్ళు వేస్తున్నారు చేతులకు....ఇంత బ్రతుకు బ్రతికి ఈసంకెళ్ళు వేయించుకోవటం నాకు ష్టంకి లేదు'"

"అవసరం మనది.... ఏం చేస్తాం?........



## నిష్క్రమణ

**నిన్నటితో ముగిసిన తీర్పు**
**కాలమైందని గంట మోగగానే**
**జీవితకాలం తెరిచున్న తలుపుల్ని**
**మూసేసింది నే వెళ్ళగానే ....**

**టి. లలితా ప్రసాద్**

సంకెళ్ళు ఎందుకు వేస్తున్నారంటే జవాబు చెప్పే నాధుడెవడు? ... మనం కూడా నేరస్థులమనే వాళ్ళ భావన"..

"ఏమో నేనురాను.... 'పెరోల్' దొరికి బయటి కొచ్చేవరకు జైల్లోనే ఉంటాను" లోపలికెళ్ళిపోయాడు డాక్టర్ లోకనాథం.

"వరిగ ఏరుకోటానికొచ్చిన వశేల్ బిడ్డ నందట ఎనకటికొక పోరి... అట్టుంది మన డాక్టర్ సాబ్ యవ్వారం... జైలుకొచ్చి నాక అన్ని బాధలూ పడాలి....... మనం ఎవనిమీద అలిగిపోయినా అడిగే గాడిద కొడు కెవ్వడయ్యా రవీ ..."

రవి సమాధానం చెప్పలేదు. ఇబ్బందిగా ముఖం పెట్టుకొని కదలకుండ అలాగే నిల బడ్డాడు.

జేబుల తనిఖీ కార్యక్రమం ముగించి బయటికి వెళ్ళటానికి అనుమతించాడు డిప్యూటీ జెయిలర్.

గంగన్నా... నేనుకూడా లోనికెళతా! ఈసంకెళ్ళు వేయించుకోవడం నాకుకూడా మంచిగా అనిపించటంలేదు. .... ఛఫ్... నాన్సెన్స్.. మనం దొంగలమా! ఖూనీ కోరులమా?.... జైల్లో పెట్టారు సరిపో యింది. సంకెళ్ళు వెయ్యటానికి మనం చేసిన నేర మేమిటి?... నో-నో గంగన్నా. ....ఇంతకన్నా మరో పరాభవం లేదు. మనం అందరం కలిసి ఇప్పుడే ఇక్కడే దీన్ని ప్రొటెస్ట్ చెయ్యాలి....యం.జి.యమ్ కు పోమని ఈ పోర్టికోలోనే సత్యాగ్రహం చేద్దాం"... రవి కళ్ళలో తిరుగుబాటు కిరణం. ఆకళ్ళు ఎదుటి వ్యక్తి సహకారం అర్థిస్తున్నాయి.

"అవన్నీ ఈరోజు కుదరవురా—వోళ్ళకు, పత్రికలకు, ఫండమెంటల్ రైట్స్‌కి అన్నిటికీ సంకెళ్ళు ఒడ్డాయి. . ఈ చేతులకు సంకెళ్ళు వేయించుకోవటం చిన్నవిషయం ఛలో నడువ్ ...అక్కడ నీ భార్య, అమ్మ యం జి.యమ్ లో ఎదురుచూస్తూంటారు ఈపంచాయితీఇంకొకరోజుపెట్టకుదాం రా! —రోజులు మనవికావు"... గంగన్న రవి భుజాలు పట్టుకొని ముందుకు నడిచాడు.

ఇనప జల్లెడలున్న బ్లూ కలర్ పోలీసు వ్యాన్లు బయలు దేరటానికి సిద్ధంగా ఉన్నాయి. ముందు వెళ్ళిన డిటెన్యూలు ఖైదీలు వాటిల్లో కూర్చుని ఉన్నారు. ఒకవ్యాన్‌కు తలుపులు బిగించి ఉన్నాయి రెండవవ్యాన్ ప్రక్కనే సాయుధులైన రిజర్వు పోలీసులు బేడీలు పట్టుకొని నిల బడ్డారు.

రవి మెయిన్‌గేటు ముందు నిలబడి పరీక్షగా చూశాడు.

ఆరు బయట ప్రపంచం.—తార్రోడు. పై జారిపొయ్యే కార్లు — రిక్షాలు, సైకిళ్ళు. ఒక దాని వెంట ఒకటి పోతు న్నాయి. మనుషుల అరుపులు, మానవ జీవితపు సామూహిక కదలిక, జీవంతో తొణికిసలాడే బాహ్య ప్రపంచం.

అనిర్వచనీయమైన ఆనందం కలిగింది ఒక్క క్షణం.

"రండి రండి.... మీకోసమే ఇంత ఆలస్యమైంది—ఇక్కడే తొమ్మిదయింది" .. గోపాలాచార్యులు అప్యాయత నిండిన కంఠంతో "రవి" అని పిలిచాడు. వెనుక తలుపులు తెరచి ఉంచిన పోలీసు వ్యాన్ ప్రక్కనే గోపాలాచార్యులు నిలబడి ఉన్నాడు. అతను డెబ్భయి సంవత్సరాల వృద్ధుడు. తల పూర్తిగా నెరిసిపోయింది. ఆయుర్వేద వైద్యం చదివి, వరంగల్‌లో




జీవితం గడుపుతుండేవాడు. సత్యాగ్రహం, నిరసన వ్రతం మొదలైన అహింసా పద్ధతులద్వారా నియంతృత్వాన్ని ఎదిరించి జైల్లో అడుగుపెట్టాడు.

అతని కుడిచేతికి బేడీలు తగిలించి ఉన్నాయి—ఒకరింగు, రెండవరింగు బేడీలు రవి ఎడమచేతిని అలంకరించటానికి సిద్ధంగా ఉన్నాయి.

ఇద్దరిద్దరికి కలిపి బేడీలు వేసే పద్ధతి. ఉదయ సూర్యుని కాంతులు రావి చెట్ల సందుల్లోనుండి దూసుకొచ్చి బేడీలపై బడి తళుక్కు తళుక్కున మెరుస్తున్నాయి. డిటెన్యూల పట్ల, పాలక వర్గాల పరిహాస భావానికి, ఎగతాళిగా వాటికి సంకేతంగా ఉన్నాయి అవి.

రవి వ్యాన్ చెంతకు నడిచాడు.

జీవితంలో మొదటి సారిగా సంకెళ్ళు వేయించుకోబోతున్న క్షణం. దొంగలకూ హంతకులకూ, సంఘవిద్రోహులకూ, ఉద్దేశించబడిన సంకెళ్ళు తన చేతులకు చుట్టుకోబోతూన్న సమయం. గుండెల్లో పొడిచినట్లుగా అనుభూతి. ఆ అవమానానికి తల ఒగ్గక డాక్టర్ లోకనాథంలా తిరిగి లోని కెళ్ళాలనిపించింది.

మెరుస్తూన్న ఇనప సంకెళ్ళను ప్రత్యక్షంగా చూస్తూన్న అతని కళ్ళలో నిప్పులు రాజుకోసాగాయి. లాల్చీ జేబుల్లో ఉన్న తన చేతులు పిడికిళ్ళు బిగించసాగాయి.

"కామ్రేడ్ తొందరగా పనికానివ్వు.... ఎందుకంతగా 'ఫీ'లవుతున్నావ్. నీకు అంత సెంటిమెంటల్ ఫీలింగ్ పనికిరాదు టేకిట్ ఈజీ—రెండురోజులు పోతే అంతా అలవాటయి పోతుంది ..సంకెళ్ళు, పోలీసులూ మనజీవితంలో ఒకభాగం. ఉద్యమ నిర్వాహకులుగా మనం ఎన్నో పరాభవాలకు, అన్యాయాలకు గురికావాలి ముందు ముందు....చేతులు బయటికి తియ్యి"... అనునయించ సాగాడు గంగన్న.

పెద్దపులిలాంటి ముఖం.

ఎర్రగా ఎత్తుగా నిండైన విగ్రహం గంగన్నది. ఒకచేతికి బేడీలు తగిలించుకొని, మరోక చేతిలో తన గుబురు మీసాలు దువ్వుకుంటూ ఫ్రంట్‌సీటు వద్ద నిలబడిన రిజర్వ్ యస్.ఐ.తో నిర్వికారంగా

మాట్లాడుతున్నాడు—సంకెళ్ళు తగిలించారన్న స్పృహాలేకుండా —

రవి అనాలోచితంగా ఒక్కడుగు ముందుకు వేశాడు — తన ఎడమచేతిని ఎయటికి తీసి. కానిస్టేబుల్ చేతిని పైకెత్తి ముంజేతికి కంకణం తొడిగాడు· స్ప్రింగ్ లిప్పి తాళం వేశాడు బేడీలకు. సంకెళ్ళు ఊహించినంత, పైకి కనిపించినంత, తలిగ్గా లేవు. ఎంతో బరువుగా ఉన్నాయి. ఇనుప ముద్ద చేతికి వ్రేలాడుతున్నట్లు చెయ్యి కృంగిపోసాగింది. ఎవరితోనూ మాట్లాడక, ఎవరి ముఖాల్లోకి చూడక మౌనంగా వ్యాన్‌లోకి ఎక్కి బరువైన తన ఎడమ చేతిని మోకాలిపై పెట్టుకున్నాడు.

రవి చెట్ల నీడలను దాటిన 'బ్లూవాన్' యం. జి. యమ్ ముందుకొచ్చింది. యం జి. యమ్. మహాత్మాగాంధీ మెమోరియల్ హాస్పిటల్ లోనికెళ్ళి 'పోర్టికో' లో ఆగింది.

"అవుట్ పేషంట్స్ స్లిప్స్ తీసికొస్తాను ఎవ్వరినీ దిగనివ్వవద్దు" అంటూ ఫ్రంట్ సీటులోనుండి దిగిన యస్. ఐ. కానిస్టెబుల్ అవుట్ పేషంట్ బ్లాక్ వైపు నడిచాడు.

ఇనప జల్లెడ చదరాలలో ఒక చదరంలో కన్నుపెట్టి రవి ఒ. పి. వార్డ్ కేసి చూడసాగాడు.

ఒ.పి. వార్డ్ ముందు గుంపులు గుంపులుగా జనం—సినిమా హాలువద్ద కొత్తసినిమా మొదటిరోజున టిక్కెట్లకోసం తొక్కిసలాడినట్లు తొక్కిసలాట. వాళ్ళమధ్య లాటీలు ఆడుతున్నాయి. ఆడవాళ్ళను, మగవాళ్ళను క్యూలో నిలబెట్టటానికి ప్రయత్నిస్తున్నారు యూనిఫారాల్లో ఉన్న వార్డ్ బోయ్‌లు—ఎర్రటోపీలు – పోలీసులు—ఎక్కడ చూసినా పోలీసులు ఆస్పత్రి వద్ద పోలీసులు, సినిమా హాల్స్‌వద్ద పోలీసులు, రైల్వేస్టేషన్స్‌లో పోలీసులు, భారతదేశమంతా పోలీసు యూనీఫారాలు, ...ప్రతి ఫిఫ్త్ మాన్ ఈజ్ ఎ పోలీస్‌మాన్ ఇన్ మై మదర్ లాండ్........"

రవి అనుకున్నాడు.

"నీ మీద మన్నుబడ ముదనష్టపోడా ....ఎంత దెబ్బకొడితివిరా!" లాటీ దెబ్బ తిన్న నడివయస్సు స్త్రీ ఎవరినో తిట్టుకుంటూ వాన్ ప్రక్కగా నడిచిపోతోంది.

"ఆవిడను ఎందుకు కొట్టావని"— ఎవరూ అడగలేదు ఆ కానిస్టేబుల్‌ని ఆమె అతని ప్రవర్తనకు నిరసనగా మంచినీళ్ళ కుండ వద్దని ఖాళీ సీసా తీసుకొని వెళుతుంటే అందరూ గారడీ చూస్తున్నట్లు పళ్ళికిలిస్తున్నారు. కర్మభూమి భారత దేశంలో సరాసరి పౌరుల సాంఘిక చైతన్యానికి ప్రతీకలుగా ఉన్నారు అక్కడ పోగయిన జనం.

"మనకు ఇక్కడ ఒక్క గంట, గంటగంటన్నర టైం—అంత....ఈలోగా మన వాళ్ళతో మాట్లాడటం పూర్తి చేసుకోవాలి.

"మా అక్కా బావా వస్తానన్నారివాళ—ఈ జనంలో ఎక్కడున్నారో"... తోటి డిటెన్యూల మాటలు. వాళ్ళ కళ్ళు ఇనప జల్లెడ చతురస్రాకారపు సందుల్లో నుండి వెతుకుతున్నాయి - ఆత్మీయులను, మిత్రులను - వాళ్ళ కళ్ళలో ఆతురత— ఆవేదన

ఆ మాటలు విన్న రవి ఉలిక్కిపడ్డాడు. తన భార్యా పిల్లలూ, తల్లి దండ్రుల కోసం పరీక్షగా చూడసాగాడు. అవుట్ పేషంట్స్ గుంపులో లేరు.

అటు స్కూటర్ స్టాండ్—షెడ్స్‌వైపు లేరు .. లేరు

ఇటు—కత్తిరించిన సరివిచెట్ల నీడన రోడ్ బారుకు. ..లేరు లేరు మరి రోడ్ పైన · రోడ్ . మెయిన్ గేట, రోడ్ పైన చూపులు సారించాడు.

ఆమె ఎవరు? తన భార్య కాత్యాయిని .అవును. మెయిన్ గేటులో రిక్షా దిగింది ఇప్పుడే. ఇంత ఆలస్యం ఎందుకయినట్టు? .. బహుశా బస్ అంది ఉండదు. మన ఊళ్ళో ఎక్స్‌ప్రెస్ బస్సులాగవు. ప్యాసెంజర్ బస్సులు దొరకవు . మనఊరి







నుండి వరంగల్ వచ్చేలోగా, వరంగల్ నుండి హైదరాబాద్ మూడుసార్లు పొయ్యి రావచ్చు. అవును....తను ఒక్కతైన దిగింది ఏం సంగతి? ....పిల్లలేరి? ... వాళ్ళను ఈ సారికి వద్దనుకుందేమో! ....చేతిలో పండ్ల బుట్ట ఎందుకు? —తనకు ఏ రోగమొచ్చిందని. ....ఛాదస్తపు మనుషులు—రానివ్ చెప్తా ....బుట్ట ఊపుకొంటూ నడుస్తోంది. గబగబా నడుస్తోంది, టైం అయిపోతుందని పాపం ....అరెరే ....చీర కాళ్ళకు అడ్డంబడి ముందుకు తూలింది. పండ్ల బుట్టలో పండ్లు దొర్లిపోతున్నాయి. పసుపు రంగు బత్తాయిలు బంతుల్లా పరుగెడుతున్నాయి. సిగ్గుపడిపోయి గబగబా ఏరుకొంటోంది. మొత్తం నాలుగే కిందబడినట్లున్నాయి ....వస్తోంది....వస్తోంది."

సూర్యరశ్మి సోకి ముఖం తళుక్కు తళుక్కున మెరిసి కోణాలు, కోణాలుగా కనిపిస్తోంది ఆమె ముఖం-రవికి—ప్రిజమ్ నుండి చూసినట్లుగా.

ఆమె ఎవరు? ....ఎవరు? ....ఆమె తన భార్యకాదు. కాత్యాయినికాదు. భార్యలా కనిపించి భ్రమ గొలిపిన మరొక మనిషి.

....ఛి ఛి త కాళ్ళు సరిగా పనిచెయ్యట్లేదు. [illegible] కెక్కిన పిదప మనస్సుతో పాటు అన్ని అంగాలు దెబ్బ తిన్నట్టున్నాయి.

ఆ తరువాత ఇద్దరు ముగ్గురు స్త్రీలు—నడుంతో ఒకరు, చీరెరంగుతో ఒకరు, వెనుకభాగంతో మరొకరు తనకు భ్రమ కలిపించి వార్డ్సలోకి వెళ్ళిపోయారు.

అవుట్ పేషంట్ స్లిప్స్ వచ్చాయి.

సంకెళ్ళ గలగలలు - గ్రీసులేని సీట్ల కిర్రు కిర్రు కదలికలు. డిటెన్యూలు దిగారు. జంట జంటలుగా.

రవి దిగాడు సిగ్గుపడుతూ. ముంజేతి కున్న బేడీలు కనబడకుండ తన చేతిని గోపాలాచార్యులకు ఆన్చి లాల్చీనిండుగా కప్పుకున్నాడు. డిటెన్యూల వెనుక పోలీసులు. బందూకి మడిమలు క్రిందకు దించి బారల్స్ గాలిలోకి ఎత్తిపట్టి నిలబడ్డారు.

సబ్ ఇన్స్పెక్టర్ కదిలాడు.

సంకెళ్ళతో బంధింపబడిన డిటెన్యూలు 'సైయిర్ కేస్' పైకి ఎక్కిపోసాగారు—ట్రెయిలర్ బస్సుల్లా. జంటలు-జంటలుగా పైకి పొయ్యారు. వాళ్ళ వెనుక సాయుధ



ప్రధాన మంత్రి
శ్రీమతి ఇందిరాగాంధీ



ముఖ్యమంత్రి
శ్రీ టి. అంజయ్య

# రైతులకేమో ఎక్కువ లాభం
# మీకూ, నాకూ మరింత లాభం

మన రాష్ట్రంలో జీవ నదులున్నాయి సిరులు పండే భూములున్నాయి కష్టించి పని చేసే రైతు బిడ్డలున్నారు వీటన్నిటినీ సమన్వయ పరిచి ప్రభుత్వం వివిధ పథకాలు అమలు చేస్తోంది

ఆయకట్టు ప్రాంతాల అభివృద్ధిని చేపట్టడం ద్వారా వ్యవసాయం ఆధునికం చేయబడుతోంది. నాగార్జున సాగర్ కుడికాల్వ, నాగార్జున సాగర్ ఎడమ కాల్వ శ్రీరాం సాగర్, తుంగభద్ర సముదాయం-ఈ నాలుగు ఆయకట్టు ప్రాంతాలు అభివృద్ధి చేస్తున్నారు.

వంతుల వారీగా నీటిని సరఫరా చేసే వరబంది విధానం రైతుల ఆదరణ పొందుతోంది.

❋ పొలాలకు కాల్వల ఏర్పాటు.

❋ క్రమబద్ధంగా భూమిని అభివృద్ధి పర్చడం.

❋ రైతులకు పరపతి సౌకర్యాల కల్పన.

❋ సమగ్ర వ్యవసాయ విస్తరణ కార్యక్రమం.

పథకాలు అమలు జరిపేందుకు 1981-82 సం.లో రూ. 897 లక్షలు ఖర్చు చేస్తున్నారు. ఈనాడు అధికంగా ఆహార ధాన్యాలు, వాణిజ్య పంటలు పండిస్తున్నారు.

రైతుల ఆనందమే మనకు ఆనందం

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.
నెం : 29

రిజర్వు సిబ్బంది, మిలిటరీ బూట్ల తాకిడితో స్టెయిర్ కేస్ టక్, టక్ మని ప్రతిధ్వనించ సాగింది. సామాన్య జనానికి భీతి గొలిపే ఎట్మాస్ఫియర్ సృష్టించారు రిజర్వు పోలీసులు. వాళ్ళకు ఎదురుగా తిగుతున్న మనుషులు ఎటువాళ్ళు అటు ప్రక్కకు తప్పుకున్నారు ఆ జనంలో తన భార్య లేదు.

హాస్పటల్ సూపరింటెండెంట్ గదిలో హాజరుపరిచారు యస్. ఐ.-డి ఆర్ న్యూలను. అవుట్ పేషంట్స్ స్లిప్పులు సూపరింటెండెంట్ టేబుల్ పైన పెట్టి సంతకాలు పెట్టించాడు. రవి తనముందేతిని చూసుకొన్నాడు వాత పడింది. గాలి ఆడక చెమటతో తడిసి తెల్లగా ఉంది. హాండ్ కర్చీఫ్‌తో దానిని తుడుచుకున్నాడు.

"ఛలోస్సాబ్" అవుట్ పేషంట స్లిప్‌ను ఒకచేతిలో, మరొక చేతిలో బేడీలు పట్టుకొన్న కానిస్టేబుల్ రవిని హెచ్చరించాడు. కంటి విభాగం వైపు నడుస్తూన్న కానిస్టెబుల్‌ను రవి అనుసరించాడు.

వరసగా అటూ ఇటూ ఉన్న గదులలో మధ్య సన్నని ఇరుకు వరండా.

వెలుతురు ప్రవేశించే వీలులేక వరండా చీకటిగా ఉంది.

"కన్ను-విభాగం"—బాణం గుర్తుతో చిన్న సైన్‌బోర్డు. ఆసైన్‌బోర్డు ప్రక్కన ఆ మూలలో బెంచి. ఆ బెంచిపై రోగులు—స్త్రీలు, పురుషులు. వాళ్ళందరూ కళ్ళలో 'డ్రాప్స్' వేయించుకుని కళ్ళు మూసుకొని జపం చేస్తున్నారు - సీలింగ్ కేసి ముఖాలు ఎత్తి పట్టుకొని. ఆబెంచి మూలన కళ్ళలో మందు వేయించుకొని రెండుకళ్ళు ఆ చీకటిని గెల్చుకొని మెరుస్తున్నాయి, రేడియమ్ కళ్ళల్లా.. .ఎవరామె ? ... తన భార్య . కాత్యాయిని.

తను కనిపించిన వెంటనే తనభార్య కళ్ళలో తళుక్కుమని మెరుపు మెరవలేదు ఇన్నాళ్ళలా తన 'ఇమేజ్' ఆమె కళ్ళను ఆకట్టుకోలేదు. పోస్ట్‌మార్టం గదిలో దాచబడిన శవాన్ని చూడటానికొచ్చిన బంధువులా, దూరంగా నిలబడి భయం భయంగా చూస్తోంది, పోలీసునూ, తననూ కలిపి. చూపులు మార్చి మార్చి, చూస్తోంది అనుమానంగా.

నిర్లిప్తంగా, అర్థంలేని చూపులు.

నిస్పృహతో ఆరిపోయిన కళ్ళు.

అతనికి భార్యను ఎలా పల్కరించాలో అర్థంకాలేదు. తను ఏం మాట్లాడాలో తోచలేదు. ఎదురెదురుగా నిలబడి ఒకరి నొకరు చూసుకోవటం మినహా ఏమీ మాట్లాడుకోలేక పొయ్యారు. ఆమె చెంపల పైకన్నీళ్ళు జారి పమిట పైబడి ఇంకిపో సాగాయి.

"లోనికి వదండి .సార్" కానిస్టేబుల్ హెచ్చరించాడు.

కానిస్టేబుల్ 'ఐ స్పెషలిస్ట్' ముందు స్లిప్ పెట్టాడు. రవిని లోపలి విభాగంలోకి వెళ్ళమని డాక్టర్ వేలు చూపించాడు. ఆమె భర్తను అనుసరించి లోనికి అడుగు పెట్టబోయింది. "వద్దమ్మా-మీరు మాట్లాడుకోవటం అమీన్‌సాబ్ చూస్తే....నాకు మాట వస్తుంది ...మాఫ్ కర్నా. .క్షమించండి...." అన్నాడు కానిస్టేబుల్.

"అయిదు నిముషాలు మాత్రమే. మాట్లాడి వెళ్ళిపోతాను. ప్లీజ్" అంటూ చేతికి ప్రేలాడుతూన్న హేండ్ బ్యాగ్ జిప్‌లాగి రెండు రూపాయల నోటు అతని చేతిలో పెట్టింది.

అతి మెల్లగా జరిగిన సంభాషణ ఒక చెవితోవినిన డాక్టర్ తలఎత్తి కానిస్టేబులు కేసి చూసి. . "ఎక్కువసేపు కూర్చోరులే. లోనికళ్ళనివ్వు" అని చెప్పి ఆమెను లోని కెళ్ళమని సైగచేశాడు. కృతజ్ఞత నిండిన కళ్ళతో ఆమె డాక్టర్‌కు వినయంగా నమస్కరించి లోనికెళ్ళింది. బెంచిపై ప్రక్క ప్రక్కనే కూర్చున్నారు.

"నీ కోసం క్రిందంతా చూశాను."

"ఎందుకు చూశారు? ....'ఐ' సెక్షన్‌కు వస్తానని తిరుపతిరెడ్డిగారితో చెప్పి పంపా

సోకులు అలంకారంగా ఉన్నాయి. "డాక్టర్‌గా సోషల్ స్టేటస్" సంపాదించిన గర్వం వాళ్ళ కళ్ళల్లో, మాటల్లో, కదలికల్లో తొణికిసలాడుతోంది. ....రోగులూ రోగాలూ, హాస్పిటల్ వాళ్ళకొక కామన్ అఫైర్....ఒక రొటీన్ లైఫ్"

"ఆర్ యు మిస్టర్ రవీ—" భుజాల వరకూ జుట్టు కత్తిరించుకొన్న లేడీడాక్టర్ దగ్గరకొచ్చింది.

"యస్. అ....యామ్"....రవి లేచాడు. తన భార్య లేచి ప్రక్కకు తప్పుకొంది. డాక్టర్ జుట్టు భుజాలపై విరబోసుకొంది- ఎర్రరంగు పూసుకొన్న గోళ్ళు-చివరి వేలి గోరు పొడవుగా పెంచుకుంది రవి కళ్ళలో ఆయింట్‌మెంట్ పూసి వెళ్ళిపోయింది.

రవి కళ్ళు మూసుకొని ఆలోచించ సాగాడు.

తనభార్య ఈ నెలా పదిహేను రోజుల్లో ఎంతగానో కృశించి పోయింది. చిక్కిపోయి కొద్దిగా నల్లగా కనిపిస్తోంది. ధైర్యంగా ఉండమనీ—పిల్లల చదువు ఆరోగ్యం జాగ్రత్తగా చూడమని ఎన్నో ఓదార్పు మాటలు చెప్పాలనుకొన్నాడు ...."ఐదునిముషాలు, అయిపోతున్నట్లున్నాయి." అనుకుంటూ అతను కళ్ళు తెరిచాడు.

"మండుతున్నాయా కళ్ళు"....ఆమె అడిగింది.

"లేదులే కూర్చో....ఇటు"....కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకో సాగాడు.

ఆమె కూర్చోలేదు-గోడకానుకొని నిలబడి పరిశీలనగా చూడసాగింది భర్తకేసి.

"పిల్లల్నెవర్నీ తీసుకురాకుండా ఒక్కర్తెవే వచ్చావ్? .... పిల్లలెలా ఉన్నారు. బాబు మళ్ళీ బడి ఎగ్గొట్టి తిరుగుతున్నాడా?"....

"పిల్లలేమయితే మీకెందుకూ — బాబు ఏమైతే మీకెందుకు? కానీ....ఎన్నాళ్ళుండదలుచుకొన్నారు మీరు ఈజైల్లో"....

"వాళ్ళు విడిచిపెట్టే వరకూ?"....

ఆమె అతనికి దగ్గరగా వచ్చి నిలబడి బ్రతిమలాడసాగింది. "నేను చెప్పేది వినండి- మనకు ముగ్గురాడపిల్లలున్నారు—వాళ్ళకు పెళ్ళిళ్ళు.కట్నాలు ఎన్నో బరువులున్నాయి మీరు దేశం, దేశం అంటూ జైలుపాలయి పోతిరి ఇంటి వద్ద మా బాగోగులు చూసే వాళ్ళు కూడా ఉండాలికదా? నేను చెప్పినట్లు వినండి. ఈ రాజకీయాలకు దూరంగా ఉంటానని హామీ పత్రం వ్రాసిస్తే మీ దోస్తులు రమణా రెడ్డి, వాసూ, వాళ్ళంతా మీ విడుదలకు ప్రయత్నం చేస్తారట....కావాలంటే మీ పార్టీ వాళ్ళకు డొనేషన్ ఇస్తూ ఉందాం"....

"ఇదిగో నేను లోగడ చెప్పిందే మళ్ళీ చెబుతున్నా ... అటువంటి పత్రాలూ గిత్రాలూ ఏమీ రాసివ్వను....ఇది మనకు పరీక్షా సమయం. జైల్లోఉండటాని కష్టాలు అనుభవించటానికి మనం వెనుకాడకూడదు. ఏరకమైన త్యాగానికైనా మనం వెను తియ్యకూడదు....ఎవరో త్యాగంచెయ్యాలి ఆ త్యాగఫలితం మనం అనుభవించాలను కోవటంకన్న తుచ్ఛమైన విషయం మరొకటి లేదు........పిల్లల పెళ్ళిళ్ళు...కట్నాలు ....డబ్బు సంపాదించటం, నిలవచెయ్యటం, దానితో అల్లుడుగాళ్ళను కొనటం....వ్యక్తి ఆస్తి ఉన్న ఈవ్యవస్థలో ప్రతివ్యక్తీ సెక్యూరిటీ కోసం ప్రాకులాడతాడు....అందుకని మనం ఈవ్యవస్థను మార్చటానికి ప్రయత్నం చెయ్యాలి....సరేలే-ఇప్పుడా విషయాలేమీ మాట్లాడకు...." ఆవేశం ప్రతిధ్వనించింది అతని కంఠంలో. భార్యకేసి సీరియస్‌గా చూశాడు.

"ఉ....అంతే కోపం.... ఉద్యమాలలో ఊరేగదలచుకున్న వారు మరి పెళ్ళెందుకు చేసుకున్నారు?"....

"పెళ్ళి చేసుకోలేదు....చేశారు"....

"తాళికూడా వాళ్ళే కట్టారా;"....ఆమె రెట్టించింది.

రవి అసహనంగా భార్యకేసి చూసి, తమ సంభాషణ ఎవరైనా వింటున్నారేమోనని తొట్రుపాటుగా అటూఇటూ చూశాడు.

డాక్టర్ కుర్చీ పట్టుకొని దాని వెనుక నిలబడ్డాడు. హౌస్ సర్జన్స్. వాళ్ళు తమ కేసి చూస్తూన్నారు. బందూక్ పట్టిన కాని స్టేబుల్ చేతి క్రిందుగా వాళ్ళ చూపులు ఎక్వేరియమ్‌లో రంగు చేపల్ని చూసినట్లు తననూ తన భార్యనూ చూస్తున్నారు.

ఆమెతో సంభాషణ మార్చాలన్న ఉద్దేశ్యంతో రవి అడిగాడు.

"మా అమ్మా బాబూ రాలేదా?"

"వచ్చారు అందరం ఒక్కసారే వస్తే కానిస్టేబుల్ రానివ్వడని అక్కడక్కడ వార్డ్ మూలల్లో నిలబడి మిమ్మల్ని చూస్తూన్నారు ఇప్పటి వరకూ. . అరుగో" అంటూ వేలు చూపించింది.

అతను తల పైకెత్తి తలుపుకు ఎదురుగా నిలబడ్డ మనుషుల కేసి చూశాడు. కంటి రోగు , ముసలీ ముతకా, కళ్ళపై గుడ్డ పట్టీలు. వాళ్ళకు ఆసరాగా వాళ్ళ బంధువులు వాళ్ళముందు తెల్ల యూనిఫామ్ వార్డ్ బోయ్‌లు. అందరి వెనుకా తల్లి దండ్రుల ముఖాలు — తలలు మాత్రమే కనిపిస్తున్నాయి నిశ్చలంగా. పాత ఫొటోలో వెనుక వరసలో బెంచీలపై నిలబడిన అభాగ్యుల్లా ఉన్నారు మెడలు రిక్కించి.

"బూ...." పిలిచి చెయ్యి ఊపాడు రవి తెచ్చిపెట్టు న్న చిరునవ్వుతో. తల్లి దండ్రులు ప్రతి చిరునవ్వు నవ్వలేదు. వాళ్ళిద్దరూ యాంత్రికంగా చేతులూపారు.

తనకు జైల్లో అన్ని సౌకర్యాలున్నాయనీ తిండి విషయంలో ఏ లోపమూ లేదని చెప్పి వాళ్ళను ఓదార్చాలను కున్నాడు. కానీ వరండాలోకి నడవటానికి కానిస్టేబుల్ అనుమతించడని ఆలోచన మానుకున్నాడు.

"ఈ నెలరోజులనుంచీ ఒక్క ఉత్తరమైనా వ్రాయకూడదా? —ఫలానా జైల్లో ఉంచారని. మీ అమ్మ నాన్న ఎంత కంగారు పడిపోతున్నారో ఆలోచించారా? మొన్న పదరోజులనాడు మీ బాబు అర్ధరాత్రి లేచి "రవీ....బిడ్డా... వచ్చావా?" అంటూ పెద్దగా కేకవేసి తలుపుతీశాడు.

మేమంతా లేచాం. తీరా చూస్తే ఎవ్వరూ లేరు. అంతా చీకటి. ఏమిటి మామయ్యా! ఎందుకు పిలిచారని" అడిగితే. . "వాడు వచ్చి పిలిచినట్లు తలుపు. కొట్టినట్లు వినిపించిందమ్మా" అన్నాడు. పాపం వాళ్ళ కోసమైనా ఒక్క ఉత్తరం . " మాట్లు పూరించలేక ఆమె కళ్ళల్లో నీళ్ళు ఒత్తుకోసాగింది.

పితృ వాత్సల్యంతో తన తండ్రి సంధి పుట్టిన రోగిలా, తనకోసమై కలవరించి అర్థ రాత్రి తన కోసమై కేకలు వేయటాన్ని తలచుకొని ఆతని శరీరం చల్లబడిపోయింది నరాలు బిగుసుకుపోయి శరీరం మొద్దుబారి పోయింది. దుఃఖంతో ముఖం పాలిపోయింది.

తన భార్య ఆ ముఖాన్ని చూడకుండా లేచి కిటికీ వద్ద నిలబడి వార్డ్సులోకి చూడసాగాడు.

హాస్పిటలంతా ఏదో దిగులు పుట్టించే వాసన. ఫినాయిల్‌తో కడిగిన వరండాల నుండి మందువాసనలు. తెల్లరంగు పూసిన రెండు చక్రాలకుర్చీలు, ఆ మూలన డస్ట్ బిన్, డస్ట్‌బిన్‌లో దూది చుట్టిన పుల్లలు, రక్తపు మరకలతో నిండిన గాజు గుడ్డలు, గాజు కిటికీల అవతల ఎర్రదుప్పట్లు పరచిన ఇనుపమంచాలు, వాటిపైన రోగులు ఆరిపోయిన కనుగుడ్లతో. ఎడ్మిషన్ దొరకని రోగులు ఇద్దరు మూల్గుతున్నారు. వరండా మూలల్లో దుఃఖంతో కూడిన వాతావరణం జైలు [illegible] ఎక్కువ వైరాశ్యం గూడు కట్టుకొని ఉంది.

"ఉత్తరం వ్రాయకుండ మిమ్మల్ని మరింత ఏడిపించాలని నాకేమీ లేదు. ఇదిగో డిటెన్యూలు ఉత్తరాలు రాయట్టానికి గూడా ఒక పద్ధతి ప్రవేశ పెట్టారు. గవర్నమెంటు. డిటెన్యూలు వ్రాయదలచుకొన్న వారి పేర్లనూ, డిటెన్యూలకూ వారికీ ఉన్న బంధుత్వాన్ని పేర్కొంటూ జైలు అధికారులకు దరఖాస్తు ఇవ్వాలి. దానిని ఆయా జిల్లాల పోలీసు సూపరింటెండెంట్ బంధుత్వాన్ని సర్టిఫై చెయ్యాలి....... .. ... అంటే నువ్వు నా భార్యవేనని పోలీసు "సూపరింటెండెంట్" అంటే తప్ప నీవు నా భార్యవు కాదన్న మాట"...నిట్టూరుస్తూ అతను కిటికీనుండి అతలికి చూడసాగాడు

"అయితే ఉత్తరాలు వ్రాయటానికి కూడా పెద్ద ప్రొసీజర్ ఉన్నదన్న మాట"

"అవును. ఈ ప్రొసీజర్ పూర్తయ్యే వరకూ నేను మీకు ఉత్తరాలు వ్రాయటం కానీ, మిమల్ని జైలుకు పిలిపించుకోవటంకానీ జరగవు—అన్నిటికీ పోలీసోళ్ళ పర్మిషన్ అడిగే రోజులొచ్చాయి . . ఏం జేస్తాం"..

రవికీ తన భార్యకూ మధ్య దుర్భేద్యమైన స్తబ్ధత—ఊపిరాడని నిశ్శబ్దం. పెదవులపై సుడిగుండాలున్నట్టు మాటలు చిక్కుబడిపోయి గిర్రుగిర్రున తిరుగుతున్నాయి. కానిస్టేబుల్ "చలో. సాబ్... మనమే లాస్ట్ అందరూ వెళ్ళిపొయ్యారు...." అన్నాడు అప్పటివరకూ చేతిలో వ్రేలాడుతున్న సంకెళ్ళు రవి ముంజేతికి వేసి, స్క్రూతిప్పి తాళం జేబులో వేసుకొన్నాడు. ఇనప గొలుసు చివరను చేతిలోకి తీసికొని కానిస్టేబుల్ ముందుకు అడుగువేశాడు. అతనిని అనుసరిస్తూ రవి కాలు కదిపాడు.

ఆమె నిర్ఘాంత పోయింది. కళ్ళు విప్పార్చుకని తన కళ్ళముందు జరిగిన విషయాన్ని పిచ్చిదానిలా చూసింది. ఆవిడ అరచేతులు చెమటలతో ముద్దగా తడిసి పోయి, వశం తప్పి పోసాగాయి.

బేడీలు — బేడీలు - బేడీలు ... తనభర్త చేతికి బేడీలు—తనభర్త చేతికి బేడీలు పడతాయని ఆమె ఎన్నడూ ఊహించలేదు. ఎంత అవమానం...ఎంత అవమానం"....

అవమాన భారంతో ఆమె మనస్సు విలవిల లాడిపోయింది. అప్పటివరకూ ఆమె కళ్ళలో వలయాలుగా తిరుగుతున్న కన్నీళ్ళు అంతరించి పోయాయి.

క్రోధాగ్నితో కళ్ళు భగ్గున మండిపోయాయి.

"ఏయ్ ?....ఏం చేస్తున్నావ్ నువ్వు.... ఏ దొంగతనం చేశారని, ఏ హత్య చేశారని ఏ దోపిడీ చేశారని—సంకెళ్ళు వేశావ్ వారికి నువ్వు....తీసెయ్యి .... వాటిని తీసెయ్యి ముందు ప్లీజ్....సంకెళ్ళు వేసిన మీ చేతులు చూపెట్టటానికా మీరు నన్ను రమ్మన్నారీ రోజు... తీసెయ్యండి .... ఆ సంకెళ్ళు పీకేయ్యండి....ఎందుకు వేయించుకున్నారీ సంకెళ్ళు"....పెద్దగా అరవసాగింది.

ఆమె మృదువైన కంఠంపై నీలిమ రంగు రక్తనాళాలు ఉబ్బసాగాయి. ఒణుకుతూన్న ఆమె కాళ్ళూ చేతులూ పట్టుతప్పిపోసాగాయి. 'హాస్పిటల్' అన్న విచక్షణ కోల్పోయి ఆమె బిగ్గరగా కేకలువేసి తూలి ముందుకు పడిపోయింది. ఆమె ఆకస్మిక ఉద్రేకాన్ని అరుపులను వింటున్న లేడీ హౌస్ సర్జన్లు ఆమెను పొదివి పట్టుకొన్నారు.

"మీరు నడవండిసార్...."కంగారు పడుతున్న కానిస్టేబుల్ 'రవి'ని హెచ్చరిస్తూ చేతిలో గొలుసు లాగాడు. రవి అతనిని అనుసరించాడు. స్టెయిర్ కేస్ దిగి పోర్టికోలో నిలబడ్డారు. పోలీసు వ్యానులో కూర్చున్నారు డిటెన్యూలు. ఇంకా ఒకళ్ళిద్దరు డిటెన్యూలు రావల్సిఉంది. పోలీసు సబిన్స్పెక్టర్ తొందరపెడుతున్నాడు.

ఏడుపులు—గొల్లున ఏడుపులు.

ఎవరో గర్భిణీస్త్రీ ప్రసవించలేక కన్ను మూసిందట. ఆ శవాన్ని బండిపై పెట్టి నిండా ముసుగుకప్పి తీసుకెళుతున్నారు. ఆ శవంచుట్టూ చేరిన ఆడవాళ్ళు గుండెలు పగిలేలా ఏడుస్తున్నారు. వాళ్ళ వెనుక నడుస్తున్న మగవాళ్ళు ముక్కులు చీదుకుంటూ, దిక్కులు చూస్తూ దుఃఖాన్ని దిగమింగటానికి ప్రయత్నిస్తున్నారు. హాస్పిటల్ ఆవరణలో ఉన్న ప్రజలు వాళ్ళను నిర్లిప్తంగా చూస్తూ నడుస్తున్నారు.

ఎవరి బ్రతుకులు వాళ్ళవి.

ఎవరి దుఃఖం - వారిది - ఎవరి సమస్యలు వారివి.

---

**నాగార్జున ప్రొడక్షన్ "పక్కింటి అమ్మాయి" ప్రారంభ సందర్భంలో పూర్ణావిశ్వనాధ్, ఆదిశేషగిరిరావు, శోభన్‌బాబు, సత్యనారాయణ, జయసుధ చంద్రమోహన్, దర్శకుడు కె. వాసు, నిర్మాత ఎ. సారధి, ఛాయాగ్రాహకుడు- ఎస్. గోపాలరెడ్డి.**



"అలలు - కలలు - ఎగసి ఎగసి"న "సీతాకోక చిలుక"లా



ఒకరి కన్నీళ్ళు మరొకరు తుడిచే సమాజం కాదిది

వృత్తిరీత్యా రాజకీయ నాయకులు ముగ్గురు —న్యూస్ పేపర్లు గుండ్రంగా చేతిలో పెట్టుకొని, రాజకీయాలు ప్రచారం చేసుకొంటూ మొబైల్ రేడియోల్లా వరండాల్లో నడుస్తూ పోతున్నారు రకరకాల మనుషులు రకరకాలుగా మాట్లాడుకొంటూ హాస్పిటల్లో తిరుగుతున్నారు.

హార్స్ రేసుల్లో, క్రికెట్ ఆట పిచ్చిలో గొంతు వరకూ మునిగిన నాగరికులు— బ్రాకెట్ ఆట మైకంలో, కాటన్ మార్కెట్ కౌగిలిలో చిక్కుకున్న కార్మికులు-బూతు సినిమాల నిషాలో కేరింతలు కొడుతున్న యువకులు ఇంకా ఎన్నో రకాలు మానసిక సుఖ వ్యాధులకు గురై తీవులు తీసుకొంటున్నారు

'తన దేశ ప్రజలు ఎటుపోతున్నారు? రవి అసహనంగా ఆలోచించ సాగాడు

అధికారగర్వం, కులగర్వం, మత మౌఢ్యం, స్వార్థం, మొదలైన నయం కాని "హిస్టీరియా" రోగాలకు గురై ప్రజలు పిచ్చికేకలు గావుకేకలు తిరుగుతున్నారు

డీకెన్యూ్ల అందరూ వచ్చారు సంకెళ్ళ గొలుసు మరొకరితో ముడివడింది కదిలిన పోలీసు వ్యాన్ సెంట్రల్ ప్రిజన్ వైపు దూసుకుపోసాగింది ర కళ్ళు ఇనప జల్లెడనుండి ప్రజలను చూస్తూ పరుగెత్తుతున్నాయి

పోరాడవలసిన ప్రజలు కాలినడకపై చిందరవంద న్నారు ఊపిరాడని జనం చేతిగుడ్డలు పెట్టుకొని నడుస్తున్నా

**Edited & Published by V Leelavathy Raghavaiah, at 1-8-4/1/1 Chikkadpalli, Hyderabad-20 & Printed by P Ramakrishna at Raghavu Printers, 1-8-4/1/1 Chikkadpalli, Hyderabad-500 020**